# 1

గోమతి నదీ తీరాన భువనేశ్వరీదేవి ఆలయం ఉంది. ఆలయం నుంచి నది లోపల కొంత దూరం వరకు రాతి మెట్లు కట్టారు. అది వేసవి కాలం. ఒకనాటి సుందర సుప్రభాత సమయాన త్రిపుర మహారాజు గోవిందమాణిక్య ప్రభువు స్నానము చేయుటకు అక్కడికి వచ్చారు వారి సోదరుడు నక్షత్రరాయలు కూడా వెంట ఉన్నారు.

అదే సమయాన ఒక చిన్న బాలిక తన తమ్ముని వెంట బెట్టుకొని ఆ రేవు వద్దకు వచ్చింది. బాలిక రాగానే మహారాజుగారి ధోవతి పట్టి లాగుతూ "మీ రెవరు?" అని అడిగింది.

అందుకు మహారాజుగారు చిరునవ్వు నవ్వుతూ "దేవీ, నేను నీ బిడ్డనే" అని జవాబు చెప్పారు.

"పూజకోసం నాకు పూలు కోసిపెట్టవూ!" అని అడిగింది బాలిక.

"అలాగే, పద దేవీ!" అన్నారు మహారాజుగారు.

ఈ దృశ్యాన్ని చూచి మహారాజుగారి అనుచరులు కలవర పడసాగారు వారు మహారాజుగారికి నమస్కరించి సవినయంగా "మహారాజా, ఆపనికి తమరెందుకు? ఆ బాలికకు కావలసిన పుష్పములు మేము కోసి ఇస్తాము" అనిఅన్నారు.

"వద్దు, ఆమె అడిగినది నన్ను గనుక నేనే ఆమెకు కావలసిన పుష్పాలు కోసి ఇస్తాను" అని అన్నారు మహారాజుగారు.

మహారాజుగారు అటుతిరిగి ఆ బాలిక ముఖ మండలాన్ని చూడసాగారు. ఆనాటి సుందర సుప్రభాతంతో ఆమె ముఖారవిందము పోటీ పడుతూ ఉంది మహారాజుగారి చేతిని పట్టుకొని ఆ బాలిక ఆలయం ప్రక్కనే ఉన్న పూలతోటలో తిరుగుతూ ఉంది ఆ సమయాన నలువైపుల వికసించిన మల్లె పూలవలె కన్పించుచున్న ఆమె ముఖంలోనుంచి పరిమళభరిత భావం వెలువడి ప్రభాతకాననంలో వ్యాపిస్తున్నట్లుగా ఉంది.

తమ్ముడు తన అక్క కొంగు పట్టుకొని ఆమె వెంటే తిరుగుతున్నాడు. అతడు తన అక్కను మాత్రమే ఎరుగును. మహారాజుగారితో అతని కేలాంటి పరిచయమూ లేదు.

మహారాజుగారు బాలికవైపు చూస్తూ "నీ పేరేమిటి?" అని అడిగారు.

"హాసి" అని జవాబు చెప్పింది బాలిక.

తరువాత వారు బాలునివైపు చూస్తూ "మరి నీ పేరేమిటి?" అని ప్రశ్నించారు.

బాలుడు తన విశాల నేత్రాలను మరింత పెద్దవిగా చేస్తూ అక్కవైపు చూడసాగాడు. అతడేమీ జవాబు చెప్పలేదు. హాసి తమ్ముని భుజంమీద చెయ్యివేసి "చెప్పు బాబూ, నా పేరు తాత అని చెప్పు" అని అంది.

బాలుడు తన చిన్నచిన్న పెదవులు కొద్దిగా తెరిచి "తాత" అని అక్క చెప్పినట్లు గంభీరంగా జవాబు చెప్పి ఆమె కొంగును మరింత గట్టిగా పట్టుకొన్నాడు.

"వీడు చిన్నవాడుగదూ, అంకుకని అందరూ వీడిని తాత అని పిలుస్తారు" అని హాసి మహారాజుగారికి నచ్చచెప్పి తరువాత తమ్ముని వైపు తిరిగి "తాతా, మందిరము అను" అని అంది.

బాలుడు గంభీరంగా 'లదంద్' అని అన్నాడు.

హాసి కిలకిల నవ్వేసింది "తాత మందిరము అనేమాట పలకలేడు, లదంద్ అనే అంటాడు మరి 'కడవ' అను" అని అంది తిరిగి తమ్మునితో.

బాలుడు అలాగే గంభీరంగా "బలయి" అని అన్నాడు

హాసి మళ్ళీ నవ్వి "తాత మనవలె కడవ అనలేడు, 'బలయి' అనే అంటాడు" అని చెపుతూ ఆమె తమ్ముని దగ్గరకు లాక్కొని గట్టిగా ముద్దు పెట్టుకొంది

అకస్మాత్తుగా తన అక్కకు ఇంతనవ్వెందుకువచ్చిందో తన మీద ఇంత ప్రేమ నెందుకు చూపిందో తాత ఆలోచనకు అందలేదు. అతడు కళ్ళుఇంతింత చేసుకొని ఆశ్చర్యంగా చూడసాగాడు. 'మందిరము' 'కడవ' అనే మాటలు తాత పలకలేక పోవచ్చు, ఆతప్పు అతనిదేనని అనుకొనుటకువీల్లేదు. తాత వయస్సులో హాసి ఆ మాత్రంకూడా అనగలిగేదికాదు. ఆమె 'మందిరము' అనే మాటను 'లదంద్' అనేది కాదుగాని 'హాలు' అని మాత్రం అనేది. 'కడవ' ను బలయి అనేదో లేదో తెలియదుగాని 'దమ్మిడి'ని 'లుయి' అని మాత్రం పలికేది. తాతయొక్క విచిత్ర ఉచ్చారణకు ఆమెకు చాలా నవ్వొచ్చింది. మరి అంతకంటె ఆశ్చర్య మేముంటుంది!

బాలిక మహారాజుగారితో తాతను గురించి అనేక విష యాలు చెప్పింది- 'ఒకసారి ఒక వృద్ధుడు కంబళి కప్పుకొని వచ్చాడు తాత అతనిని చూచి ఎలుగుబంటి అనుకొన్నాడు. మరీ అంత తెలివి తక్కువవాడు ఒకసారి చెట్టుమీద సీతా ఫలాలు చూచి పక్షులనుకొని వాటిని తోలటానికి చప్పట్లు కొట్టసాగాడు ' ఈ విధంగా అతనిని గురించి అనేక ఉదాహ రణలు చెప్పి తాత తనకంటె చాలా చిన్నవాడనీ, ఏమీ తెలియనివాడనీ నిరూపించటానికి ఆమె ప్రయత్నించింది.

తన తెలివి తేటల్ని గురించి చెప్పేమాటలు అతడు నిశ్చలంగా విన్నాడు. అతనికి ఆ మాటలు ఎంతవరకు అర్థ మయ్యాయో ఏమోగాని వాటిని గురించి బాధపడవలసిన అవసరమేమీ లేదని భావించినట్లు కన్పించాడు

ఈ విధంగా ఆనాటి కార్యక్రమం పూలుకోయు కార్యక్రమంతో ముగిసింది. ఆ చిన్న బాలిక ఒడినిండా పుష్ప ములు కోసిఇచ్చి మహారాజుగారు ఆ నాటికి తమ దేవీపూజ ముగిసినట్లే భావించారు. నిర్మల హృదయులగు ఆ పసివాని స్నేహభరిత దృశ్యాన్ని చూచి, ఆ పవిత్ర హృదయంలోని కోర్కెను పుష్పాలు కోసి ఇచ్చి తీర్చటం ద్వారా దేవీపూజ సంపూర్తి చెందినట్లుంది.

ఆ నాటినుండి మహారాజుగారు నిద్రమేల్కొన్నంత మాత్రానగానీ సూర్యోదయమయినంత మాత్రాన గానీ ప్రాతఃకాలమైనట్లు భావించేవారుకాదు. ఆ చిన్న అక్క

తమ్ముడి ముఖాలు చూచినప్పుడే వారికి తెల్లవారుతూ ఉండేది. ప్రతిరోజు వాళ్ళిద్దరికి పూలు కోసి ఇచ్చిన తరువాతనే మహారాజుగారు స్నానంచేసేవారు. మహారాజుగారు స్నానం చేస్తూవుంటేఅక్క-తమ్ముళ్ళిద్దరూ రేవులో కూర్చొని ఉండేవారు. ఆ బాల బాలికలిద్దరూ అక్కడికి రానిరోజున మహారాజుగారు తమ పూజ సంపూర్తికానట్లే భావించేవారు.

హాసి, తాతలకు తల్లిదండ్రులిద్దరూ లేరు. ఒక పిన తండ్రిమాత్రం ఉన్నాడు అతనిపేరు కేదారేశ్వరుడు. ఈ పిల్లలిద్దరినీ అతడు ప్రాణప్రదంగా చూచుకొనేవాడు ఈ పిల్లలు తప్ప అతనికి కూడా వెనకా ముందూ మరెవరూలేరు.

గోమతినదీతీరాన నాగకేసరపు చెట్టుక్రింద కాళ్ళు చాచుకొని తన అక్క చెప్తున్న కథను కళ్ళు ఇంతింతచేసుకొని తాత వింటూ కూర్చున్నాడు. ఆ సంభాషణకు అంతూ పంతూ ఉండేదికాదు. కానీ అతనికి ఎంతవరకు ఆ మాటలు అర్థమవుతున్నాయో అతనికే తెలియాలి అక్క చెప్తున్న మాటలు విని ఆ చెట్టుక్రింద ఆసూర్యకాంతిలో, ఆస్వచ్ఛంద వాయువులో, ఒక పసివాని హృదయంలో ఎలాంటి ఆలోచనలు కలుగుతాయో, ఎలాంటి దృశ్యాలు చూస్తాడో మనకేం తెలుసు!

తాత మరెవరితోనూ కలిసి ఆడుకొనేవాడు కాదు. అతడు నీడవలె తన అక్కను అంటిపెట్టుకొని తిరిగేవాడు.

అది ఆషాఢమాసం. ఉదయం ఆకాశమంతా మబ్బులు ఆవరించి వున్నాయి ఇంతవరకు వర్షమైతే పడలేదు కానీ మబ్బులు ఇంకా దట్టంగాపట్టే సూచనలు కనిపిస్తున్నాయి.

ఎక్కడో దూరాన వర్షం కురుస్తున్నట్లుంది. చల్లనిగాలి వీస్తుంది గోమతినదిమీద, దానికి ఇరువైపుల ఉన్న అడవి మీద అంధకారం వ్యాపించినట్లు మబ్బులనీడ పడుతుంది. నిన్న అమావాస్య నిన్ననే భువనేశ్వరీదేవి పూజ జరిగింది.

సరిగ్గా సమయానికి హాసి తాత చెయ్యిపట్టుకొని స్నానానికి వచ్చింది రేవులోని తెల్లరాతిమెట్లమీదుగా రక్తపుధార ఒకటి నదిలో కలిసినట్లుంది నిన్నరాత్రి ఇక్కడ నూరుదున్న పోతుల్ని బలి ఇచ్చారు, ఇది వాటి రక్తమే.

హాసి ఆ రక్తప్రధారను చూచి తటాలున ఆమె మహారాజుగారి చెవిలో "బాబా, ఈ మరక ఏమిటి?"అని అడిగింది.

"దేవీ! ఇది రక్తపు మరక" అని జవాబు చెప్పారు మహారాజుగారు.

"ఇంత రక్తం ఎందుకు?" అని ప్రశ్నించింది బాలిక.

ఆ బాలిక ఆ మాటను ఎంతో భయపడుతున్నట్లు "ఇంత రక్తం ఎందుకు?" అని అడిగింది. మహారాజుగారి హృదయాన్ని మాటిమాటికి "ఇంత రక్తం ఎందుకు?" అనే ప్రశ్న కలవరపర్చసాగింది. ఉన్నట్టుండి మహారాజుగారు కంపించిపోయారు

మహారాజుగారు చాలాకాలంగా ప్రతిసంవత్సరము ఈ రక్తప్రవాహాన్ని చూస్తూనేఉన్నారు. కానీ ఒక చిన్న బాలిక ప్రశ్నవిన్నతరువాత వారి మనస్సులో"వ్యర్థంగా ఇంత రక్తం ఎందుకు?" అనే ఆలోచన వచ్చింది. బాలిక అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పటం మర్చిపోయారు. పరధ్యానంగా వారు స్నానంచేస్తూ ఈ ప్రశ్నను గురించే ఆలోచించసాగారు.

హాసి తన కొంగును నీటిలో తడిపి పెట్టుమీ
కూర్చొని రక్తపుమరకను తుడిచివేయసాగింది ఆమె చేస్తున్న పనిని చూచి తాతకూడా తన చిన్ని చేతులతో ఆ మరకను తుడిచివేయసాగాడు. హాసి కొంగంతా రక్తంతో ఎరుపెక్కింది మహారాజుగారి స్నానం పూర్తయేలోపల అక్కతమ్ముళ్ళిద్దరూ ఆ రక్తపు మరకను తుడిచివేశారు

ఆ రోజున ఇంటికి తిరిగి వచ్చిన తరువాత హాసికి జ్వరం వచ్చింది మూసినకన్ను తెరవకుండా పడుకొని ఉన్న అక్క దగ్గర కూర్చుని తాత ఆమెకన్నులు తెరవటానికి ప్రయత్నించేవాడు. మధ్యమధ్య 'అక్కా!' అని పిలిచేవాడు. ఒక క్షణకాలం అక్క కన్నులు తెరిచి 'ఏమిటి బాబూ?' అంటూ అతనిని దగ్గరకు లాక్కొనేది. అంతలోనే కనురెప్పలు బరువుగా వాలిపోయేవి తాత ఏమీ మాట్లాడకుండా అలాగే అక్క ముఖంలోకి చూస్తూ కూర్చునేవాడు. కొంతసేపు అలా కూర్చున్న తరువాత అతడు అక్కముఖంలో ముఖం పెట్టి నెమ్మదిగా "అక్కా, నువ్వు లేవవా?" అని అడిగాడు హాసి తటాలునమేల్కొని తాతను హృదయానికి హత్తుకుంటూ "ఎందుకు లేవను బాబూ?" అని అన్నదే కాని అక్కలో లేవగల శక్తిలేదు.

తాతయొక్క చిన్న హృదయంలో అంధకారం ఆవరించినట్లుంది. రోజంతా ఆటపాటలతో ఆనందంగా గడపవచ్చుననే అతని ఆశ నిరాశేఅయింది. అకస్మాత్తుగా నల్దిశల అంధకారం ఆవరించింది. ఇంటిపెంకుల మీద పడుతున్న వర్షపు చినుకుల చప్పుడు వినిపిస్తూ వుంది. దొడ్డిలో వున్న

ఎక్కడో దూరాన వర్షం కురుస్తున్నట్లుంది. చల్లనిగాలి వీస్తుంది. గోమతినదిమీద, దానికి ఇరువైపుల ఉన్న అడవి మీద అంధకారం వ్యాపించినట్లు మబ్బులనీడ పడుతుంది. నిన్న అమావాస్య నిన్ననే భువనేశ్వరీదేవి పూజ జరిగింది.

సరిగ్గా సమయానికి హాసి తాతచెయ్యిపట్టుకొని స్నానానికి వచ్చింది రేవులోని తెల్లరాతిమెట్లమీదుగా రక్తప్రధార ఒకటి నదిలో కలిసినట్లుంది నిన్నరాత్రి ఇక్కడ నూరుదున్న పోతుల్ని బలి ఇచ్చారు, ఇది వాటి రక్తమే.

హాసి ఆ రక్తప్రధారను చూచి తటాలున ఆమె మహారాజుగారి చెవిలో "బాబా, ఈ మరక ఏమిటి?"అని అడిగింది.

"దేవీ! ఇది రక్తపు మరక" అని జవాబు చెప్పారు మహారాజుగారు.

"ఇంత రక్తం ఎందుకు!" అని ప్రశ్నించింది బాలిక.

ఆ బాలిక ఆ మాటను ఎంతో భయపడుతున్నట్లు "ఇంత రక్తం ఎందుకు!" అని అడిగింది. మహారాజుగారి హృదయాన్ని మాటిమాటికి "ఇంత రక్తం ఎందుకు!" అనే ప్రశ్న కలవరపర్చసాగింది. ఉన్నట్టుండి మహారాజుగారు కంపించిపోయారు

మహారాజుగారు చాలాకాలంగా ప్రతిసంవత్సరము ఈ రక్తప్రవాహాన్ని చూస్తూనేఉన్నారు. కానీ ఒక చిన్న బాలిక ప్రశ్నవిన్నతరువాత వారి మనస్సులో"వ్యర్థంగా ఇంత రక్తం ఎందుకు!" అనే ఆలోచన వచ్చింది. బాలిక అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పటం మర్చిపోయారు పరధ్యానంగా వారు స్నానంచేస్తూ ఈ ప్రశ్నను గురించే ఆలోచించసాగారు.

హాసి తన కొంగును నీటితో తడిపి పెట్టుబిగా కూర్చొని రక్తపుమరకను తుడిచివేయసాగింది ఆమెచేస్తున్న పనిని చూచి తాతకూడా తన చిన్ని చేతులతో ఆ మరకను తుడిచివేయసాగాడు. హాసి కొంగంతా రక్తంతో ఎరు పెక్కింది మహారాజుగారి స్నానం పూర్తయేలోపల అక్క తమ్ముళ్ళిద్దరూ ఆ రక్తపు మరకను తుడిచివేశారు.

ఆ రోజున ఇంటికి తిరిగి వచ్చిన తరువాత హాసికి జ్వరం వచ్చింది మూసినకన్ను తెరవకుండా పడుకొని ఉన్న అక్క దగ్గర కూర్చుని తాత ఆమెకన్నులు తెరవటానికి ప్రయత్నించేవాడు. మధ్యమధ్య 'అక్కా!' అని పిలిచేవాడు. ఒక క్షణకాలం అక్క కన్నులు తెరిచి 'ఏమిటి బాబూ?' అంటూ అతనిని దగ్గరకు లాక్కొనేది. అంతలోనే కనురెప్పలు బరువుగా వాలిపోయేవి తాత ఏమీ మాట్లాడకుండా అలాగే అక్క ముఖంలోకి చూస్తూ కూర్చునేవాడు. కొంతసేపు అలా కూర్చున్న తరువాత అతడు అక్కముఖంలో ముఖం పెట్టి నెమ్మదిగా "అక్కా, నువ్వు లేవవా?" అని అడిగాడు హాసి తటాలున మేల్కొని తాతను హృదయానికి హత్తుకుంటూ "ఎందుకు లేవను బాబూ?" అని అన్నదే కాని అక్కలో లేవ గల శక్తి లేదు.

తాతయొక్క చిన్న హృదయంలో అంధకారం ఆవ రించినట్లుంది. రోజంతా ఆటపాటలతో ఆనందంగా గడప వచ్చుననే అతని ఆశ ని రాశే అయింది. అకస్మాత్తుగా నల్దిశల అంధకారం ఆవరించింది. ఇంటిపెంకుల మీాద ౼డుతున్న వర్షపు చినుకుల చప్పుడు వినిపిస్తూ వుంది. దొడ్డిలో వున్న

చింతచెట్టు వర్షానికి తడుస్తూ ఉంది. బజార్లలో ఎవరూ తిర గటం లేదు కేదారేశ్వరుడు ఒక వైద్యుని తీసుకొనివచ్చాడు. వైద్యుడు హాసి నాడి చూచి, ఆమె పరిస్థితి గమనించి ఏమీా లాభంలేదనే అనుకొన్నాడు

మర్నాడు మహారాజుగారు స్నానానికి వచ్చారు. రోజూ తన కోసం ఎదురుచూచే అక్క తమ్ముడు అక్కడ వారికి కన్పించ లేదు. జోరున వర్షం కురుస్తున్నందు వల్ల వాళ్ళిద్దరూ రాలేదేమోనని మహారాజుగారు అను కున్నారు స్నానతర్పణాలు ముగించుకొని మహారాజుగారు పల్లకీలో కూర్చొని కేదారేశ్వరుని ఇంటికి పోవలసిందిగా బోయీలకు ఆజ్ఞాపించారు సేవకులందరికీ ,చాలా ఆశ్చర్యం కలిగింది. కానీ మహారాజుగారి ఆజ్ఞకు వ్యతిరేకంగా వారేమి మాట్లాడగలరు?

మహారాజుగారి పల్లకీ కేదారేశ్వరుని ఇంటి ముందు ఆగేసరికి ఇంటిలో కలవరం బయలు దేరింది. ఆ గోలలో అందరూ హాసి రోగం సంగతే మర్చిపోయారు కానీ తాత మాత్రం అక్కడి నుంచి కదలలేదు చైతన్యం లేకుండా పడి ఉన్న అక్కచెంత కూర్చొని, ఆమె కొంగుపట్టుకొని ముఖం లోకి చూస్తూ ఉన్నాడు.

మహారాజుగారు లోనికిరావటంచూచి ఏంజరిగింది?'' అని తాత అడిగాడు.

వ్యాకుల మనస్కుడగు మహారాజుగారు జవాబు చెప్ప లేదు. తాత తలఆడిస్తూ "అక్కకుదెబ్బతగిలిందా?" అని మళ్ళీ ప్రశ్నించాడు.

పినతండ్రి కేదారేశ్వరుడు మండిపడుతూ "అవును, దెబ్బతగిలింది" అని అన్నాడు.

అదే సమయంలో తాత అక్క దగ్గరకు వెళ్ళి ఆమె తలను పైకెత్తి కౌగలించుకుంటూ "అక్కా, నీకు దెబ్బతగిలిందా?" అని అడిగాడు. దెబ్బతగిలినచోట వ్రాది, తన చేతితో నిమిరి నొప్పిని పోగొట్టాలని అతని అభిప్రాయం. కానీ అక్క ఏమీ జవాబు చెప్పక పోయేసరికి ఆ బాలుడు సహనం కోల్పోయాడు తన ప్రశ్నకు జవాబేమీ రానందువల్ల అతని చిన్న చిన్న పెదవులు పైకి లేచిపడసాగాయి. మరుక్షణంలో బిగ్గరగా ఏడ్చేశాడు అతడు చిన్నటినుంచి అక్క దగ్గరే కూర్చొని ఉన్నాడు ఆమె తనతో ఒక్కమాటకూడా మాట్లాడలేదు. ఎందుకని? తానుచేసిన తప్పేమిటి? అక్కకు తన మీద ఇంత కోపం ఎందుకు?

మహారాజుగారి సమక్షంలో తాత ఆ విధంగా వ్యవహరించటం చూచి కేదారేశ్వరుడు గాబరాపడ్డాడు. కోపంగా తాత చెయ్యిపట్టుకొని మరొకగదిలోకి లాక్కుపోయాడు అప్పటికీ అక్క ఏమీ మాట్లాడలేదు.

రాజవైద్యులు వచ్చి చూచారు. వారు కూడా అనుమానంగానే చెప్పారు మహారాజుగారు సాయంత్రం మళ్ళీ హాసిని చూడటానికి వచ్చారు ఆ సమయంలో హాసి "అమ్మా ఇంత రక్తం ఎందుకు?" అని కలవరిస్తూ ఉంది.

"దేవీ, ఈ రక్తప్రవాహాన్ని నేను ఆపివేస్తాను" అన్నారు మహారాజుగారు.

"తమ్ముడూ, తాతా! మనిద్దరం కలిసి ఈ రక్తపు మరకను తుడిచివేద్దాం" అని అన్నది గాలిక.

"అలాగే చేద్దాం, దేవీ. నేను కూడా మీతోపాటు ప్రయత్నిస్తాను" అన్నారు మహారాజుగారు.

సాయంత్రం తరువాత కొద్ది సేపటికి హాసి కన్నులు తెరిచి ఎవరికోసమో వెతుకుతున్నట్లు చుట్టూ చూచింది. అప్పటికి తాతప్రక్కగదిలో ఏడ్చిఏడ్చి నిద్రపోయాడు ఎవరూ కన్పించక పోయేసరికి హాసి కన్నులు మూసుకొంది. అంతే, ఇకమళ్ళీ తెరవనే లేదు రాత్రి రెండో జామున, మహారాజు గారి ఒడిలో హాసి చనిపోయింది.

హాసిని శాశ్వతంగా ఈ ఇంటినుంచి తీసుకువెళుతున్న సమయంలో తాత ఈ ప్రపంచాన్ని మరచి నిద్రపోతున్నాడు. అతనికి ఈవిషయం తెలిసిగనుకఉంటే అతడుకూడా అక్కవెంట చిన్న నీడవలె వెళ్ళి ఉండేవాడు.

# 3

మహారాజుగారు సభ తీర్చి వున్నారు. భువనేశ్వరి ఆలయంలోని పూజారి కార్యార్థియై మహారాజుగారి దర్శనానికి వచ్చాడు.

ఆ పురోహితుని పేరు రఘుపతి పట్టణ ప్రజలు పూజారిని 'చేంతాయి' అని అంటారు. భువనేశ్వరి దేవి పూజ జరిగిన పదునాలుగు రోజుల తరువాత అర్ధరాత్రి సమయంలో 'పదునాలుగు దేవతలకు' పూజ జరుగుతుంది. ఈ పూజ సమయంలో ఒక పగలు రెండు రాత్రుళ్ళు ఇళ్ళలోనుంచి ఎవరూ

బయటకు రావటానికి వీల్లేదు- మహారాజుగారుకూడా రాకూడదు. అందుకు వ్యతిరేకంగా మహారాజుగారు బయటకు రావటం జరిగితే పూజారికి జరిమానా చెల్లించుకోవాలి ఈ పూజనాటి రాత్రి ఆలయంలో నరబలి జరుగుతుందని ఒక వదంతి ఉంది. ఈ పూజ సందర్భంలో మొట్టమొదట బలి ఇచ్చే పశువుల్ని మహారాజుగారు దానంగా ఇచ్చుకుంటారు. ఈ బలినిమిత్తం పశువుల్ని అడగటం కోసమే పురోహితుడు మహారాజుగారి వద్దకు వచ్చాడు. ఇంకా పదునాలుగురోజుల అనంతరం ఆ పూజ జరుగుతుంది

"ఈ సంవత్సరంనుంచి ఆలయంలో పశుబలి జరుగదు" అని అన్నారు మహారాజుగారు

సభాసదులందరూ నిశ్చేష్టులై మహారాజుగారి వైపు చూడసాగారు. మహారాజుగారి సోదరుడు నక్షత్రరాయలు వారికి కూడా ఈ మాటవిని చాలా ఆశ్చర్యం కలిగింది.

పురోహితుడు రఘుపతి "నేను కలగంటున్నానా?" అని అన్నాడు.

అందుకు మహారాజుగారిచ్చిన జవాబు ఇది; "లేదు, పూజారిగారూ, ఇంతకాలం మేమే కలగంటూ వచ్చాము. ఇవాళ మాకు జ్ఞానోదయం కలిగింది. ఒక బాలిక రూపంలో దుర్గామాత మాకు దర్శన మిచ్చింది కరుణాస్వరూపిణియగు మాత తన ప్రాణుల రక్తాన్ని ఇక చూడలేదు"

"ఆ తల్లి ఇంతకాలంగా ఎందుకు రక్తాన్ని కోరుతూ వచ్చింది?" అని రఘుపతి ప్రశ్నించాడు.

"లేదు, ఆ తల్లి రక్తాన్నెప్పుడూ కోరలేదు. మీరు రక్తపానంచేస్తుంటే ఆమె చూడలేక తలవంచుకొనేది" అన్నారు మహారాజుగారు

"మహారాజా, రాజ్యవ్యవహారాలలో తమరు ప్రతిభా సంపన్నులు కావచ్చు- ఆ విషయంలో ఎవరికీ ఎలాంటి సందేహమూ లేదు కానీ పూజ మొదలగు విషయాలను గురించి తెమకు ఏమీ తెలియదు ఆ పని భువనేశ్వరిమాతకు అయిష్టం కలిగించేదయితే నాకు ముందే తెలిసి ఉండేది" అన్నాడు పురోహితుడు రఘుపతి.

అందుకు నక్షత్రరాయలు చాలా తెలివిగలవానివలె తల ఆడిస్తూ "అవును, ఆ మాట కూడా నిజమే ఆ తల్లి ఇష్టానికి విరుద్ధమైన పని జరిగినప్పుడు ముందు పూజారిగారికి తెలిసేది" అని అన్నాడు.

"హృదయం పాషాణసదృశ్యంగా మారిపోయినవారికి ఆ తల్లిమాటలు విన్పించవు" అన్నారు మహారాజుగారు

నక్షత్రరాయలు "మీరు దీనికి తప్పక జవాబు చెప్పాలి" అన్నట్లుగా పూజారి ముఖంలోకి చూచారు

రఘుపతి మిక్కిలి క్రుద్ధుడై తమరు కపటియగు నాస్తికునివలె మాట్లాడుతున్నారు" అన్నాడు.

నక్షత్రరాయలు అతనికి ప్రతిధ్వనివలె నెమ్మదిగా "అవును, నాస్తికునివలె మాట్లాడారు" అని గొణిగాడు

గోవింద మాణిక్యుల వారు కోపంతో ఎర్రబడిన రఘుపతి ముఖంలోకి చూస్తూ ఇలా అన్నారు: "పూజారి గారూ, మీరు రాజసభలో కూర్చొని అనవసరంగా సమ

యాన్ని పాడుచేసు కొంటున్నారు ఆలయంలో పూజా సమయం మించిపోతూ ఉంది. మీరు ఆలయానికి వెళ్ళండి. మీరు వెళుతూ వెళుతూ కన్పించిన వారందరితో 'నా రాజ్యంలో జంతుబలి ఇచ్చే వారిని దేశనుంచి బహిష్కరిస్తాము' అని చెప్పండి"

అప్పుడు రఘుపతి కంపిస్తూ లేచినిలబడి జందెము తాకి "నువ్వు సర్వనాశనమై పోతావు" అని అన్నాడు అది విని సభాసదులందరూ పూజారిమీద విరుచుకుపడ్డారు మహారాజు గారు సైగతో అందరినీ శాంతింప చేశారు అందరూ తప్పుకొని దూరంగా నిల్చున్నారు.

"నువ్వు మహారాజువు, నువ్వు కోరుకుంటే చాలు ప్రజల సర్వస్వమూ దోచుగలవు అంతమాత్రాన నువ్వు బలి ఇవ్వటంకూడా ఆపివేయగలవా? నీలోవున్న శక్తిసామర్థ్యాలేమిటో నేనూ చూస్తాను. నేను భువనేశ్వరిమాత ఆలయంలో ఉన్నంతకాలం ఆమె పూజలకు నువ్వెలా ఆటంకం కల్గిస్తావో చూస్తాను" అని అన్నాడు రఘుపతి.

మహారాజుగారి విచిత్ర స్వభావం మంత్రికి చిరపరిచితమే. ఒక విషయం నిశ్చయించుకున్న తరువాత ఇక దాని విషయంలో మహారాజుగారి సంకల్పాన్ని అంత త్వరలో మార్చటానికి వీలుపడదని మంత్రిగారికి తెలుసు వారు భయపడుతూ నెమ్మదిగా "మహారాజా, తమ పూర్వీకులు ఎల్లప్పుడూ భువనేశ్వరి దేవికి బలిఇచ్చే ఆచారాన్ని పాటిస్తూ వచ్చారు ఇందుకు విరుద్ధంగా ఎప్పుడూ జరుగలేదు" అని చెప్పి అంతటితో మౌనం వహించారు.

మహారాజుగారుకూడా మౌనం వహించారు. మంత్రి గారు మళ్ళీ మహారాజుగారి నుద్దేశించి "ఇంతకాలానికి ఇవాళ తమరు తమ పూర్వీకులు పాటిస్తూ వచ్చిన ఆచారాన్ని ఆపి వేసినట్లయితే వారి ఆత్మలకు శాంతి నశిస్తుంది" అని అన్నారు

మహారాజుగారు ఆలోచించసాగారు. ఇంతలో నక్షత్ర రాయలు తన తెలివిని ప్రదర్శిస్తూ "అవును, స్వర్గంలో ఉన్న వారి ఆత్మలకు శాంతిఉండదు" అని అన్నాడు.

మంత్రిగారు మళ్ళీ "మహారాజా, తమరు మరొక పని చేయవచ్చును: వెయ్యిజంతువుల్ని బలి ఇచ్చేందుకు బదులు వంద జంతువులకైనా అనుమతి ఇవ్వండి" అని అన్నారు.

పిడుగు పడ్డచందాన సభాసదులందరూ నిశ్చేష్టులై చూస్తూ ఉండిపోయారు గోవిందమాణిక్య ప్రభువు దీర్ఘాలోచనా నిమగ్నులై కూర్చొని ఉన్నారు. క్రుద్ధుడైన పురోహితుడు మరింత వ్యాకులపడుతూ రాజసభనుంచి లేచివెళ్ళటానికి సిద్ధపడ్డాడు.

అదేసమయాన ద్వారపాలకుని దృష్టిలో పడకుండా తప్పించుకొని నగ్నంగా ఉన్న ఒక చిన్న బాలుడు రాజసభలోకి ప్రవేశించాడు. రాజసభలో నిలబడి, కళ్ళుఇంతింత చేసుకొని మహారాజుగారి ముఖంలోకి చూస్తూ "అక్క ఎక్కడ ఉంది?" అని ప్రశ్నించాడు.

మహారాజుగారు వెంటనే సింహాసనం నుండి దిగివచ్చి ఆ బాలుని ఎత్తుకున్నారు. తరువాత మంత్రివైపుకు తిరిగి

"నేటినుండి మన రాజ్యంలో జంతుబలి జరగటానికి వీల్లేదు. ఈ విషయంలో మీ రిక ఏమీ చెప్పవద్దు" అని అన్నారు.

"చిత్తం!" అన్నారు మంత్రిగారు

తాత మహారాజుగారి ముఖంలోకి చూస్తూ "అక్క ఎక్కడ ఉంది?" అని అడిగారు

"తల్లివద్ద ఉంది" అని మహారాజుగారు జవాబు చెప్పారు.

తాత కొద్ది క్షణాలు నోట్లో వ్రేసు వేలుకొని మౌనం వహించాడు తన అక్కకు ఏదో ఆశ్రయం లభించినట్లు అని పించిందతనికి. ఆనాటినుంచి మహారాజుగారు తాతను తమ వద్దనే ఉంచుకున్నారు. పినతండ్రి కేదారేశ్వరునికి కూడా ఆనాటినుంచి రాజాశ్రయం లబించింది.

సభాసదులు తమలో తాము రకరకాలుగా మాట్లాడు కోసాగారు- "ఇంత అన్యాయం ఎక్కడా చూడలేదు. తీరూ తెన్నూ లేని రాజ్యమైపోయింది. బౌద్ధ మతస్తులు మాత్రమే బలిని వ్యతిరేకిస్తారని వింటూఉండేవాళ్ళము. చివరికి హిందు వులలో కూడా అలాంటి పద్ధతులే సాగుతాయని భయంగా ఉంది."

నక్షత్రరాయలు కూడా సభాసదుల అభిప్రాయానికి వంతపలికాడు- 'మన హిందూరాజ్యంలో కూడా బౌద్ధుల ఆచారాలు తలెత్తుతాయని అనుమానంగా వుంది."

అందరూ ఇది యేదో అనర్థానికి దారి తీస్తుందని ఆలో చించారు. ఇది ఆ అనర్థలక్షణం కాక మరేమవుతుంది? ఇలాగే సాగితే హిందువులకు, బౌద్ధులకు తేడాఏమిటి?

# 4

భువనేశ్వరి ఆలయంలోని సేవకుడు జయసింహుడు క్షత్రియుడు అతనితండ్రి సుచేతసింహుడు త్రిపుర రాజమహాలులో పనిచేసేవాడు అతడు చనిపోయినప్పుడు జయసింహుడు చాలా పసివాడు. ఈ అనాధబాలుని మహారాజుగారు భువనేశ్వరి ఆలయంలో సేవకునిగా నియమించారు జయసింహుడు పూజారిగారి సంరక్షణలోనే పెరిగి పెద్దవాడయ్యాడు వారి వద్దనే విద్యాబుద్ధులు నేర్చుకొన్నాడు. చిన్నతనంనుండి ఆలయంలోనే పెరిగి పెద్దవాడవటంవల్ల జయసింహుడు ఆలయాన్ని తన ఇల్లుగా భావించి ప్రేమించేవాడు ఆలయంలోని ప్రతిరాయి, ప్రతిభాగము అతనికి పూర్తిగా పరిచయమైనదే.

జయసింహునికి తల్లికూడా లేదు. అతడు భువనేశ్వరీదేవి విగ్రహమునే తన తల్లిగా భావించేవాడు. ఆ విగ్రహం ఎదుటకూర్చొని అతడు ఏమేమో సంభాషించేవాడు. తాను ఒంటరిగా ఉన్నట్లే అతడు ఏనాడూ అనుకోలేదు.

ఇంకా అతనికి ఆ చుట్టుపట్ల అనేకమంది మిత్రులు వున్నారు- ఆలయం ప్రక్కనే ఉన్న తోటలోని మొక్కలనేకం అతడు నాటినవే. అతడు నాటిన మొక్కలు క్రమంగా పెరిగి పెద్దవవుతున్నాయి. వాటికి రకరకాల లతలు అల్లుకొంటున్నాయి, కొమ్మలు పెరిగి దట్టమైన నీడనిస్తున్నాయి. పరిపూర్ణ యౌవనంలో ఉన్న పచ్చని ఆకులతో దట్టముగా ఉన్న లతలవల్ల పొదరిళ్ళు నేత్రానందంకలిగిస్తున్నాయి. కానీ తోటలోని సమస్త వృక్షములు మొక్కలు, వాటిగొప్పతనము

జయసింహుని ఆత్మలోని కథానికలు, ఇవన్నీ అతని ప్రేమ గాధలు. ఈ విషయం మాత్రం మరెవరికీ తెలియదు. అద్వితీయమగు తన బల పౌరుషాలకు అతడు చాలా ప్రసిద్ధి, అతనిని గురించి ఇతరులకు తెలిసినది దే.

ఆలయంలో తాను చేయవలసిన పనులన్నీ ముగించుకొని అతడు తన కుటీర ద్వారంలో కూర్చొని వున్నాడు. ఎదురుగా తోట ఉంది. సాయంత్రమవుతూ ఉంది, మబ్బులు దట్టంగా పట్టటమేగాక వర్షం కూడా పడుతూ ఉంది. కొత్త వర్షపు నీటిలో జయసింహుని తోటలోని వృక్షసముదాయం స్నానంచేస్తూ ఉంది. వర్షపు చినుకులుచేసే నాట్యానికి చెట్ల ఆకులమీద ఆనంద తరంగాలు వ్యాపించాయి. వర్షపు నీరు చిన్నచిన్న కాలువలుగా కలకల ధ్వనితో గోమతి నదిలోనికి వచ్చి కలుస్తున్నాయి జయసింహుడు ఆనంద నిమగ్నుడై తనతోటవైపు చూస్తూ కూర్చున్నాడు నల్దిశల మేఘాలు ఆవరించిన అంధకారం, చెట్లనీడలు, దట్టంగావున్న చెట్లఆకుల పచ్చదనం, కప్పల బెకబెకలు, వర్షంపడుతున్న చప్పుడు– ఎటు చూచినా ఇవే. ఉన్నకొద్దీ మబ్బులు మరింత దట్టంగా పట్టటం చూచి జయసింహుని ప్రాణానికి చాలా హాయి అనిపించింది.

అదేసమయాన వర్షంలో తడుస్తూ రఘుపతి అక్కడికి చేరుకున్నాడు జయసింహుడు గబగబలేచి కాళ్ళు కడుగుకొనుటకు నీళ్ళు, పొడివస్త్రము తెచ్చియిచ్చాడు.

రఘుపతి కోపంతో మండిపడుతూ “నిన్నివన్నీ ఎవరు తెమ్మన్నారు?” అని అంటూ నీళ్ళచెంబును, వస్త్రాన్ని దూరంగా విసరిపారేశాడు.

జయసింహుడు నీళ్ళు తీసుకొని తానే వారి కాళ్ళు కడగటానికి ముందుకు వచ్చాడు రఘుపతి విసుక్కొంటూ "ఆగు, అక్కడే ఆగు" అని నీళ్ళ చెంబును మళ్ళీ తన్నేశాడు.

రఘుపతి ఇలావ్యవహరించటానికి గల కారణం ఏమిటో తెలియక జయసింహుడు నిశ్చేష్టుడై చూస్తూ నిల్చున్నాడు. అక్కడ నేలమీద పడివున్న పొడివస్త్రాన్ని అందుకొని జయసింహుడు లోనికి వెళ్ళబోతూ వుండగా రఘుపతి మళ్ళీ రుసరుసలాడుతూ "ఆగు, నువ్వు ఆ వస్త్రాన్ని ముట్టుకోవద్దు" అంటూ దానిని అందుకొని దుస్తులు మార్చుకున్నాడు. తరువాత వెళ్ళి కాళ్ళు కడుక్కున్నాడు.

జయసింహుడు భయపడుతూ నెమ్మదిగా "ప్రభూ నా వల్ల అపరాధమేమైనా జరిగిందా?" అని అడిగాడు.

రఘుపతి తీవ్రంగానే "నీ వల్ల అపరాధం జరిగిందని ఎవరన్నారు?" అని అన్నాడు.

జయసింహుడు మనస్సులో బాధపడుతూ మెదలకుండా కూర్చున్నాడు.

రఘుపతి చికాకుపడుతూ ముందువసారాలో అటూ ఇటూ పచార్లు చేయసాగాడు రాత్రి చాలా ప్రొద్దుపోయే వరకు అలాగే జరిగిపోయింది. వర్షంకూడా అలాగే కురుస్తూనే ఉంది. చివరికి రఘుపతి జయసింహుని వీపునిమురుతూ నెమ్మదిగా "వత్సా, వెళ్ళినిద్రపో. చాలా ప్రొద్దుపోయింది" అని అన్నాడు.

"రఘుపతి కంఠస్వరంలోని మార్పును గమనించి జయసింహుడు "ప్రభూ, ముందు మీరు వెళ్ళి నిద్రిస్తే తరువాత నేనుకూడా వెళ్ళి పడుకొంటాను" అని అన్నాడు వినయంగా.

"లేదు, నాయనా! నా కింకా ఆలస్యం అవుతుంది ఇవాళ నీ పట్ల కోపంగా వ్యవహరించాను నువ్వు మరో విధంగా అనుకోని ఏమీ బాధపడవద్దు. ఇవాళ నా మన స్సేమీ బాగా లేదు. విషయాలన్నీ వివరంగా నీతో రేపు ఉదయం చెపుతాను. వెళ్ళి నిద్రపో" అని అన్నాడు రఘుపతి

"చిత్తం!" అని జయసింహుడు అక్కడినుంచి వెళ్ళి పోయాడు. రఘుపతిరాత్రంతా అలాపచార్లుచేస్తూ నేగడిపాడు

జయసింహుడు ఉదయం నిద్ర లేవగానే వచ్చి గురువు గారికి నమస్కరించి ఎదురుగా నిల్చున్నాడు

"జయసింహా, మాతకు బలి ఇవ్వకూడదని ఆపి వేశారు" అని చెప్పాడు రఘుపతి

"ప్రభూ, ఎందుకని అలా జరిగింది?" అని అడిగాడు జయసింహుడు

"మహారాజుగారు ఆ విధంగా ఆజ్ఞాపించారు" అని అన్నాడు రఘుపతి

"ఏ మహారాజుగారు!" అని జయసింహుని ప్రశ్న.

"ఇక్కడ మనకు ఎందరు మహారాజులు ఉన్నారు? మాత ఆలయంలో జంతుబలి జరగటానికి వీల్లేదని గోవింద మాణిక్య మహారాజుగారు ఆజ్ఞాపించారు"

"మరి నరబలి?"

"నీతో చాలా చిక్కేవచ్చింది బలి అనేదేజరగటానికి వీల్లేదు."

"ఏ బలీ జరగటానికి వీల్లేదన్నమాట!"

"అవును."

"గోవిందమాణిక్య ప్రభువు అలా ఆజ్ఞాపించారా?"

"అవును, ఒకమాట ఎన్నిసార్లు చెప్పాలి?"

జయసింహుడు కాస్సేపటి వరకు ఏమీ మాట్లాడ లేదు తనలో తాను ఆలోచించుకోసాగాడు- "గోవింద మాణిక్య ప్రభూ! జయసింహుడు గోవిందమాణిక్య ప్రభువును చిన్ననాటినుంచి దేవతా స్వరూపులుగా భావించాడు. ఆకా శంలో పూర్ణచంద్రునిచూచినప్పుడు చిన్నపిల్లల మనస్సులలో ఎలాంటి ఆసక్తి కలుగుతుందో జయసింహునికి గోవింద మాణిక్య ప్రభువు యందు అలాంటి భావమే ఉండేది గోవింద మాణిక్య ప్రభువుయొక్క ప్రశాంతమగు సుందర ముఖార విందముచూచి జయసింహుడు తన ప్రాణాలనుసైతం త్యాగం చేయగలడు "

"దీనికి ఏదో ప్రతీకారము చేయక తప్పదు" అన్నాడు రఘుపతి.

"తప్పక చేయవలసిందే నేను మహారాజుగారి వద్దకు వెళ్ళి వారిని వేడుకొంటాను... ..."

జయసింహుడు పూర్తిగా చెప్పకముందే రఘుపతి మధ్యలో అడ్డొస్తూ "అదంతా వ్యర్థం" అన్నాడు.

"అయితే, మరేంచేయాలంటారు?" అని అడిగాడు జయసింహుడు.

రఘుపతి కొద్దిక్షణాలు ఆలోచించి "ఏమిచేయాలో రేపు చెప్తాను. రేపు నువ్వు నక్షత్రరాయలవారి వద్దకువెళ్ళి నన్నొకపర్యాయం రహస్యంగా కలుసుకోవలసిందిగా వారితో చెప్పి రావాలి" అని అన్నాడు.

ఉదయమే నక్షత్రరాయలు వచ్చి పూజారికి నమస్కరించి "పూజారిగారూ, విశేషాలేమిటి?" అని అడిగాడు.

"ఆ మాత ఆజ్ఞ, ముందు మాతకు నమస్కరించు" అన్నాడు రఘుపతి

ఇద్దరూ ఆలయంలోనికి వెళ్ళారు. జయసింహుడుకూడా వాళ్ళ వెనుక లోనికి వెళ్ళాడు. నక్షత్రరాయలు భువనేశ్వరి దేవికి సాష్టాంగ నమస్కారం చేశాడు.

రఘుపతి నక్షత్రరాయల నుద్దేశించి "రాకుమారా, నువ్వు మహారాజువవుతావు" అని అన్నాడు

"నేను మహారాజునవుతానా! పూజారిగారూ, మీరు చెప్పేదిజరగనిపని" అంటూనక్షత్రరాయలు బిగ్గరగానవ్వాడు.

"నువ్వు మహారాజువవుతావని మేము చెప్తున్నాం" అన్నాడు రఘుపతి గట్టిగా నొక్కిపలుకుతూ

"నేను మహారాజునవుతానని మీరంటున్నారు" అని అతడు రఘుపతి ముఖంలోకి చూడసాగాడు

"అయితే, నేను అబద్ధం ఆడుతున్నానా!" అన్నాడు రఘుపతి.

"మీ రెందుకు అబద్ధం ఆడతారు!" అన్నాడు నక్షత్రరాయలు.

"రాత్రి కలలో నాకు కప్ప కనిపించింది. కప్పను కలలో చూస్తే ఫలితం ఏమిటో చెప్పండి" అన్నాడు నక్షత్రరాయలు.

రఘుపతి నవ్వు ఆపుకొని "ఎలాంటి కప్పనుచూచారు? దాని ముఖాన మచ్చఏమైనా వున్నదా?" అని ప్రశ్నించాడు.

నక్షత్రిరాయలు చాలా సగర్వంగా "అవును, దాని ముఖాన మచ్చఉంది మచ్చలేకుండా ఎలా వుంటుంది?" అని అన్నాడు

"అందుకనే, నీకు పట్టాభిషేకయోగం ఉంది" అని చెప్పాడు రఘుపతి

"నాకు పట్టాభిషేకయోగం వుందన్నమాట! నేను మహారాజు నవుతానని మీరు అంటున్నారు, అలా కానట్లయితే?" అని అడిగాడు నక్షత్రరాయలు

"నేను చెప్పినది అబద్ధమవుతుందా?"

"కాదు, కాదు, అలా అని నేనటంలేదు నాకు పట్టాభిషేకయోగం ఉన్నదనిగదా మీరు అనేది. ఒకవేళ జరగదనే అనుకుందాం అలా జరగగూడదంటారా...?"

"లేదు, లేదు, మేము చెప్పినదానికి వ్యతిరేకంగా జరగదు."

"ఇందుకు వ్యతిరేకంగా జరగదు. జరగదనేగదామీరు అనేది! చూడండి, పూజారిగారూ, నేను మహారాజునైన తరువాత మిమ్మల్ని మంత్రిగా నియమిస్తాను."

"మంత్రి పదవిని మేము అంగీకరించము."

నక్షత్రరాయలు జాలి కనబరుస్తూ "అయితే జయసింహుని మంత్రిగా నియమిస్తాను" అని అన్నాడు

"ఆ విషయం తరువాత ఆలోచిద్దాం. నువ్వు మహారాజువు కావాలంటే ముందు చేయవలసిందేమిటో చెపుతాను,

విను. మాత మహారాజు రక్తాన్ని కోరుతుంది కలలో కన్పించి మాత ఈ విషయాన్నే ఆదేశించింది."

"మాత రాజుగారి రక్తాన్ని కోరుతుంది. కలలో కన్పించి మీకు ఈ విషయాన్నే మాత ఆదేశించింది. అది మంచిపనే" అన్నాడు నక్షత్రరాయలు.

"నువ్వు గోవిందమాణిక్యాని రక్తాన్ని తీసుకురావాలి" అని చెప్పాడు రఘుపతి.

నక్షత్రరాయలు 'అలాగే' అని చెప్పాలని కొద్ది క్షణాలవరకు నోరు తెరిచి నిశ్చేష్టుడై చూస్తూ ఉండిపోయాడు. ఆ విషయం 'సబబే' అని అతని మనసుకు తోచలేదు.

రఘుపతి గంభీరకంఠంతో "అకస్మాత్తుగా భ్రాతృస్నేహం పుట్టుకొచ్చిందన్నమాట!" అని అన్నాడు.

నక్షత్రరాయలు పేలవంగా నవ్వుతూ "అవునవును, భ్రాతృస్నేహం! పూజారిగారూ, మీరు చాలా పసందైన మాట అన్నారు - భ్రాతృస్నేహం! ఏదో ఒకటి!" అని అన్నాడు

ఇలాంటి పసందైన, హాస్యాస్పదమగు విషయం వేరొకటి ఉంటుందా- భ్రాతృస్నేహమా! ఎంత అవమానకర విషయం! కానీ, నక్షత్రరాయలు హృదయంలో నవ్వుతూ చులకనగా తీసివేయలేనంత బలంగా భ్రాతృస్నేహం కలిగిందనే విషయం భగవంతునికే తెలుసు.

"అయితే, ఏంచేస్తానంటావో చెప్పు!" అని అడిగాడు రఘుపతి.

"ఏంచేయమంటారో మీరేచెప్పండి" అని అన్నాడు నక్షత్రరాయలు

"అయితే, నేను చెప్పేది జాగ్రత్తగా విను. మాత దర్శనార్థము నువ్వు గోవిందమాణిక్యుని రక్తం తీసుకు రావాలి" అని చెప్పాడు రఘుపతి

నక్షత్రరాయలు మంత్రముగ్ధునివలె మాత దర్శనార్థము గోవిందమాణిక్యుని రక్తం తీసుకు రావాలి" అని అన్నాడు.

రఘుపతి అత్యంత ద్వేషభావంతో "నీ వల్ల ఏమీ జరుగదు" అని అన్నాడు.

"ఏమీ జరుగదా? మీరు చెప్పినట్లే జరుగుతుంది. ఆజ్ఞాపించండి" అన్నాడు నక్షత్రరాయలు

"అయితే ఆజ్ఞాపిస్తున్నాను."

"ఏమని ఆజ్ఞాపిస్తున్నారు?"

రఘుపతి విరక్తిభావంతో "మహారాజు రక్తంచూడాలని దేవికోర్కె. నువ్వు గోవిందమాణిక్యుని రక్తం తెచ్చిమాత కోర్కె తీర్చు, ఇదే నా ఆజ్ఞ" అని అన్నాడు.

"నేను ఇప్పుడు వెళ్ళగానే ఫాతేఖానును ఈ పనికి నియమిస్తాను" అన్నాడు నక్షత్రరాయలు.

"వద్దు, వద్దు. ఈ విషయం మరెవ్వరికీ తెలియ కూడదు. నేను జయసింహుని నీకు సహాయంగా పంపుతాను. ఆ కార్యాన్ని ఎలా నెరవేర్చాలో - ఆ ఉపాయం రేపు ఉదయం చెపుతాను" అన్నాడు రఘుపతి.

నక్షత్రరాయలు రఘుపతి చేతుల్లోనుంచి తప్పించుకొని సాధ్యమైనంత త్వరగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

నక్షత్రరాయలు అక్కడినుండి వెళ్ళిపోయిన తరువాత జయసింహుడు గురుదేవా, ఇలాంటి భయంకర విషయాన్ని నేనింతకు ముందెప్పుడూ వినలేదు భువనేశ్వరి మాత ఎదుట, ఆ మాత పేరు చెప్పి సోదరుడు సోదరుని హత్య చేయాలని చెప్పారు ఆ విషయాన్నివింటూ నేనుకూడా అక్కడే నిలబడి ఉన్నాను'' అని అన్నాడు.

''ఇంతకంటె వేరే ఉపాయం ఏముంది?'' అని అన్నాడు రఘుపతి.

''ఉపాయమా! ఉపాయం ఏమిటి?'' అని అడిగాడు జయసింహుడు.

''నువ్వుకూడా నక్షత్రరాయలు వలెనే ఉన్నావు ఇంత సేపటినుంచి నువ్వు విన్నదేమిటి?''

''నేను విన్న విషయాలు వినదగినవికావు. వాటిని వినటం వలన పాపం చుట్టుకొంటుంది.''

''పాప పుణ్యాల సంగతి నీకేం తెలుసు?''

''ఇంతకాలం నుంచి మీ వద్ద ఉంటూ ఎన్నో విషయాలు నేర్చుకొన్నాను. పాపపుణ్యాలను గురించి నా కేమీ తెలియనే తెలియదా?''

''వత్సా, విను, ఇప్పుడు నీకు మరొక విషయం కూడా నేర్పుతాను. పాపపుణ్యాలనేవి ఏమీ లేనేలేవు. తండ్రి ఎవరు,

సోదరుడెవరు, ఎవరికెవరు? హత్యచెయ్యటమే పాపమైతే హత్యలన్నీ ఒకటేగదా, కానీ హత్య చేయటం పాపమని ఎవరంటారు? హత్య ప్రతిరోజూజరుగుతూనే ఉంటుంది. ఒకడు బండరాయి నెత్తిమీదపడి చనిపోతే, మరొకడు వరదనీటిలో మునిగి చనిపోతున్నాడు వేరొకడు ఏ మొసలి కోరలకోచిక్కి అసువులు బాసితే ఇంకొకడు మరొక మనిషి చేతిలో కత్తి పోటుతో మరణిస్తున్నాడు. మన కాళ్ళక్రిందపడి ఎన్ని చీమలు చనిపోతున్నాయి! ఈ క్షుద్రప్రాణుల జీవన్మరణాలతో చెలగాటమాడు మనం వాటికంటె గొప్పవాళ్ళమేగదా? ఇదంతా ఆ మహాశక్తి ఆదేశం కాదా? కాలస్వరూపిణియగు ఆ మహామాయ ఎదుట నిత్యము ఎన్నోలక్షల కోట్లప్రాణులు బలిఅవుతున్నాయి. ఈ విశాల ప్రపంచపు నలువైపులనుండి అనేక ప్రాణుల రక్తప్రవాహము ఆ మాత మహాకప్పెరలోనికి వచ్చిపడుతూ ఉంటుంది. నేను కూడా ఆ మహా కప్పెరలో ఒక బొట్టు రక్తాన్ని అర్పించాను ఏ నాటికైనా ఆమె మహా రాజును బలికోరేదే, నేను కేవలం నిమిత్తమాత్రుడను ”

ఆ సమయాన జయసింహుడు దేవీవిగ్రహంవైపు తిరిగి ఈవిధంగా మాట్లాడసాగాడు- “నిన్నీ ప్రపంచమంతా మాత అని పిలిచేది ఇందుకేనా? తల్లీ, మాట్లాడవా! ఓ పాషాణ హృదయురాలా, రాక్షసీ, ఈ విశాల ప్రపంచపు రక్తాన్ని కడుపునిండుగా త్రాగుటకొరకేనా నువ్వీ ఎర్రనినాలుక చాచు కొని కూర్చున్నది? స్నేహము, ప్రేమ, మమత, సౌంద ర్యము, ధర్మము- అన్నీ మిథ్యయేనా? నీ చిరరక్త పిపాస ఒక్కటే సత్యమా? మానవుడు వేరొకమానవునికి త్తుకకోసేది,

సోదరుడు తన సోదరుని సంహరించేది, తండ్రికుమారులు పరస్పరం నరుకులాడేది నీ రక్తపిపాస తీర్చటం కొరకేనా? నిర్దయురాలా, నిజంగా నువ్వుకోరేది ఇదే అయితే మేఘాలు రక్తాన్ని ఎందుకు వర్షించవు? కరుణా స్వరూపిణియగు నదులు రక్త ప్రవాహంతో నెత్తురు సముద్రంలో ఎందుకు కలవటం లేదు? కాదు, కాదు, మాతా! ఈ విద్య ఈశాస్త్రాలు ఇవన్నీ అసత్యమని స్పష్టంగా చెప్పుతల్లీ! నా తల్లి అని చెప్పకో కుండా, తన సంతానంయొక్క రక్తాన్ని త్రాగే రాక్షసివని నిన్ను అనటం నేను సహించలేను."

జయసింహుని నేత్రాలు అశ్రుప్రవాహాలయ్యాయి అతడు తనను గురించి తన మనసులో ఆలోచించసాగాడు. ఇలాంటి విషయం ఇంతకుముందెప్పుడూ అతడు ఆలోచించలేదు రఘుపతి ఇంతకుముందు చెప్పిన నవీన శాస్త్రవిషయం ప్రస్తావించకపోతే అతని మనస్సులో ఈ విషయం తలెత్తేదే కాదు.

రఘుపతి చిరునవ్వు నవ్వుతూ "అందుకనే బలి అనే ఆచారాన్ని పూర్తిగా నిషేధించారు" అని అన్నాడు.

జయసింహుడు చిన్నతనంనుంచి ప్రతిరోజూ బలి దానాన్ని చూస్తూనే ఉన్నాడు. దేవాలయాలలో ఈవిధంగా బలిఇచ్చే ఆచారం ఆగిపోతుందనిగానీ ఆగిపోవాలనిగానీ అతడు ఎన్నడూ కలలోకూడా ఆలోచించలేదు. ఈవిధంగా ఎందుకు జరిగింది అనేది మనస్సులో మెదిలేసరికి అతని హృదయంలో చాలా బాధ కలిగింది.

దీనిని గురించి రఘుపతి మాటలకు జవాబు చెపుతూ జయసింహుడు ఇలా అన్నాడు- "అది ఒక స్వతంత్రవిషయం. దానికేదో ఉద్దేశ్యం ఉంటుంది. దానిలో పాపంకూడా ఏమీ లేదు. కానీ దానికోసం సోదరుడు తన సోదరుని సంహరించాలా? ఆ విషయం కోసమే గోవిందమాణిక్య ప్రభువు...... ప్రభూ, మీ కాళ్ళమీదపడి వేడుకొంటాను. నన్ను కింకర్తవ్య విమూఢుని చేయవద్దు మహారాజుగారి రక్తం లేనిదే తనకు తృప్తి కలుగదని భువనేశ్వరిమాత తమకు కలలో కన్పించి చెప్పిందా?"

రఘుపతి కొద్దిక్షణాలు మౌనం వహించి "నిజం కాక నేను అబద్ధం చెప్తున్నానా? నీకు నామాటలమీద నమ్మకం లేదా?" అని అన్నాడు.

జయసింహుడు రఘుపతి పాదాలను కళ్ళకద్దుకొని "గురుదేవులయందు నాకున్న నమ్మకం పోలేదు. కానీ నక్షత్రరాయలు కూడా రాజవంశంలోనే జన్మించారుగదా?" అని అన్నాడు.

"దేవతల స్వప్నాలు సంకేతమాత్రంగా ఉంటాయి. విషయాలన్నీ వినలేము. చాలా విషయాలు గ్రహించుకోవాలి. గోవిందమాణిక్యుడంటే భువనేశ్వరి మాతకు అసంతృప్తి కలిగినట్లు స్పష్టంగా కన్పిస్తూనే ఉంది ఆమెకు అసంతృప్తి కలగటానికి కూడా అనేక కారణాలు కన్పిస్తున్నాయి. కనుక మాత రాజు రక్తాన్ని కోరుతుందంటే ఆమె ఉద్దేశ్యం గోవిందమాణిక్యుని రక్తమనే మనం గ్రహించుకోవాలి."

"ఆ విషయం నిజమేఅయితే నేనే మహారాజుగారి రక్తం తీసుకువస్తాను. ఆ పాపం నక్షత్రరాయలు వారిని చేయనివ్వను" అని అన్నాడు జయసింహుడు.

"ఆ భువనేశ్వరిదేవి ఆజ్ఞను పాలించటం పాపంకాదు" అని అన్నాడు రఘుపతి.

"అది పుణ్యకార్యమేగదా ప్రభూ! ఆ పుణ్యం నాకే ఎందుకు దక్కకూడదు?"

"అందుకేగదా, సత్యాన్ని పాలించమని చెప్పుతున్నాను. వత్సా, నేను నిన్ను చిన్నతనం నుంచి కుమారుని కంటె ఎక్కువగా, ఎంతో ప్రేమగా, నీకు ఎలాంటి లోపము జరుగకుండా పెంచి పెద్దచేశాను. నేను నిన్ను పోగొట్టుకోలేను నక్షత్రరాయలు గోవిందమాణిక్యాని చంపి మహారాజయితే అతనిని ఎవరూ ఏమీ అనలేరు కానీ నువ్వు మహారాజును ఏంచేసినా మళ్ళీనిన్ను పొందటం దుర్లభమవుతుంది"

"నా యందు వాత్సల్యమూ! తండ్రీ నేనొక తుచ్ఛమగు ప్రాణిని. నా యందుండే వాత్సల్యంవల్ల మీరు ఒక చీమనుకూడా చంపలేరు నా యందుండే వాత్సల్యంవల్ల మీరు పాపం చేసినట్లయితే నేను మీ వాత్సల్యాన్ని ఎంతో కాలం పొందలేను. ఆ స్నేహంయొక్క పరిణామం అంత శ్రేయస్కరం కాదు."

"సరే, ఆ విషయం తరువాత మాట్లాడుకుందాం. రేపు నక్షత్రరాయలు వచ్చినప్పుడు దానిని గురించి నిర్ణయించుకొందాం" అని చెప్పాడు రఘుపతి.

"నేను మహారాజుగారి రక్తాన్ని తీసుకు వస్తాను. ఆ దేవి పేరిటగానీ గురుదేవుని ఆదేశం ప్రకారంగానీ భ్రాతృ హత్యా మాత్రం జరగనివ్వను" అని జయసింహుడు తనలో తాను నిశ్చయించుకొన్నాడు.

# 7

జయసింహునికి ఆ రాత్రంతా నిద్ర లేదు. తన గురువు గారితో జరిగిన చర్చను గురించే అతడు రకరకాలుగా ఆలోచించ సాగాడు అనేక విషయాల్లో కార్యారంభం మన చేతుల్లోనే ఉంటుంది కానీ దాని ఫలితం మాత్రం మన అధీనంలో ఉండదు విచారాన్ని కలిగించే విషయాలు కూడా ఇలాగే ఉంటాయి చిన్నతనం నుంచి అతని మనస్సులో ఉన్న నమ్మకాన్ని కదిలించి వేయగల అనేక విషయాలు అతనిలో త్వర త్వరగా తలెత్తసాగాయి. క్రమంగా జయసింహునికి చాలా దుఃఖం కలిగింది.

కానీ పీడకలవలె అతని ఆలోచనలు మాత్రం ఏమీ తగ్గలేదు. భువనేశ్వరిదేవిని అతడు ఇంతకాలనుంచి తల్లిగా భావిస్తూ వచ్చాడు కానీ ఇవాళ గురుదేవుడు రఘుపతి ఆమెను మాతృత్వ విహీన, హృదయంలేని ఒక 'శక్తి' అని చెప్పారు 'శక్తి'కి తృప్తి అసంతృప్తి అనేవి ఏముంటాయి? ఆ 'శక్తి'కి కళ్ళు చెవులు రెండూ ఉండవు ఆ మహాశక్తి తన విశాలమగు రథం క్రింద ప్రపంచాన్నంతా మట్టగిస్తూ పోతూ ఉంటుంది. దాని సహాయంతో ఎవరు లేచి నడుస్తున్నారో, దాని క్రిందపడి ఎవరు నలిగిపోతున్నారో, దానిపైకి

లేచి ఎవరు ఆనందంగా ఉన్నారో, దాని క్రిందపడి నలుగుతూ ఆర్తనాదం చేసేదెవరో ఎవరికి తెలుసు? దానికి సారధి ఎవరూ లేరు. ప్రపంచంలో కోర్కెలులేని, నిస్సహాయులు, పిరికివాళ్ళ రక్తంతో ఆ నిర్దయురాలి దాహాన్ని తీర్చటమే మన కర్తవ్యమా? ఇదంతా ఎందుకు? ఆమె తాను చేయగలిగినవి తానే చేస్తుందిగదా! ఆమె చేతిలో కరువు కాటకాలున్నాయి జల ప్రళయాలున్నాయి భూకంపాలు ఆమె పిలిస్తేపలుకుతాయి. మాడ్చిమసి చేయగల శక్తి ఆమెలో ఉంది నిర్దయులగు మానవ హృదయాలలోని హింసాస్వభావం కూడా ఆమెకు ఉపయోగపడుతుంది. అలాంటప్పుడు మనవంటి అల్పులతో ఆమెకు అవసరం ఏముంది?''

మర్నాటి ప్రాతఃకాలం చాలా మనోహరంగా ఉంది. వర్షం ఆగిపోయింది నలువైపులా ఆకాశంలో మబ్బులు ఎక్కడా కన్పించటం లేదు సూర్యునికిరణాలు వర్షపునీటితో పరిశుభ్రపడి నిర్మలంగా మెరుస్తున్నాయి. భూమిమీదపడిన వర్షపుచినుకలు సూర్యకిరణాలుపడి ఎటుచూచినా తళతళ మెరుస్తున్నాయి. పరిశుభ్రమగు మనోహర ఉదయం ఆకాశంలో, మైదానంలో, వనాంతరసీమల్లో, నదీప్రవాహంలో వికసించిన నిర్మల కమల పుష్పమువలె భాసిస్తూ ఉంది. నీలాకాశంలో గ్రద్దలు ఎగురుతున్నాయి. తోరణంవలె వ్యాపించి ఉన్న ఇంద్రధనస్సు క్రిందుగా కొంగలు బారులు తీరి ఎగురుతున్నాయి. ఉడుతలు ఒకచెట్టుమీదినుంచి ఒక చెట్టుమీదికి ఎగురుతున్నాయి. పూర్తిగా బెదిరిపోయిన ఒకటి రెండు కుందేళ్ళు బెదిరి బెదిరి చూస్తూ పొదలోనుంచి బయటకువచ్చి

మళ్ళీ అంతలోనే ఎక్కడ దాగాలా అని చోటుకోసం వెతు కొ్కంటున్నాయి మేకపిల్లలు చాలా ఎత్తుగా ఉన్న కొండ శిఖరాలకు వెళ్ళి మేతమేస్తున్నాయి. ఆవులు ఇవాళమహదా నందంతో మైదానంలో స్వేచ్ఛగా తిరుగుతున్నాయి. పశుల కాపరులు పాటలు పాడుతున్నారు. చంకలో బిందెలతో నీళ్ళకు బయలుదేరిన తమ తల్లుల కొంగులు పట్టుకొని చిన్న పిల్లలు కూడా బయటకు బయలుదేరారు కొందరు వయస్సు మళ్ళినవాళ్ళు పూజకు పుష్పాలు కోస్తున్నారు. ఇవాళ నదిలో స్నానానికి చాలామంది జనం వచ్చారు వాళ్ళు గల గలమంటూ ఏవేవో మాటలు మాట్లాడుకొంటున్నారు. కల కలధ్వనితో ప్రవహించే నదీప్రవాహానికి ఇవాళ కూడా విశ్రాంతి లేదు. ఆషాఢ మాసపు ఉదయాన, సచేతనంగా కళకళలాడుతూ పరిపూర్ణ ఆనందంతో నిండి ఉన్న ప్రకృతిని చూచి దీర్ఘంగా నిట్టూరుస్తూ జయసింహుడు ఆలయంలోనికి ప్రవేశించాడు

జయసింహుడు విగ్రహంవైపు చూచి నమస్కరిస్తూ ఇలా అన్నాడు- "దేవీ, ఇవాళ నువ్వింత అసంతృప్తిగా ఎందుకున్నావు? ఒక్కరోజు నీకు నీ సంతానపు రక్తం లభించ లేదు- అంతమాత్రానికే ఇంత ఆగ్రహమా? అమ్మా! ఒక్క సారి నా హృదయంలోకి తొంగిచూడు. నా హృదయంలో నీ యందు పరిపూర్ణ భక్తిభావం లేదా? భక్తుల నిండు హృద యాలతో నీకు తృప్తికలుగదా? నిరపరాధుల రక్తంకావాలా! అలాగే అయితే ఒక్కవిషయం నిజం చెప్పుతల్లీ - పుణ్యాపురు షుడగు గోవిందమాణిక్యుని హతమార్చి రాక్షస రాజ్యాన్ని

స్థాపించాలనే నీ అభిప్రాయమా, తల్లీ? నోరు తెరచి నువ్వు 'అవును' అనో 'కాదు' అనో జవాబు చెప్పనిదే నేనీ రాజ హత్య జరగనివ్వను. నేను ఆ ప్రయత్నాన్ని నిరోధిస్తాను, చెప్పు తల్లీ!"

అకస్మాత్తుగా ఆ నిర్జన ఆలయంలో "అవును" అనే మాట విన్పించింది

జయసింహుడు త్రుళ్ళిపడి వెనుతిరిగి చూచాడు, కానీ అక్కడ అతనికి ఎవరూ కన్పించలేదు వెనుక వైపున ఏదో నీడవలె కదిలినట్లు విన్పించింది. ఆ మాట వినగానే అది గురు దేవుని కంఠస్వరమే అనిపించింది అతనికి. కానీ భువనేశ్వరి మాత గురుదేవుని కంఠస్వరంలో తనకు ఆజ్ఞాపించిందనే భావం అతనికి కలిగింది ఆపాదమస్తకం అతని ఒడలు పులకరించింది. అతడు దేవీ విగ్రహానికి నమస్కరించి అశ్రుసహితుడై ఆల యంలోనుంచి బయటకు వచ్చాడు.

# 8

గోమతి నదియొక్క దక్షిణ తీరము ఒకచోట చాలా ఎత్తుగా ఉంది. వర్షపు జాలులు, చిన్నచిన్న ప్రవాహాలు ఆ మెత్తగు ప్రదేశంలో అనేక గుహలను, గోతులను సృష్టిం చాయి. దానికి కొద్దిదూరాన ఇంచు మించు అర్థచంద్రా కారంలో పెద్దపెద్ద ఓకుచెట్లు, సంద్రచెట్లు అనేక గోతులతో నిండిన ఆ ప్రదేశాన్ని ఆవరించి ఉన్నాయి. కానీ ఆ ప్రదే శపు మధ్య భాగంలో మాత్రం చెట్లులేవు. అక్కడక్కడ దిబ్బలమీద చిన్నచిన్న ఓకుచెట్లు పెరగలేదు, వంకర తిరిగి

నల్లబారిపోయాయి ఆ ప్రదేశమంతా రాళ్ళతో నిండివుంది. ఒకటి రెండు మూరల చిన్నచిన్న నీటి ప్రవాహాలు వంకర టింకరగా అనేక మెలికలు తిరుగుతూ ఒకదానితో ఒకటి కలుస్తూ, మళ్ళీ విడిపోతూ చివరికి నదిలో కలుస్తున్నాయి ఆ ప్రదేశమంతా చాలా నిర్జనంగా ఉంది ఇక్కడ చెట్లు ఆకాశాన్ని కప్పివేసేంత గుబురుగా లేవు. ఇక్కడ నిలబడి చూస్తే గోమతి నది, నదికి రెండవవైపున చాలా దూరం వరకు వ్యాపించిఉన్న పంటపొలాలు కన్పిస్తూ ఉంటాయి

ప్రతిరోజు ఉదయము గోవిందమాణిక్య ప్రభువు షికారుగా ఇక్కడికే వస్తూఉంటారు వారి వెంట స్నేహితులుగానీ సేవకులుగానీ ఎవరూరారు. అప్పుడప్పుడు గోమతినదిలో చేపలుపట్టటానికివచ్చే పల్లెవాళ్ళు దూరంగా కన్పించేవాళ్ళు. శాంతమూర్తియగు మహారాజు యోగివలె నిశ్చలభావంతో కళ్ళుమూసుకొని కూర్చునేవారు వారి ముఖంలో కన్పించే వెలుగు ఉదయకాంతో లేక వారి ఆత్మ తేజస్సో సామాన్యులకు తెలియదు. ప్రస్తుతం వర్షాకాలంలో వారు ప్రతిరోజు అక్కడికి రావటంలేదు. కానీ వర్షం లేని రోజున మాత్రం చిన్నబాలుడు తాతను వెంటబెట్టుకొని వస్తూ ఉండేవారు.

ఇప్పుడిక తాతను తాత అనటం మహారాజుగారికి ఎంత మాత్రం ఇష్టంలేదు. ఒక దేవి అతనిని తాత అని పిలిచేది ఆమె సంబోధనలో ఉన్న అందం ఇప్పుడు లేదు. పాఠకుల దృష్టిలోకూడా ఇప్పుడు 'తాత' అనేమాటకు అర్థం ఏమీ లేదు. కానీ హాసి ప్రాతఃకాలమందు కొంటెతనంగా ఏటేకు

చెట్లుచాటునో దాగి బిగ్గరగా 'తాతా' అని పిలిచినప్పుడు, ఆమె కేక ఆ వనంలో ప్రతిధ్వనించేది అప్పుడు ఆ 'తాత' అనే శబ్దం అర్థయుక్తమై ఆ వన ప్రదేశంలో వ్యాపించేది. ఆ సమయంలో 'తాత' అనే సంబోధన ఒకబాలిక పసి హృదయంలోని అత్యంత కోమలమగు స్నేహపుగూటిని వదలి పక్షి వలె స్వర్గంవైపుగా ఎగిరిపోతూ ఉండేది. అప్పుడు స్నేహ జలంతో తడిసిన ఆ మధుర సంబోధన ప్రభాతసమయపు పక్షుల కలగవగానాన్ని దోచుకొనేది. ప్రాతఃకాలపు ఆనంద మయమగు సౌందర్యంతో ఆ చిన్న బాలికలోని ఆనందమయ మగు స్నేహం ఐక్యం చెందినట్లు కన్పించేది.

ఇప్పుడు ఆ బాలిక లేదు. బాలుడు ఉన్నాడు కానీ 'తాత'కాగు- ఆ బాలుడు ప్రపంచంలో అనేకమంది జనులకు అనేకవిషయాలు కావచ్చుకానీ 'తాత' అనేమాట ఆబాలికకు ఒక్క-దానికి మాత్రమే చెందిన మాట. గోవిందమాణిక్య ప్రభువు అతనిని ధ్రువుడని పిలిచేవారు. మనం కూడా అతనిని ధ్రువుడనే అందాం.

పూర్వం మహారాజుగారు ఒక్క-రే గోమతినదీతీరానికి వచ్చేవారు, కానీ కొద్దిరోజుల్నుంచి ధ్రువుణ్ణి కూడా వెంట తీసుకువస్తున్నారు ఆ బాలునిపవిత్రమగు నిర్మలమైన ముఖం లోనిసౌందర్యంలో వారు దేవలోకపుప్రతిబింబాన్ని చూచేవారు మధ్యాహ్నపు సమయాన మహారాజుగారు ప్రాపంచిక విష యాల్లోకి వచ్చినప్పుడు తలనెరిసిన వృద్ధులు, విజ్ఞులగు మంత్రులు వారి చుట్టూ చేరి అనేక సలహాలు చెపుతూఉండే వారు. ఉదయం కాగానే ఒక బాలుడు వారిని ఈ ప్రపంచం

నుంచి బయటకు తీసుకు వెళ్ళేవాడు. అతని విశాల నేత్రాల ఎదుట విషయములలోని కుటిలత్వము తిరోగమించేది. ఆసమయంలో బాలుని చెయ్యి పట్టుకొని మహారాజుగారు ఈ ప్రపంచానికి మధ్యఉన్న అనంతంవైపు వ్యాపించిన ఒకానొక నిర్మలమూ కరుణాభరితమూ అగు విశాల రాజమార్గాన చేరుకునేవారు ఆ ప్రదేశంలో అనంతమగు నీలాకాశపు పందిరిక్రింద ఉన్న విశ్వబ్రహ్మండపు మహాసభ కన్పించేది భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము మొదలగు సప్తలోకాల సంగీత ధ్వని విన్పించేది ఆ ప్రదేశపు నిర్మల మార్గాన సమస్తమూ నిర్మలంగా, సహజంగా, సౌందర్యశోభతో కూడినవిగా కన్పించేవి. ముందుకు సాగిపోవాలనే ఉత్సాహం కలుగుతూఉండేది తీవ్రమగు భావాలు, విచారాలు, వ్యాధులు, ఆశాంతి మున్నగునవి దూరంగా తొలగిపోయేవి మహారాజుగారు అలాంటి ప్రభాతసమయాన, ఏకాంత ప్రదేశంలో నదీతీరాన అనంతాకాశం క్రింద, ఒక బాలుని స్నేహంలో లీనమై అనంతప్రేమమార్గాన్ని చూడగలిగారు.

గోవిందమాణిక్య ప్రభువు ధ్రువుణ్ణి ఒడిలో కూర్చొబెట్టుకొని పౌరాణిక ధ్రువుని కథను చెపుతున్నారు. మహారాజుగారు చెప్పేకథ అర్థమవుతుందని మనం అనుకోనవసరం లేదు. ఆ బాలుని ద్వారా తిరిగి ఆ ధ్రువుని కథను వచ్చీరాని మాటలతో వినాలని మహారాజుగారి కోర్కె.

కథ వింటూ వింటూ ధ్రువుడు "నేను అడవులకు వెళతాను" అని అన్నాడు

"అడవులకు వెళ్ళి ఏంచేస్తావు?" అని మహారాజుగారు అడిగారు.

"'హాయి'ని చూస్తాను" అని జవాబు చెప్పాడు ధ్రువుడు.

"మనం అడవిలోనే ఉన్నాము 'హరి'ని చూడటానికే వచ్చాము" అని చెప్పారు మహారాజుగారు.

"'హాయి' ఏడీ?" అని ధ్రువుని ప్రశ్న.

"ఇక్కడే ఉన్నాడు."

"అక్కఏదీ?" అని ప్రశ్నించి ధ్రువుడు లేచినిలబడి వెనక్కి తిరిగి చూచాడు. అక్క పూర్వంవలె వెనుకనుంచి మెదలకుండావచ్చి కళ్లు మూస్తుందేమోనని అనుకొన్నాడు. కానీ వెనుక ఎవరూ కన్పించక పోయేసరికి తలవంచుకొని "అక్క ఎక్కడ ఉంది?" అని అడిగాడు.

"హరి మీ అక్కను పిలుచుకొని వెళ్ళాడు" అని మహారాజుగారు జవాబు చెప్పారు.

"'హాయి' ఎక్కడున్నాడు?"

"వత్సా, వారిని పిలువు నేను నీకు నేర్పిన భజనగీతం పాడు."

ధ్రువుడు 'హరి'ని సంబోధిస్తూ మహారాజు నేర్పిన భజనగీతాన్ని ముందు వెనుకలకు వూగుతూ పాడసాగాడు.

మహారాజుగారు చెప్పిన ఆ భజన గీతాన్ని ధ్రువుడు తలక్రిందులు చేసి తాను పలకలేని మాటల్ని వదలివేసి తన్మయుడై పాడుతూ ఉంటే అతని మధురగానాన్ని విని మహారాజుగారి మనస్సు ఆనందంతో నిండిపోయింది. ప్రాతః

కాలపు సౌందర్యం ద్విగుణీకృతమయింది చుట్టూఉన్న నది, వృక్షములు, లతలు నవ్వసాగాయి బంగారురంగు అమృతంతో తడిసిన నీలాకాశంలో మహారాజుగారికి ఎవరిదో అపురూప సౌందర్యవంతమగురహస్యంతోకూడిన ముఖమండలము కన్పించింది. ధ్రువుడు తన ఒడిలో కూర్చొని ఉన్నట్లే తనను కూడా ఎవరో ఎత్తుకొని ఒడిలో కూర్చోబెట్టుకున్నట్లనిపించింది వారికి. తాను, తన చుట్టూఉన్న సమస్తమూ, ఈ సంపూర్ణ జడ చైతన్య జగత్తు విశాలమగు ఎవరి చల్లని ఒడిలోనో ఉన్నట్లు కన్పించింది వారి ఆనందము, ప్రేమ సూర్యకిరణములవలె దశదిశల వ్యాపించి ఆకాశాన్ని పరిపూర్ణంగావించాయి.

ఇంతలో అస్త్ర శస్త్రములు ధరించి గుహామార్గాన జయసింహుడు అక్కడికివచ్చి అకస్మాత్తుగా మహారాజుగారి ఎదుట నిలబడ్డాడు

మహారాజుగారు అతనివైపు చేతులుచాచి "జయసింహా, రా!" అని అన్నారు ఆ సమయాన మహారాజుగారు కూడా ఆ చిన్నబాలునితో కలిసి తానూ ఒక బాలుడైపోయారు అప్పుడు వారిలో రాజఠీవి ఎక్కడిది!

జయసింహుడు తలవంచి మహారాజుగారికి నమస్కరించి "మహారాజా, నా దొక విన్నపము ఆలకించండి!" అని అన్నాడు

"ఏమిటో చెప్పు" అన్నారు మహారాజుగారు.

"భువనేశ్వరి మాతకు మీ యందు అసంతృప్తి కలిగింది."

"ఎందుకని? నేను ఆమెకు అసంతృప్తికలిగేషని ఏం చేశాను?"

"మహారాజా, తమరు బలిని నిషేధించి ఆమెకు జరగ వలసిన పూజకు ఆటంకం కలిగించారు."

"జయసింహా, హింసయందు అంత వ్యామోహం ఎందుకు? మాత ఒడిలో ఆమె సంతానాన్నే చంపి ఆమెను సంతృప్తిపర్చాలని నీ ఉద్దేశ్యమా?"

జయసింహుడు నెమ్మదిగా వచ్చి మహారాజుగారి పాదాలచెంత కూర్చున్నాడు. ధ్రువుడు అతని కత్తితో ఆట లాడుకోసాగాడు.

"మహారాజా, శాస్త్రములు బలిని అంగీకరిస్తున్నాయి గదా, ఎందుకని?" అని అడిగాడు జయసింహుడు.

"శాస్త్రములను విధిగా ఎవరు పాలిస్తున్నారు? అందరూ తమతమ స్వభావాలననుసరించి వాటికి అర్థం చెప్తున్నారు. దేవి ఎదుట బలి ఇచ్చి బురదతో కూడిన రక్తాన్ని శరీరంనిండా పులుముకొని బిగ్గరగా వెర్రికేకలువేస్తూ, భయంకరమగు ఉల్లాసంతో గంతులు వేయటంవల్ల వారు మాతను పూజిస్తున్నారా? లేదు, వారి హృదయాలలో నివసించే హింస అనే రాక్షసిని మాత్రమే వారు పూజిస్తున్నారు. హింసకోసం బలిఇవ్వటం శాస్త్రాలలో చెప్పలేదు, హింసను బలి ఇవ్వమనే శాస్త్రాలు చెప్తున్నాయి."

జయసింహుడు కాస్సేపటివరకు ఏమీ మాట్లాడలేదు. నిన్నరాత్రినుంచి అతని మనస్సులోకూడా ఇలాంటి విషయాలే అశాంతిని కలిగించాయి.

చివరికి జయసింహుడు మహారాజుగారిని ఉద్దేశించి "ఆ దేవి నాతో ఈ విషయాన్ని స్వయంగా చెప్పింది. ఇందులో ఏమీ సందేహం లేదు. తనకు మహారాజు రక్తం కావాలని దేవి కోరింది" అని ఉదయం ఆలయములో జరిగిన సంఘటన యావత్తూ చెప్పాడు

మహారాజుగారు నవ్వి "ఇది ఆ దేవి కోర్కె కాదు పూజారి రఘుపతి చాటున నిలబడి నీ మాటలకు జవాబు చెప్పాడు" అని అన్నారు.

మహారాజుగారు ఈ మాట అనగానే జయసింహుడు త్రుళ్ళిపడ్డాడు. తనకు కూడా ఒకసారి ఇలాంటి అనుమానమే కలిగింది. కానీ మెరుపువలె అంతలోనే మాయమయింది మహారాజుగారి మాటలువిని అతని మనస్సులో మళ్లీ ఆ సందేహం తలెత్తింది.

జయసింహుడు సవినయంగా మహారాజుగారితో ఇలా అన్నాడు- "లేదు, మహారాజా, క్రమంగా నన్ను మరింత సందేహంలో పడత్రోయకండి. నన్ను ఒడ్డునుంచి సముద్రం లోకి పడద్రోయకండి. మీ మాటలవల్ల నా చుట్టూ మరింత అంధకారం ఆవరిస్తూ ఉంది. నాలో ఉన్న భక్తిని, విశ్వాసా లను ఎప్పటివలెనే ఉండనివ్వండి వాటికి బదులు నాకీ ఊగిస లాటవద్దు. ఆ దేవి ఆజ్ఞ కావచ్చు లేదా గురువుగారి ఆజ్ఞ కావచ్చు, రెండూ ఒకటే. నేనా ఆజ్ఞను పాలిస్తాను."

ఈ మాట అని జయసింహుడు తటాలున కత్తి దూశాడు. ఆ కత్తి ఎండలో మెరుపువలె తళతళ మెరవ సాగింది. అది చూచి ధ్రువుడు బిగ్గరగా ఏడ్చాడు. అతడు

చిన్నచిన్న చేతులతో మహారాజుగారిని గట్టిగా పట్టుకొని కరుచుకు పోయాడు. మహారాజుగారు జయసింహుని వైపు చూడకుండా ఆ బాలుని ఎత్తుకొని గట్టిగా తన హృదయానికి హత్తుకొన్నారు.

జయసింహుడు కత్తిని దూరంగా విసిరివేశాడు. అతడు ధ్రువుని వీపు నిమురుతూ "ఏమీ భయం లేదు, నాయనా, ఏమీ భయంలేదు నేనిప్పుడే వెళ్ళిపోతున్నాను. నువ్వీ మహాత్ముని ఆశ్రయంలో హాయిగా విశ్రమించు. వీరి చల్లని వక్షస్థలం మీద నిద్రించు నిన్నెవరూ వీరినుంచి వేరుచేయలేరు" అని మహారాజుగారికి నమస్కరించి వెళ్ళటానికిసిద్ధమయ్యాడు.

ఏమి ఆలోచించాడో ఏమో తటాలున వెనుతిరిగి మహారాజుగారితో జయసింహుడు ఇలా చెప్పాడు- "మహారాజా, తమరు చాలా జాగ్రత్తగా ఉండాలని హెచ్చరిస్తున్నాను. తమ సోదరుడు నక్షత్రరాయలు తమరిని హత్య చేయుటకు అంగీకరించాడు. ఆషాఢ శుద్ధ చతుర్దశి నాటిరాత్రి పదునాలుగు దేవతల పూజనాటిరాత్రి తమరు జాగ్రత్తగా ఉండాలి."

మహారాజుగారు నవ్వి "నక్షత్రరాయలు ఎవరెంత ప్రోత్సహించినప్పటికీ మమ్మల్ని హత్యచేయలేడు. అతనికి నేనంటే చాలా ప్రేమ" అని అన్నారు.

జయసింహుడు మహారాజుగారివద్ద శలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

మహారాజుగారు ధ్రువునివైపుచూచి భక్తిభావంతో "ఇవాళ రక్తరంజితం కాకుండా నువ్వే పృథ్విని కాపాడావు.

ఆ వుద్దేశ్యంతోనే మీ అక్క నిన్ను వదలి వెళ్ళింది" అని అంటూ కన్నీరు జాలువారిన ధ్రువుని చెక్కిళ్ళు తుడిచారు

ధ్రువుడు గంభీరంగా "అక్క ఎక్కడ వుంది?" అని అడిగాడు.

ఇంతలో మబ్బులు సూర్యుణ్ణి కప్పివేశాయి. నదిమీద నల్లని నీడ ఆవరించింది. దూరానఉన్న అడవికూడా మబ్బుల వలెనే నల్లబడింది. వర్షం వచ్చేసూచనలు కన్పించగానే మహారాజుగారు మహలుకు తిరిగి వచ్చారు.

ఆలయం ఎంతో దూరంలేదు. కానీ జయసింహుడు నిర్జనంగా ఉన్న నదిఒడ్డునే ఆలయంవైపు నెమ్మదిగా నడిచి వెళుతున్నాడు. అతని మనస్సులో తీవ్రమైన ఆలోచనలు లేస్తున్నాయి అతడు నది ఒడ్డునే ఒకచోట ఒక చెట్టుక్రింద కూర్చున్నాడు. అతడు రెండు చేతులతోనూ ముఖం కప్పు కొని ఆలోచించసాగాడు- నేనీపని చేయనట్లయితే నాసందేహం తీరేదేకాదు. ఇప్పుడు మళ్ళీ నా సందేహాన్ని ఎవరు తీరుస్తారు? ఏ పని మంచిదో ఏది చెడ్డదో ఎవరు చెపుతారు? ఈ ప్రపంచంలోని అనేక కోర్కెలు, ఆశలతో కూడిన మార్గంలో నిలబడి ఏ మార్గం సరియైనదో ఎవరిని అడిగి తెలుసుకోవాలి? ఈ విశాల ప్రపంచంలో నేను అంధుడను, ఒంటరిగా నిలబడి ఉన్నాను. ఇవాళ నాకు చేయూతనిచ్చే వారెవరూ లేరు.

జయసింహుడు అక్కడినుండి లేచేసరికే వర్షంప్రారంభమయింది. అతడు వర్షంలో తడుస్తూ ఆలయంవైపు బయలు

దేశాను. అనేకమంది ప్రజలగుంపు కోలాహలంగా ఆలయం వైపునుంచి వస్తూ ఉండటం అతడు చూచాడు.

ఒక వృద్ధుడు ఇలా అంటున్నాడు– "మా తాత తండ్రుల కాలంనుంచి ఇలాగే జరుగుతూ ఉన్నదని నాకు తెలుసు ఇవాళ మహారాజుగారి తెలివి ఏమయిందో ఏమో కాని పూర్వీకుల ఆచారాన్ని వద్దని అంటున్నారు"

వారిలో ఒక యువకుడు "ఇప్పుడు ఆలయం లోనికి రావాలనే కోర్కె కలగటంలేదు. పూజలో ఇప్పుడా ఆడంబరమే లేదు" అని అన్నాడు.

"నవాబుల పరిపాలన వచ్చినట్లుంది" అని అన్నాడు వారిలో ఒకడు బలుల్ని గురించి వెనక ముందు లాలోచించే స్వభావం ఒక మహమ్మదీయునిలో కలిగినా ఆశ్చర్యంలేదు. కానీ ఒక హిందువు మనస్సులో అలాంటి అభిప్రాయం కలగటం చాలా ఆశ్చర్యంగా ఉంది అని అతని ఉద్దేశం.

"ఇక ఈ దేశానికి మేలు కలుగదు" అని అంది ఒక బాలిక.

"మూడు మాసాలలో మహమ్మారివచ్చి ఈదేశాన్ని సర్వనాశనం చేసివేస్తుందని మాత కలలో కన్పించి చెప్పిందని పూజారిగారు చెప్పనేచెప్పారు" అన్నారు మరొకరు.

"అంతవరకు ఎందుకు? మాధవుని విషయం ఏమంటారు, సంవత్సరమున్నరనుంచి జబ్బుతో బాధపడుతూకూడా జీవించే ఉన్నాడు. అలాంటిది బలిని నిషేధించగానే ప్రాణాలు వదిలాడు" అని నిదర్శన పూర్వకంగా చెప్పాడు హరి.

"అంతేకాదు, మా అన్న కుమారుడు చనిపోతాడని ఎవరనుకున్నారు? వైద్యుడిచ్చిన మాత్రవేయగానే ప్రాణం పోయింది" అని శాంత చెప్పింది. అన్నకుమారుడు చనిపోయిన దుఃఖము, దేశానికి కీడుజరుగుతుందనే సందేహంతో ఆమె కంపించిపోయింది.

"ఆ రోజున ఏంజరిగింది, సంతలో నిప్పంటుకొని ఒక్క ఇల్లుకూడా మిగలకుండా కాలిపోయాయి" అని అన్నాడు తీన్‌కౌడీ

కృషక చింతామణి తన ప్రక్కనే ఉన్న మరొక రైతుతో "ఇన్ని విషయాలెందుకు? ఈ సంవత్సరం ధాన్యం ధర ఎంత తక్కువగా ఉన్నదో చూడరాదూ. నేను పుట్టి బుద్ధెరిగిన తరువాత ధాన్యం ఇంత చౌకగా ఎప్పుడూ అమ్మ లేదు. ఈ సంవత్సరం రైతుల పరిస్థితి ఎలా ఉంటుందో ఎవరు చెప్పగలరు?" అని అన్నాడు.

బలిని నిషేధించిన తరువాతగానీ, అంతకుముందుగానీ ఎవరికి ఎలాంటి హాని జరిగినప్పటికీ అందుకు బలిని నిషేధించ టమే ప్రధాన కారణమని అందరూ నమ్మసాగారు. ఈ దేశాన్ని వదలివెళ్ళిపోవటమే మంచిదని అందరూ అభిప్రాయ పడ్డారు. వారి అభిప్రాయంలో ఎలాంటి మార్పు రాలేదు. కానీ అందరూ ఆ దేశంలోనే ఉంటున్నారు.

జయసింహుడు పరధ్యానంగా ఉన్నాడు వారుమాట్లా డుకునే మాటల్ని వినకుండా ఆలయంలోకి వెళ్ళాడు. పూజ ముగించి రఘుపతి ఆలయం బయట కూర్చొని ఉన్నాడు.

జయసింహుడు రఘుపతి వద్దకువెళ్ళి "గురుదేవా, ఇవాళ ఉదయం భువనేశ్వరి మాత ఆదేశాన్ని పొందటానికి నేను ఆ మాతను ప్రశ్నించినప్పుడు జవాబు చెప్పినది మీరేనా!" అని సవినయంగా అడిగాడు. అతని కంఠస్వరం చాలా దృఢంగా ఉంది.

రఘుపతి సంకోచిస్తూ "భువనేశ్వరిమాత నా ద్వారానే తన అభిప్రాయాలను ప్రచారం చేస్తుంది. ఆమె తన నోరు తెరిచి ఏమీ చెప్పదు" అని అన్నాడు.

"అయితే మీరు నా ఎదుటకే వచ్చి ఎందుకు చెప్ప లేదు? చాటునదాగి నన్నెందుకు మోసం చేశారు" అని అడిగాడు జయసింహుడు.

రఘుపతికి కోపం వచ్చింది. "అధికంగా మాట్లాడకు. నేను ఏమి ఆలోచిస్తానో, ఏమి చేస్తానో నీ వంటి వాళ్ళకు ఎలా అర్థమవుతుంది? మొరటుగా నోటికి వచ్చినట్లు మాట్లాడకు నేను ఏది చెపితే అది నువ్వు నెరవేర్చాలి. దానిని గురించి ప్రశ్నించే అధికారం నీకు లేదు" అని అన్నాడు తీవ్రంగా.

జయసింహుడు ఏమీమాట్లాడ లేదు. అతని సందేహం తీరలేదు సరిగదా మరింత హెచ్చింది.

కాస్సేపటికి జయసింహుడు రఘుపతితో ఇలా అన్నాడు- "ఇవాళ ఉదయం దేవి ఆదేశం లభించనట్లయి తే నేను మహారాజుగారి హత్య జరుగనివ్వనని భువనేశ్వరిదేవితో చెప్పాను. హత్య జరుగకుండా ఆటంకం కలిగిస్తానని కూడా అన్నాను. భువనేశ్వరిమాత ఆదేశం లభించలేదని తెలుసుకో

గానే నేను మహారాజుగారి వద్దకు వెళ్ళి నక్షత్రరాయలు సంక ల్పాన్ని గురించి చెప్పవలసి వచ్చింది. నేను వారిని హెచ్చ రించి వచ్చాను."

రఘుపతి కొద్దిక్షణాల వరకు మెదలకుండా కూర్చు న్నాడు కోపాన్ని లోలోపల దిగమ్రింగుతూ లేచినిలబడి "ఆలయంలోకి వెళదాం పద" అని అన్నాడు అతనితో.

ఇద్దరూ ఆలయంలోకి వెళ్ళారు.

"ఆషాఢశుద్ధ చతుర్దశి లోపల రాజు రక్తం తెచ్చి ఈ పాదాలముందు అర్పిస్తానని దేవిపాదాలనంటి ప్రతిజ్ఞ చెయ్యి" అని రఘుపతి అతనితో అన్నాడు.

జయసింహుడు తలవంచుకొని కొద్దిక్షణాల వరకు మౌనం వహించాడు. తరువాత తలపైకెత్తి గురువుగారి ముఖంలోకి, దేవివిగ్రహం వైపు చూచాడు విగ్రహాన్ని చేతితోతాకి నెమ్మదిగా "ఆషాఢ శుద్ధ చతుర్దశి లోపల రాజు రక్తం తెచ్చి నీ పాదాలముందు అర్పిస్తాను" అని అన్నాడు.

# 10

మహలుకు తిరిగి వచ్చిన తరువాత మహారాజుగారు రాజకార్యములన్నియు పూర్తిచేసుకొన్నారు ప్రాతఃకాలపు సూర్యకాంతి అదృశ్యమైపోయింది. దట్టంగా మబ్బులు పట్టి నందువల్ల పగలే అంధకారంగా ఉంది. మహారాజుగారు చాలా విచారంగా ఉన్నారు. నక్షత్రరాయలు ప్రతిరోజూ రాజసభకు హాజరవుతూ ఉండేవాడు. కానీ ఇవాళ రాలేదు. మహారాజుగారు అతనికి కబురు పంపారు ఆరోగ్యం బాగా

లేదని అతడు జవాబు పంపాడు. మహారాజుగారు తాము స్వయంగా బయలుదేరి నక్షత్రరాయలు గదిలోకి వెళ్ళారు. నక్షత్రరాయలు తలెత్తి రాజుగారి ముఖం చూడలేకపోయాడు. తన అనారోగ్యాన్ని గురించి కాగితంమీద వ్రాసి మహారాజుగారికి చూపించాడు "జబ్బేమిటి నక్షత్రా?" అని అడిగారు మహారాజుగారు

నక్షత్రరాయలు చేతిలోని కాగితాన్ని నలిపివేస్తూ తన చేతివ్రేళ్ళవైపు చూచుకొని తడబడుతూ "జబ్బు, కాదు, జబ్బేమీ లేదు ఒకటి రెండు ముఖ్యమైన పనులు చేయవలసి ఉంది, అవునవును... జబ్బు చేసింది- ఏదో జబ్బులాంటిదే ... ..." అన్నాడు

నక్షత్రరాయలు చాలా వ్యాకులత చెందాడు. గోవింద మాణిక్య ప్రభువు మనస్సులో చాలా దుఃఖంకలిగింది. వారు అలాగే నిలబడి నక్షత్రరాయలు ముఖంలోకి చూస్తూ ఆలోచించసాగారు- "ఆహా, స్నేహవాతావరణంలోకి హింసా భావం ప్రవేశించింది. అది సర్పమువలె ముఖం చూపించకుండా దాగిఉండాలనుకొంటుంది. మా చుట్టుపట్ల అడవులలో క్రూరమృగాల సంఖ్య తగ్గిపోయిందా? ఇప్పుడు మనిషిని చూచి మనిషి భయపడాలా? సోదరుడు తన సోదరునివద్ద అనుమానం లేకుండా నిర్మల హృదయంతో కూర్చోలేడా? ఈ ప్రపంచంలో హింసకే ప్రాధాన్యత హెచ్చింది. ప్రేమకు, స్నేహానికి తావులేకుండా పోయింది. నక్షత్రరాయలు నా సోదరుడు నేను ఎప్పుడూ అతనితో కలిసి ఈ భవనంలోనే ఉంటూ వచ్చాను మేమిద్దరం రోజూ ఒకేచోట కూర్చుం

టున్నాము సంతోషంతో నవ్వుకొంటూ అనేక విషయాలు మాట్లాడుకొంటున్నాము కాని ఇవాళ అలాంటి నక్షత్రరాయలు మాతో కలిసి ఉంటూ తన మనస్సులో మోసానికి పదును పెట్టుకొంటున్నాడు."

ఆ సమయంలో గోవిందమాణిక్య ప్రభువుకు ఈ ప్రపంచమంతా క్రూరమృగాలతో నిండిన అరణ్యంవలె కన్పించసాగింది నలువైపుల గాఢాంధకారం, కోరలు, భయంకరమగు పంజాలదృశ్యాలే కన్పించసాగాయి దీర్ఘంగానిట్టూర్చి మహారాజుగారు తినలోతాను ఇలా ఆలోచించుకోసాగారు —

"స్నేహము, ప్రేమలేని ఈ సంఘర్షణమయ రాజ్యంలో నేను సజీవంగా ఉండి నా పరివారములోని వారికి, నా సోదరుని మనస్సులోనూ హింసాభావాన్ని ద్వేషాగ్నిని ప్రజ్వలింప జేస్తున్నాను. నా సింహాసనం చుట్టూ ఉన్న ప్రాణసములగు ఆత్మీయులు నన్ను చూచి లోలోపల ముఖం ముడుచుకొంటున్నారు, పళ్ళునూరుతున్నారు, గొలుసులతో కట్టివేసిన కుక్కలవలె నామీద విరుచుకుపడే అవకాశంకోసం ఎదురుచూస్తున్నట్లుగా ఉన్నారు. వీరి వాడియైన పంజాదెబ్బలకు ఛిన్నాభిన్నమైపోయి! వీరి రక్తపిపాసను తీర్చటంకంటె ఈ ప్రదేశాన్ని వదలి వెళ్ళిపోవటం మంచిది "

ప్రాతఃకాలపు ఆకాశంలో గోవిందమాణిక్య ప్రభువు దర్శించిన ప్రేమమూర్తి ఎక్కడో అదృశ్యమైపోయాడు

మహారాజుగారు లేచినిలబడి గంభీర కంఠస్వరంతో "ఇవాళ మధ్యాహ్నానంతరం మనిద్దరమూ గోమతినదీతీరాన ఉన్న నిర్జనవనంలోకి షికారుకు వెళదాం" అని అన్నారు.

మహారాజుగారి గంభీరమైన ఆదేశానికి విరుద్ధంగా నక్షత్రరాయలు ఒక మాట కూడా మాట్లాడలేకపోయాడు కానీ సందేహ భయాలతో అతని మనస్సు వ్యాకులపడ సాగింది మహారాజుగారు ఇంతసేపు మెదలకుండా తమ రెండు నేత్రాలతో తన మనస్సులో జొరబడిచూస్తున్నట్లు నక్షత్ర రాయలు భావించాడు. అక్కడ అజ్ఞానపు గోతిలో క్రిముల వలె గులగులలాడు ఆలోచనలు వెలుగు తగలగానే విలవిల లాడుతూ బహిర్గతమయినట్లుంది. నక్షత్రరాయలు భయ పడుతూ ఒకసారి మహారాజుగారివంక చూచాడు మహారాజు గారి ముఖం అత్యంత గంభీరంగానూ, బాధతో కూడిన శాంత భావంతోనూ ఉన్నదే కాని అతనికి వారి ముఖంలో కోప మనేది కన్పించలేదు. మానవ మనస్సులోని కాఠిన్యాన్ని చూచి వారి హృదయంలో గంభీరమగు శోకం మాత్రమే నివాసం ఏర్పరిచుకొంది.

షికారుకు బయలుదేరే సమయమయింది. అప్పుడు కూడా ఆకాశంలో మబ్బులు ఉన్నాయి. నక్షత్రరాయలును వెంటబెట్టుకొని మహారాజుగారు కాలినడకనే అడవివైపు బయలుదేరి వెళ్ళారు ఇంకా సూర్యుడు అస్తమించలేదు. కానీ మబ్బులు పట్టినందువల్ల సూర్యుడు అస్తమించాడనే భ్రమ కలుగుతుంది. కాకులు తమతమ నివాసాలకు చేరుకొని 'కావ్ కావ్' మని అరుస్తున్నాయి. కానీ అక్కడక్కడ ఒకటి రెండు గ్రద్దలు ఇంకా ఆకాశంలో ఎగురుతూనే ఉన్నాయి

అన్నదమ్ములిద్దరు నదీరాన ఉన్న అడవిలోకి చేరు కొన్నారు. అప్పుడు నక్షత్రరాయలు శరీరము ఝున ఝున

లాడింది. పెద్దపెద్ద వృక్షాలనేకం ఒకదానితో నొకటి అను కొని ఉన్నాయి. వృక్షాలు ఏమీ మాట్లాడవు. కానీ నిశ్చలంగా నిలబడి క్రిమికీటకాలు కదిలిన చప్పుడు కూడా విన గలుగు నట్లుంటాయి. తమనీడలోని అంధకారంలోకి దృష్టి నిలిపి చూస్తున్నట్లుగా ఉంటాయి. ఆ అడవిలోని చిక్కని పచ్చదనం లోనికి వెళ్ళుటకు నక్షత్రరాయలకు అడుగు ముందుకు పడటం లేదు అడవిలో నల్దిశల నిశ్శబ్దం వ్యాపించి ఉండటం చూచి అతని హృదయం కంపించసాగింది. అతని మనస్సులో ఘోరమగు భయసందేహాలు ఉత్పన్న మయ్యాయి మహారాజుగారు ఈ సాయంత్రం సమయంలో ఈ ప్రపంచానికి దూరంగా తనను ఎక్కడికి తీసుకు వెళు తున్నారో అతడు నిశ్చయించుకోలేక పోయాడు. నేనిక పట్టు బడి పోయాను. మహారాజుగారు కఠినంగా శిక్షించటానికే నన్ను ఈ అడవిలోనికి తీసుకు వెళుతున్నారు అని అతడు మనస్సులో నిశ్చయించుకొన్నాడు. నక్షత్రరాయలు అక్కడి నుంచి పారిపోయి తనను కాపాడుకోవచ్చును కానీ మహారాజు గారు తన కాళ్ళు చేతులు బంధించి తీసుకు పోతున్నట్లుగా ఉంది అతనికి. దీని నుంచి తప్పించుకునే మార్గమేమీ లేదు.

అడవి మధ్య అక్కడక్కడా కాళీ ప్రదేశాలున్నాయి, ఒక జలాశయము కూడా ఉంది. వర్షపు నీటితో ఆ జలా శయము నిండుగా ఉంది. ఆ జలాశయపు ఒడ్డుకు వెళ్ళిన తరు వాత మహారాజుగారు అకస్మాత్తుగా వెనుతిరిగి "ఆగు" అన్నారు.

నక్షత్రరాయలు త్రుళ్ళిపడి ఆగిపోయాడు. మహారాజు గారి ఆదేశాన్ని విని కాలం కూడా నిలిచిపోయినట్లుగా కన్పించింది అతనికి. అడవిలోని వృక్షాలన్నీ ఎక్కడివక్కడ తలలు వంచి నిలిచినట్లున్నాయి భూమి, ఆకాశము వూపిరి బిగబట్టి మెదలకుండా చూస్తున్నట్లున్నాయి కాకుల అరపులు ఆగిపోయాయి భయంకర నిశ్శబ్దం ఆవరించింది 'ఆగు' అన్న మాటే క్షణక్షణమూ ప్రతిధ్వనించసాగింది. ఆ 'ఆగు' అన్న శబ్దము విద్యుత్ ప్రవాహమువలె ప్రతివృక్షమునకు, కొమ్మ కొమ్మకూ ప్రవహించసాగింది. అడవిలోని ప్రతి ఆకు ఆ శబ్ద కంపనంవల్ల ) అంటున్నట్లుంది. నక్షత్రరాయలు కూడా ఆ చెట్లవలెనే నిశ్చలంగా నిల్చున్నాడు

అప్పుడు మహారాజుగారు నక్షత్రరాయల మనస్సులోకి తొంగి చూస్తున్నట్లుగా వేదనాభరితమగు స్థిరదృష్టితో అత్యంత గంభీర కంఠస్వరంతో నక్షత్రా, నువ్వు నన్ను చంపాలనుకొంటున్నావా!" అని అడిగారు.

నక్షత్రరాయలు పిడుగుపడిన చందాన నిర్జీవంగా నిలబడి చూడసాగాడు జవాబు చెప్పటానికికూడా ప్రయత్నించలేదు

మళ్ళీ మహారాజుగారే ఇలా అన్నారు- "ఎందుకు చంపదలిచావు, తమ్ముడూ? రాజ్యము కోసమా? బంగారు సింహాసనము, వజ్రకిరీటము, రాజ్యాధికారము వీటినే నువ్వు రాజ్యమని అనుకొంటున్నావా? ఈ కిరీటము, ఈ రాజ్యాధికార భారము ఎంతకష్టమైనదో నీకు తెలుసా? అనేక కోట్ల ప్రజల బాధలు విచారాలు ఈ కిరీటాన్ని ఆవరించిఉంటాయి.

రాజ్యము పొందాలనుకున్నట్లయితే ప్రజల దుఃఖాలను నీవిగా భావించుకో, వారి ఆపదలను నీ ఆపదగా, వారి దారిద్ర్యాన్ని నీ దారిద్ర్యంగా భావించి ఆ భారాన్ని స్వీకరించు ఈ విధంగా చేసినవాడే రాజు కుటీరము ఉన్నా భవనంలో నివసించినా ప్రజలందరినీ నిస్వార్థ బుద్ధితో హృదయపూర్వకంగా ప్రేమించగలిగిన వ్యక్తికి ప్రపంచమే వశమవుతుంది. ప్రపంచంలోని దుఃఖాన్ని పారద్రోలిన వాడే ప్రపంచానికి రాజు. ఆ విధంగా చేయక ఈ పృథ్వియొక్క రక్తాన్ని, సంపదను దోచుకొనువాడు దొంగ అనేక వేల నిర్భాగ్యజీవుల కన్నీటి ధారలు అనవరతం అతని శిరోభాగాన కురుస్తూనే ఉంటాయి. ఆ నిర్భాగ్య జీవుల శాప ప్రభావం నుంచి అతనిని ఏ రాజ్యాధికారమూ కాపాడలేదు. అతని భోగవిలాసాలలో అనేకమంది నిర్భాగ్యుల ఆకలి ఆక్రందనలు అంతర్గతమైవుంటాయి. ఆ నిర్భాగ్యుల దారిద్ర్యాన్ని కరిగించి అతడు బంగారపు అలంకారాలు ధరిస్తాడు. ఆ నిర్భాగ్యులు ఎండలో, వానలో, చలిలో చాలీచాలని గుడ్డపీలికలతో బాధపడుతూ ఉంటే ఇతడు నేలను జీరాడు రాజవస్త్రులు ధరించగలుగుతున్నాడు తమ్ముడూ, రాజును చంపినంత మాత్రాన రాజ్యాధికారము లభించదు ప్రపంచాన్ని తన మంచితో వశపరుచుకున్నప్పుడు ప్రపంచమే అతనిని రాజును చేస్తుంది"

గోవిందమాణిక్యుడు చెప్తూ చెప్తూ ఆగిపోయాడు. చుట్టూ నిశ్శబ్దంగా ఉంది. నక్షత్రరాయలు తలవంచుకొని మెదలకుండా కూర్చున్నాడు.

మహారాజుగారు ఒరలోనుంచి కత్తిని తీసి నక్షత్రరాయల ముందుంచుతూ ఇలా అన్నారు- "తమ్ముడూ, ఇక్కడ ఎవరూ లేరు, సాక్షికూడా ఎవరూ ఉండరు సోదరుడు తన సోదరుని గుండెల్లో కత్తితో పొడిచి చంపదలిచినట్లయితే ఆ పనికి ఇది తగిన ప్రదేశము, ఇదే తగిన సమయము. ఇక్కడ నిన్నెవరూ ఆటంకపర్చరు, నిన్నెవరూ నిందించరు నీలోను నాలోను ఒకేరక్తం, ఒకే తాత తండ్రుల రక్తం ప్రవహిస్తూ ఉంది. నీకు ఈ రక్తమే కావాలని ఉంటే నిరభ్యంతరంగా తీసుకో, కానీ ఈ పని నువ్వు నగరంలో మాత్రం చేయవద్దు అక్కడ ఈ రక్తము పడినచోట పవిత్రమైన భ్రాతృస్నేహ బంధనం అనాయాసంగా తెగిపోతుంది ఆ పాపానికి అంతం ఏమవుతుందో ఎవరూ చెప్పలేరు పాపబీజం ఒకటి పడితేచాలు అక్కడ చూస్తూఉండగానే మనకు తెలియకుండా ఎన్నివేల పాపవృక్షాలు మొలకలెత్తుతాయో చెప్పలేము క్రమంగా ఈ అందమైన మానవ సమాజము ఒక అరణ్యముగా మారిపోతుంది- ఇది ఎవరూ తెలుసుకోలేరు. అందుకని నగరంలోగానీ గ్రామంలోగానీ ఇరువురు సోదరులు నిష్కల్మష భావంతో అత్యంత ప్రేమాభిమానాలతో ఒకరినొకరు కౌగిలించుకొనేచోట, ఆ సోదరుని ఇంటిలోనే అతనిని చంపవద్దు. అందుకే ఇవాళ నిన్ను ఈ అడవిలోనికి తీసుకు వచ్చాను"

ఈ విధంగా చెప్పి మహారాజుగారు కత్తిని నక్షత్రరాయల చేతికి అందించారు ఆ కత్తి నక్షత్రరాయల చేతి నుంచి జారి క్రింద పడిపోయింది. అతడు రెండు చేతులతో

ముఖం కప్పుకొని ఏడుస్తూ "అన్నా, నేను నిర్దోషిని, నా మనస్సులో ఇలాంటి ఆలోచన ఎప్పుడూ కలుగలేదు" అని అన్నాడు

మహారాజుగారు అతనిని కౌగలించుకొని "ఆ సంగతి నాకు తెలుసు అయినా, నువ్వు నన్ను చంపగలవా? నిన్నెవరో రెచ్చగొట్టారు" అని అన్నారు.

పూజారి రఘుపతి నన్నీపనిచేయమని ఉపదేశించాడు" అని చెప్పాడు నక్షత్రరాయలు.

"రఘుపతికి దూరంగా ఉండు "

"ఎక్కడికి వెళ్ళమంటారో మీరే చెప్పండి. నాకు ఇక్కడ ఉండాలని లేదు. నేను ఇక్కడనుంచి – రఘుపతినుంచి దూరంగా పారిపోవాలనుకొంటున్నాను."

"నువ్వు నా దగ్గరే ఉండు ఎక్కడికీ వెళ్ళకుండా ఇక్కడేఉంటే రఘుపతి నిన్నేం చేస్తాడు!"

నక్షత్రరాయలు మహారాజుగారి చేతిని గట్టిగా పట్టుకున్నాడు

రఘుపతి తనను ఎక్కడ లాక్కొని పోతాడో అనే భయం అతని మనస్సులో కలుగసాగింది.

# 11

నక్షత్రరాయలు మహారాజుగారి చేతినిపట్టుకొని అడవి నుంచి ఇంటికి బయలుదేరే సమయానికి ఇంకా చీకటిపడ లేదు, కానీ అడవిలో మాత్రం చీకటిగానే ఉంది అంధకారపు వరద వచ్చి అడవిని ముంచివేసినట్లుగా ఉంది. వృక్షముల

అగ్రభాగములు మాత్రమే పైన కన్పిస్తున్నాయి. క్రమంగా అవికూడా కన్పించకుండా పోయినప్పుడు పూర్తిగా అంధ కారము వ్యాపించి ఆకాశము భూమి కలిసిపోతాయి.

రాజమహాలువైపు వెళ్ళకుండా మహారాజుగారు భువ నేశ్వరి ఆలయంవైపు బయలుదేరారు. ఆలయంలో సంధ్యా సమయపు పూజముగించి, దీపంవెలిగించుకొని రఘుపతి, జయ సింహుడు ఆలయం బయట కూర్చొని ఉన్నారు. ఇద్దరూ మౌనంగా తమ తమ ఆలోచనలలో మునిగిఉన్నారు వెలుగు చున్న క్షీణదీపకాంతిలో వారి ముఖాలు నీడవలె కన్పిస్తు న్నాయి. రఘుపతిని చూచి నక్షత్రరాయలు తల పైకెత్తలేక పోయాడు. అతడు మహారాజుగారి వెనుక తలవంచుకొని నిల బడ్డాడు మహారాజుగారు అతనిని తమ చెంతకు లాక్కొని గట్టిగా అతని చేతిని పట్టుకొని నిలబడ్డారు. దృష్టినిలిపి రఘు పతివైపు చూడసాగారు. రఘుపతికూడా నక్షత్రరాయలవైపు తీవ్రంగా చూచాడు. చివరికిమహారాజుగారు రఘుపతికి నమస్క రించారు. నక్షత్రరాయలు కూడా అదేవిధంగా చేశాడు. రఘుపతి నమస్కారాన్ని స్వీకరిస్తూ "జయం కలుగుగాక, రాజ్యంలో అందరూ కుశలమేనా?" అన్నాడు.

మహారాజుగారు ఒక క్షణం ఆగి ఇలా అన్నారు— "తమరు ఆశీర్వదిస్తే రాజ్యంలో అశుభం జరుగదు. ఈ రాజ్యంలో ఆ జగన్మాత బిడ్డలందరూ సద్భావంతో, ప్రేమా దరములతో కలిసి జీవిస్తున్నారు. ఇక్కడ అన్నదమ్ములను ఎవరూ వేరుబర్చలేరు. ప్రేమ ఉన్నచోట హింస అనేది మొలకెత్తదు. ఈ రాజ్యానికి అశుభం జరుగనున్నదనే

భయంవల్లనే ఇప్పుడు ఇక్కడికి వచ్చాను పాపభరితమగు సంకల్పపు వత్తిడివల్ల దావాగ్ని రగుల్కొనవచ్చును దయచేసి దానిని ఆర్పివేయండి, శాంతిని వర్షించండి, ఈ భూమిని చల్లగా ఉంచండి "

అందుకు రఘుపతి ఇలా అన్నాడు- "దేవతలు క్రోధాగ్నిని కురిపిస్తూఉంటే దానిని ఎవరు శాంతింప చేయగలరు? ఒక అపరాధినిగురించి కొన్ని వేలమంది నిరపరాధులు ఆ అగ్నిలోపడి దహించుకు పోతారు "

మహారాజుగారు ఈ విధంగా అన్నారు- "మా కున్న భయం కూడా అదే. అందుకే మేమింతగా భయపడు తున్నాము. ఈ విషయం తెలిసికూడా ఎవరూ తెలుసుకో వటంలేదు ఈ రాజ్యంలో దేవతల పేరు చెప్పి ఆ దేవతల నియమాలనే ఉల్లంఘించుచున్నారని మీకు తెలియదా!అందు వల్లనేఅశుభం జరుగుతుందని భయపడిఇవాళసాయంత్రంఇక్క డికి వచ్చాను. ఈ ప్రదేశంలో మీరు పాప వృక్షాన్ని నాటి, సుఖ సౌఖ్యాలతో సమృద్ధవంతంగా ఉన్న మా దేశంలోకి దేవతల క్రోధాగ్నిని ఆహ్వానించవద్దు. మేము మీతో చెప్ప దలచినవన్నీ చెప్పాము. ఈ విషయం చెప్పటానికే నేనిప్పుడు వచ్చాను "

చెప్పటం ముగించి మహారాజుగారు మర్మగర్భితమగు దృష్టితో రఘుపతి ముఖంలోకి చూడసాగారు మహారాజు గారి గంభీర, దృఢ కంఠస్వరం తుఫానువలె ఆ కుటీరంలో ప్రతి ధ్వనించింది. రఘుపతి ఏమీ జవాబు చెప్పలేదు. జందెమును సవరించుకొనసాగాడు. మహారాజుగారు నమస్కరించి నక్షత్ర

రాయల చేతిని పట్టుకొని బయటకు వెళ్ళిపోయారు. జయ సింహుడు వారి వెనుకనే బయటకు వెళ్ళాడు ఇంటిలోపల ఒక దీపము, రఘుపతి, అతని నీడ మాత్రమే మిగిలాయి.

అప్పటికి నల్దిశల అంధకారంవ్యాపించింది. నక్షత్రాలు మబ్బులచాటున అదృశ్యమైపోయాయి. ఎటుచూచినా అంధ కారం మాత్రమే కన్పిస్తూఉంది ఆగాఢాంధకారంలోవీస్తున్న గాలి ఎక్కడినుంచో కడిమిపూల వాసనను మోసుకొస్తుంది. అడవిలోని ఎండుటాకుల గరగర ధ్వని మాత్రం విన్పిస్తుంది మహారాజుగారు ఏవో ఆలోచనల్లో మునిగిపోయి నడుస్తు న్నారు అకస్మాత్తుగా వెనుకనుంచి ఎవరిదో "మహారాజా!" అనే పిలుపు విన్పించింది

మహారాజుగారు వెనుతిరిగి "ఎవరువారు?" అనిప్రశ్నిం చారు.

ఒక పరిచిత కంఠం విన్పించింది- "తమ సేవకుడు జయ సింహుడు మహారాజా తమరు నా గురువు, తమరు నా యజ మాని, తమరుతప్ప నాకు మరెవ్వరూ లేరు. తమ తమ్ముని చెయ్యిపట్టుకొని తమరు వారిని ఈ అంధకారంలోనుంచి ఏ విధంగా తీసుకు వెళుతున్నారో అదేవిధంగా నన్ను కూడా మీ వెంట తీసుకు వెళ్ళండి. నేను గాఢాంధకారంలోపడి వున్నాను. నాకు మేలు జరుగుతుందో కీడు జరుగుతుందో ఏది ఎలా జరుగుతుందో ఏమీ తెలియకుండా ఉంది. నేనొకసారి ఎడమకు, మరొకసారి కుడికి పోతున్నాను. నా జీవిత నావ నావికుడు లేని చందాన పోతుంది."

ఆ అంధకారంలో అతని కళ్ళనుంచి జలజల కారిన కన్నీటిని ఎవరూ చూడలేదు. ఆవేశము, ఆర్ద్రతనిండి కంపించే జయసింహుని కంఠస్వరం మాత్రమే మహారాజుగారు వినగలి గారు. నలువైపుల అంధకారం, చంచలమగు సముద్రంవలె గాలి తీవ్రంగా వీచసాగింది. మహారాజుగారు జయసింహుని చెయ్యిపట్టుకొని "రా, మా వెంట భవనానికి వెళదాం, రా!" అన్నారు.

# 12

మర్నాడు జయసింహుడు పూజా కార్యక్రమము ముగిసిన తరువాత ఆలయానికి తిరిగి వచ్చాడు. రఘుపతి దుఃఖితుడై ఒంటరిగా కూర్చొని ఉన్నాడు. ఇంతకు ముందెప్పుడూ ఇలాంటి నియమవిరుద్ధమగు పని జరుగలేదు.

జయసింహుడు వచ్చినవాడు గురువుగారి వద్దకు వెళ్ళలేదు సరాసరి తన తోటలోకి వెళ్ళి మొక్కలమధ్య కూర్చున్నాడు. ఆ సమయంలో మొక్కలు గాలికి తలలాడిస్తున్నాయి. అప్పుడా మొక్కలు జయసింహుని చుట్టూచేరి అతనిని సంతోషపెట్టుటకు తలలాడిస్తూ, తమ నీడలతో నాట్యం చేస్తున్నట్లు కన్పిస్తున్నాయి. జయసింహుని చుట్టూ పుష్పాలతో నిండిన మొక్కలున్నాయి. తోటంతా పచ్చగా నవనవలాడుతూ ఉంది. మనస్సుకు హాయినిచ్చు వృక్షములనీడ సుకోమల స్నేహపు వెన్నెలవలె జయసింహునికి ఆనందాన్ని కల్గిస్తూ ఉంది. అత్యంత మధుర శబ్దాలు విన్పిస్తున్నాయి, ఎవరో మృదుమధుర కంఠంతో పిలుస్తున్నట్లు, ప్రకృతి తన

ప్రేమపూర్వక ఆలింగనంతో చల్లదనమును ప్రసాదించుచున్న ట్లుగా ఉంది. ఇక్కడ అన్నీ ఏదో ఒకటి ఆశిస్తాయి ఎవరూ ఏమీ ప్రశ్నించరు ఇక్కడ ఆలోచనలకు ఎవరూ అంత రాయం కలిగించరు చూడదలిచినవాళ్ళు చూడవచ్చును, మాట్లాడ దలచినవాళ్ళు మాట్లాడవచ్చును- ఇక్కడ ఏమీ నిషేధంలేదు. ఈ శాంతిదాయిని యగు శుశ్రూషలో, ప్రకృతియొక్క ఈ అంతఃపురంలో కూర్చొని జయసింహుడు ఆలోచించసాగాడు మహారాజుగారి ఉపదేశాన్ని గురించి అతడు మనస్సులో ఆలోచించుకోసాగాడు.

అదేసమయాన నెమ్మదిగావచ్చి రఘుపతి అతని వీపు మీద చేయివేశాడు జయసింహుడు త్రుళ్ళిపడ్డాడు. రఘుపతి అతనికి దగ్గరగా కూర్చున్నాడు. అతడు జయసింహుని వంక చూస్తూ తడబడుతున్న కంఠస్వరంతో "వత్సా, నీ ఆలోచనలు ఇలా ఎందుకు మారిపోయాయి? నెమ్మదిగా నా నుంచి దూరమైపోతున్నావు, నా వల్ల ఏమి అపరాధం జరిగింది?" అని అన్నాడు.

జయసింహుడు ఏదో చెప్పబోవునంతలో రఘుపతి అతని మాటకు అడ్డొస్తూ ఇలా అన్నాడు- "నేను నీకేదైనా లోపం చేశానా? ఎప్పటివలెనే నాకు నీ యందు వాత్సల్యం ఉందిగదా! జయసింహా, నా వల్ల ఏదైనా అపరాధం జరిగిందా? ఒకవేళ జరిగినప్పటికీ నేను నీకు గురువును - తండ్రిలాంటివాడను. నేను నిన్ను క్షమాపణ కోరుకొంటున్నాను, క్షమించు."

జయసింహుడు పిడుగుపడినట్లు త్రుళ్ళిపడ్డాడు. అతడు గురువుగారి పాదాలపైబడి ఏడుస్తూ ఇలా అన్నాడు-"తండ్రీ, నాకేమీ తెలియదు. నేనేమీ అర్థంచేసుకోలేను. నేను ఎక్కడికి పోతున్నానో ఏమో కూడా తెలియకుండా ఉంది"

రఘుపతి జయసింహుని చెయ్యిపట్టుకొనిఇలాఅన్నాడు-"వత్సా, నేను నిన్ను చిన్నతినంనుంచి పెంచి పెద్దచేశాను. తండ్రికంటె ఎక్కువ శ్రద్ధతో నీకు శాస్త్రములను నేర్పాను. నీ యందు పూర్తి విశ్వాసముంచి మిత్రునివలె భావించి ప్రతి విషయంలోనూ నీ సలహా సహకారాలు పొందుతూవచ్చాను. ఇవాళ నిన్ను నా నుంచి దూరంగా తీసుకుపోతున్న దెవరు? మన చిరస్నేహమును, మమతాబంధనమును విచ్ఛిన్నము చేస్తున దెవరు? నీ మీద మాకు భగవంతుడిచ్చిన అధికారాన్ని తొలగించుటకు ప్రయత్నం చేస్తున్న వారెవరు? నాయనా, ఆ పాపాత్ముడెవడో చెప్పు!"

"ప్రభూ, నన్ను మీ నుంచి ఎవరూ వేరుచేయటం లేదు. మీరే నన్ను దూరంగా త్రోసివేశారు. నేను ఇంటి లోపలే ఉన్నాను మీరే నన్ను అకస్మాత్తుగా బయట బాట లోకి విసరి వేశారు. ఎవరు తండ్రి, తల్లెవరు, సోదరుడెవరు, ఎవరికెవరు అని మీరేగదా చెప్పారు! ఈ ప్రపంచంలో ఏ బంధనాలూ లేవన్నారు. స్నేహము, ప్రేమ అనే పవిత్ర అధికారము కూడా లేదని చెప్పారు నేను తల్లిగా భావిస్తూ వచ్చిన వారిని మీరు 'శక్తి' అని చెప్పారు. ప్రజలు ఎక్కడ హింస చేస్తున్నారో, ఎక్కడ రక్తపాతం గావిస్తున్నారో, ఎక్కడ అన్నదమ్ములు కలహించుకొంటున్నారో, పరస్పరం

మానవులు ఘర్షణ పడుతున్నారో అక్కడ ఈ 'శక్తి' రక్త పిపాసతో ఘోరెత్తుకొని తయారవుతుంది. మీరు నన్ను తల్లి ఒడిలో నుంచి వేరుచేసి ఇలాంటి రాక్షస దేశంలోకి ఎందుకు నెట్టివేశారు ప్రభూ!"

రఘుపతి కొద్దిసేపటి వరకు ఆశ్చర్యంగా చూస్తూ కూర్చున్నాడు చివరికి దీర్ఘంగా నిట్టూర్చి "అలా అయితే నువ్వు పూర్తిగా స్వతంత్రుడవై బంధనవిముక్తిపొంది నీమీద ఉన్న నా అధికారాలను తొలగించుకో. ఆ విధంగా నీకు సుఖం లభిస్తే అలాగే చేసుకో" అని రఘుపతి లేచివెళ్ళటకు సిద్ధమయ్యాడు.

జయసింహుడు అతని పాదాలను పట్టుకొని ఇలా అన్నాడు– "లేదు, లేదు ప్రభూ మీరు నన్ను త్యజించినప్పటికీ నేను మిమ్మల్ని వదలలేను. మీరు ఇక్కడే ఉండండి నేను మీ సేవలోనే ఉంటాను. మీ మార్గమే నా మార్గము, నాకు మరో మార్గమే లేదు."

అప్పుడు రఘుపతి అతనిని తన హృదయానికి హత్తుకున్నాడు. జయసింహుని భుజాలమీద రఘుపతి కన్నీటి చుక్కలు టపటప రాలాయి.

# 13

ఆలయంలో అనేకమంది జనులు గుమికూడారు ఆ ప్రదేశమంతా కోలాహలంగా ఉంది. రఘుపతి తీవ్రమగు కంఠస్వరంతో "మీరందరూ ఇక్కడికి ఎందుకు వచ్చారు?" అని అడిగాడు.

అక్కడ మూగిన జనులందరూ ఏకకంఠంతో "భువనే శ్వరిమాత దర్శనానికి వచ్చాము" అని అన్నారు.

"ఇంకెక్కడి భువనేశ్వరిమాత! ఆమె ఈ రాజ్యాన్ని వదలివెళ్ళిపోయింది. మీలో ఒక్కరైనా ఆమెను దేశంవదలి వెళ్ళకుండా ఆపలేకపోయారు ఆమె వెళ్ళిపోయింది" అని చెప్పాడు రఘుపతి.

చాలా గందరగోళం ప్రారంభమయింది. నలువైపుల మూగి ఉన్న జనులు రకరకాలుగా మాట్లాడసాగారు.

"ఇంతకూ ఏంజరిగింది, పూజారిగారూ?"

"మా వల్ల ఏమి అపరాధం జరిగింది?"

"ఆ దేవికి సంతృప్తికలిగించే ఉపాయమేదీ లేనేలేదా?"

"మా అన్న కుమారునికి జబ్బుగా ఉంది అందువల్ల ఈమధ్య చాలారోజులుగా దేవిదర్శనానికి రాలేకపోయాను." తాను రానందువల్లనే దేశం వదలి వెళ్ళిపోయిందని ఆ వ్యక్తి ఉద్దేశ్యం

"నేను దేవికి రెండు మేకల్ని బలి ఇస్తానని మొక్కు కొన్నాను. చాలా దూరాన ఉన్నందువల్ల సమయానికి రాలేకపోయాను." తాను రెండు మేకల్ని బలి ఇవ్వనందు వల్లనే దేశానికి ఇలాంటి అశుభం కలిగిందని ఆలోచించి ఆ మనిషికి చాలా బాధ కలిగింది

"గోవర్ధనుడు దేవి మొక్కు చెల్లించలేదు. అందుకు దేవికూడా అతనికి తగిన శిక్షనే విధించింది. అతని ప్లీహ రోగము హెచ్చి భయంకరంగా తయారయింది ఆరు మాసాలనుంచి అతడు మంచంలోనుంచి లేవటమే లేదు. ప్లీహ

రోగంతో గోవర్ధనుడు చస్తే ఎవరికి కావాలి బ్రతికితే ఎవరికి కావాలి, భువనేశ్వరి మాత దేశాన్ని వదలి వెళ్ళకుండా ఉంటే అదే పదివేలు ఈ విషయమే అతను మనస్సులో ప్రార్థించుకోసాగాడు. పాపం దురదృష్టవంతుడగు గోవర్ధనుని ప్లీహరోగము మరింత హెచ్చాలనే అందరూకోరుకోసాగారు.

"ఆ గుంపులో బాగా ఒడ్డూపొడవూగల ఒక మనిషి అందరినీ కసురుకొని ముందుకు వచ్చాడు. రఘుపతికి నమస్కరించి "పూజారిగారూ, దేవి ఎందుకు వెళ్ళిపోయింది? మా వల్ల జరిగిన అపరాధం ఏమిటి?" అని అడిగాడు

"మీరు దేవికి ఒక్క రక్తపుబొట్టు కూడా అర్పించలేరు- ఇదేగదా మీ భక్తి?" అని జవాబు చెప్పాడు రఘు

అందరూ మౌనం వహించారు కొద్దిక్షణాలలో మళ్ళీ వారు తమలో తాము మాట్లాడుకోసాగారు. "మహారాజుగారు నిషేధిస్తే అందుకు మనము చేయగలిగిందేముంది?" అని ఒక మూల ఎవరో నెమ్మదిగా గొణిగారు.

జయసింహుడు శిలావిగ్రహంవలె మెదలకుండాకూర్చున్నాడు "దేవి నిషేధమేగాని మహారాజుగారి నిషేధంకాదు" అనేమాట విద్యుచ్ఛక్తివలెమాటిమాటికి అతనినాలుకమీదికి వస్తుందికానీ అతడు తననుతాను నిగ్రహించుకున్నాడు. ఆ మాటనుబయటకు చెప్పలేదు.

రఘుపతి బిగ్గరగా అక్కడ చేరిన జనులనుద్దేశించి ఇలా చెప్పాడు- "మహారాజెవరు? ఆ తల్లికంటె రాజాజ్ఞ గొప్పదా? ఆ విధంగా అనుకొన్నట్లయితే ఆ తల్లిలేని

దేశంలో మీమహారాజుగారి పాలనలోనేఉండండి మిమ్మల్ని ఎవరు కాపాడతారో చూస్తాను!"

ప్రజలలో గుసగుసలు బయలు దేరాయి. అందరూ జాగ్రత్తగా ఆలోచించి మాట్లాడసాగారు

రఘుపతి లేచినిలబడి వారితో మళ్ళీ ఈ విధంగా చెప్పాడు- "మీారందరూ మహారాజునే గొప్పగా భావించి మీా తల్లిని అవమానించి దేశంనుంచి తరిమి వేశారు. సుఖ శాంతులతో జీవించవచ్చునని మనస్సులో ఆలోచిస్తున్నారా? అది మీా భ్రమ. మూడు సంవత్సరాల లోపల ఈ దేశంలో ఒక్క మనిషి కూడా మిగలకుండా నాశనమై పోతారు. ఒక్క ఇంటిలో కూడా దీపం వెలగదు"

అక్కడ చేరిన జనసమూహంలో గుసగుసలు సముద్ర ఘోషవలె మరింత హెచ్చాయి క్రమంగా జనసమూహం కూడా పెరగసాగింది అందరూ రఘుపతికి చేతులెత్తి నమస్కరించి ఏకకంఠంతో ఇలా ప్రార్థించారు- "బిడ్డలవల్ల అపరాధం జరిగినప్పుడు తల్లి వారిని దండిస్తుంది. కానీ తన బిడ్డలను వదలి వెళ్ళిపోవటం మాత్రం జరుగదు- ఎప్పుడైనా ఇలాంటిది జరిగిందా? ప్రభూ, ఆ తల్లి తిరిగిరావటానికి మేము ఏంచేయాలో చెప్పండి"

"మీా మహారాజుగారిని ఈ దేశంనుంచి తరిమివేసినప్పుడే దేవి మళ్ళీ మన దేశంలోకి అడుగు పెడుతుంది" అని రఘుపతి జవాబు చెప్పాడు.

ఈ మాట విని వారి గుసగుసలన్నీ అకస్మాత్తుగా ఆగిపోయాయి. నలువైపుల నిశ్శబ్దం వ్యాపించింది ప్రజలు ఒకరి

ముఖాలొకరుచూచుకోసాగారు వారిలోఒక్కరుకూడా మాట్లా డటానికి సాహసించలేకపోయారు.

రఘుపతి వారి నుద్దేశించి బిగ్గరగా ఇలా చెప్పాడు- "మీరు స్వయంగా చూడాలనుకొంటున్నారు గదూ! రండి, నా వెంట ఆలయంలోనికి రండి చాలా దూర దూరంనుంచి మీరు ఎన్నో ఆశలతో దేవీ దర్శనానికి వచ్చారు. ఒకసారి మీ రందరూ ఆలయంలోనికి వచ్చి చూడండి"

అందరూ భయం భయంగా ఆలయం ముందు గుమి కూడారు ఆలయద్వారం మూసి ఉంది. రఘుపతి నెమ్మదిగా తలుపు తెరిచాడు

కాస్సేపటివరకు ఎవరూ ఏమీ మాట్లాడలేకపోయారు. విగ్రహం యొక్క ముఖం కన్పించటం లేదు. విగ్రహం యొక్క వీపు మాత్రమే ప్రజలకు కన్పించింది. దేవి నిజం గానే అసంతృప్తి చెందింది. అకస్మాత్తుగా ప్రజలలోఏడుపులు పెడబొబ్బలు ప్రారంభమయ్యాయి- "తల్లీ, భువనేశ్వరి మాతా, ఒక్కసారి నీ దర్శనభాగ్యం కల్గించు దేవీ! మా వల్ల జరిగిన అపరాధం ఏమిటమ్మా? తల్లీ, ఎక్కడున్నావు!" అంటూ నలువైపుల గోలప్రారంభమయింది. కానీ ఆ శిలా ప్రతిమ భక్తులవైపు తిరగనే లేదు వారిలో కొందరుస్పృహ తప్పి పడిపోయారు. జరుగుతున్నదేమిటో ఏమీ అర్థంకాని పిల్లలు ఏడ్వసాగారు. వృద్ధులు "తల్లీ, భువనేశ్వరిమాతా!" అంటూ విలపించసాగారు స్త్రీలు ముసుగులు తొలగించి అక్కడి దృశ్యాన్ని చూచి గుండెలు బాదుకొంటూ శోకాలు ప్రారంభించారు. యువకులు భయంతో కంపిస్తూ "తల్లీ,

మేము నిన్ను తిరిగి తెచ్చుకుంటాం. నిన్ను మేము వదలి వేయము తల్లీ!" అని అనసాగారు వారిలో ఒక వ్యక్తి పిచ్చి వానివలె "నా తల్లి తన బిడ్డల ముఖాలు చూడదలచ లేదు" అని అంటున్నాడు. ఈ విధంగా అక్కడ చేరిన ప్రజలందరూ 'అమ్మా, అమ్మా' అంటూ విలపించసాగారు. కానీ ఆ తల్లికి మాత్రం జాలి కలుగలేదు. మధ్యాహ్న మయింది ఎండ తీవ్రంగా మండిపోతుంది ప్రజలు అలాగే ఏడుస్తూ ఆలయం ముందు వున్నారు.

అప్పుడు జయసింహుడు భయపడుతూ అక్కడికివచ్చి రఘుపతితో "ప్రభూ, నేను ప్రజలతో ఏమీ మాట్లాడ కూడదా?" అని అడిగాడు.

"వీల్లేదు, ఒక్కమాట కూడా మాట్లాడవద్దు" అని రఘుపతి శాసించాడు.

"ఇదంతా నిజమేనా, ఏమీ సందేహంలేదా?"

"ఏమీలేదు."

జయసింహుడు పిడికిలి బిగించి బిగ్గరగా "ఇదంతా నిజ మేనని ఏ విధంగా నమ్మాలి?" అని అన్నాడు.

రఘుపతి జయసింహునివంక మిరిమిరి చూస్తూ "హుఁ" అని అన్నాడు.

జయసింహుడు గుండెమీద చేయివేసుకొని "అబ్బా. నా గుండెలు పగిలిపోతున్నాయి" అంటూ జనంలో నుంచి దూరంగా పారిపోయాడు.

# 14

ఆ మర్నాడే చతుర్దశి. ఆ రోజు రాత్రే పదునాలుగు దేవతల పూజ జరుగుతుంది ఉదయం శారెడు ప్రొద్దెక్కే వరకు ఆకాశంలో మబ్బులు లేవు సూర్యుని బంగారురంగు కిరణాలుపడే పరిపూర్ణ ఆనందంతో నిండిఉన్న తోటలోకి జయసింహుడు ఒంటరిగా వెళ్ళి కూర్చున్నాడు అప్పుడు అతని మనస్సులో పూర్వస్మృతులెన్నో మేల్కొన్నాయి. ఈ తోటలో, ఆలయం ముందున్న ఈ రాతిమెట్లమీద, గోమతి నదీతీరానఉన్న ఈ విశాల వటవృక్షపు నీడలో, ఎల్లప్పుడూ వటవృక్షపు నీడతో కప్పి ఉండే ఈ తటాకపు ఒడ్డున జయ సింహుని చిన్నతనం గడిచింది. ఆ రోజులు మధుర స్వప్నం వలె అతని మనస్సులో మెదిలాయి. చిన్ననాటి ఆ దృశ్యా లన్నీ అతనికి ఎంతో మధురంగా కన్పించసాగాయి. ఇవాళ కూడా ఆ మధురదృశ్యాలు అతనిని చేతులెత్తి ఆహ్వానిస్తు న్నాయి. కానీ అతని హృదయం మాత్రం "నేను జీవిత యాత్రకు బయలుదేరాను. నేను ఆ మజిలీ నుంచి శలవుతీసు కొని వచ్చేశాను. ఇక వెనక్కి తిరిగిరావటం అసంభవం" అని అంటుంది. తెల్లరాతితో కట్టిన ఆలయంమీద సూర్యకిరణాలు పడుతున్నాయి. ఆలయానికి ఎడమవైపు గోడమీద గాలికి కదులుతున్న పొగడచెట్టు నీడ పడుతూ ఉంది చిన్నతనంలో జయసింహునికి ఆలయం చైతన్య రహితంగా కన్పించేది. రాతి మెట్లమీద తాను ఒక్కడే కూర్చుని ఆటలాడుకొంటున్న ప్పుడు అతడు ఈ రాళ్ళనే తన స్నేహితులుగా భావించేవాడు.

ఇవాళ ఉదయం కూడా సూర్యకాంతిలో అతనికి ఆలయం చైతన్యరహితంగానే కన్పించింది. జయసింహుడు ఆలయపు రాతిమెట్లను అలాగే చిన్ననాటి దృష్టితో చూడసాగాడు. ఆలయంలోని కాళీమాత విగ్రహాన్ని ఇవాళ మళ్ళీ ఒక్కసారి 'అమ్మా' అని పిలవాలని కోర్కె కలిగింది కానీ అతని హృదయం స్వాభిమానంతో నిండిపోయింది. నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి

రఘుపతి రాకను గమనించి జయసింహుడు కన్నీరు తుడుచుకొని గురువుగారికి నమస్కరించి లేచి నిలబడ్డాడు.

"ఇవాళ పూజజరిగేరోజు మాతపాదాలుతాకి ప్రతిజ్ఞ చేశావు గుర్తుందా?" అని అడిగాడు రఘుపతి.

గుర్తున్నది"

"ప్రతిజ్ఞను నెరవేరుస్తావుగదూ?"

"తప్పకుండా."

"చూడు నాయనా, జాగ్రత్తగా కార్యాన్ని సాధించు. ఆపద రావచ్చునని భయంగా ఉంది నీ క్షేమాన్ని కాంక్షించే ప్రజలను మహారాజుకు వ్యతిరేకంగా రెచ్చగొట్టాను"

జయసింహుడు మెదలకుండా రఘుపతి ముఖంలోకి చూస్తూ నిలబడ్డాడు. ఏమీ మాట్లాడలేదు. రఘుపతి జయసింహుని తలనిమురుతూ "నా ఆశీర్వాద బలంతో నీ పనిని నిర్విఘ్నంగా సాధించగలుగుతావు తల్లి ఆదేశాన్ని సమర్థవంతంగా పాలించగలవు" అని చెప్పి అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం తరువాత మహారాజుగారు తమ గదిలో ధ్రువునితో ఆటలాడుతూ కూర్చొని ఉన్నారు ధ్రువుని ఆజ్ఞ ప్రకారం వారు కిరీటాన్ని ధరిస్తూ మగల అతడు చెప్పినప్పుడు తీసివేస్తున్నారు. ధ్రువుడు మహారాజుగారి అవస్థచూచి కిల కిలా నవ్వేస్తున్నాడు మహారాజుగారు చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నారు- "నేను అభ్యాసం చేస్తున్నాను. వారి ఆజ్ఞానుసారం ఈ కిరీటాన్ని ఎంత సునాయాసంగా ధరించగలుగుతున్నానో తిరిగి వారు కోరిన వెంటనే దీనిని తీసివేయగలనా? కిరీటాన్ని ధరించటము ఎంత కష్టమైనదో దానిని త్యజించటము అంతకంటె కష్టమైన విషయము"

అకస్మాత్తుగా ధ్రువునికి ఒక ఆలోచన కలిగింది కొద్ది క్షణాలవరకు మహారాజుగారి ముఖంలోకి చూస్తూ నోటిలో వ్రేలువేసుకొని "నువ్వు ఆజు" అని అన్నాడు రాజు అనే శబ్దంలో 'ర' అక్షరం లోపించినందుకు ధ్రువునికి కొంచెమైనా బాధ కలుగలేదు. మహారాజుగారి సమక్షంలోనే వారిని 'ఆజు' అన్నందుకు అతనికిచాలా ఆత్మసంతృప్తికలిగినట్లుంది.

మహారాజుగారు ధ్రువుని మాటకు కోపంవచ్చినట్లు "నువ్వే ఆజువు" అని అన్నారు.

"నువ్వేఆజువు" అని అన్నాడు ధ్రువుడు.

ఈ విషయంలో వారిద్దరికీ చాలా సేపు వాదవివాదం జరుగుతూనే ఉంది. ఎవరు ఆజో నిర్ణయించగల ఆధారము వారిలో ఎవరికీ కన్పించలేదు. ఆ తర్కము ముగించటానికి శారీరక బలం ఒక్కటే మార్గము చివరకు మహారాజుగారు తమ కిరీటాన్ని తీసి ధ్రువుని శిరముమీద ధరింపజేశారు.

ధ్రువుడు తరువాత ఏమీ మాట్లాడలేకపోయాడు. అతడు పూర్తిగా ఓడిపోయాడు కిరీటము ధ్రువుని సగము ముఖాన్ని కప్పివేసింది. కిరీటము ఉన్న తన తల ఆడిస్తూ ధ్రువుడు కిరీటములేని మహారాజుగారిని "ఒక కథ చెప్పు" అని ఆజ్ఞాపించాడు

"ఏ కథ చెప్పమంటావు?" అని అడిగారు మహారాజుగారు.

"అక్క కథ చెప్పు" అన్నాడు ధ్రువుడు కథ అంటే అతడు అక్క కథ అనే అనుకొనేవాడు. తన అక్క చెప్పే కథ తప్ప ఈ ప్రపంచంలో మరొక కథ అనేదే లేదని అతని అభిప్రాయం.

అప్పుడు మహారాజుగారు గొప్పదగు ఒక పౌరాణిక కథను చెప్పనారంభించారు- "అనగనగా హిరణ్యకశ్యపుడనే ఒక రాజు ఉండేవాడు "

'రాజు' అనే మాటవినగానే ధ్రువుడు 'నేను అజును' అని అన్నాడు. అందంగా ముఖాన్ని కప్పివేస్తూ కదులుతున్న ఆ కిరీటాన్ని ఆడిస్తూ హిరణ్య కశ్యపుడు రాజు అనే విషయాన్ని అంగీకరించలేదు.

ముఖస్తుతి చేయు సభాసదునివలె గోవిందమాణిక్య ప్రభువు కిరీటము ధరించిన ఆ బాలకుని సంతృప్తి పరచుటకు "నువ్వూ 'అజువు' అతడూ 'ఆజే' " అని అన్నారు.

ధ్రువుడు అందుకుకూడా అంగీకరించకుండా "నేనే అజును" అని అన్నాడు

చివరికి మహారాజుగారు "హిరణ్యకశిపుడు 'అజు' కాదు, అతడు 'అసురుడు'" అని చెప్పినప్పుడు దానికి వ్యతిరేకించవలసిన అవసరం లేదని ధ్రువుడు అంగీకరించాడు.

ఇంతలో నక్షత్రరాయలు గదిలోనికి వచ్చి "మహారాజాగారు నన్నేదో కార్యవశమున పిలిపించారని విన్నాను. తమ ఆజ్ఞకోసము ఎదురు చూస్తున్నాను" అని అన్నాడు గోవింద మాణిక్య ప్రభువుతో.

"కాస్సేపు నిలబడు ఇంతలో నేను కథ చెప్పటం పూర్తిచేస్తాను" అని అన్నాడు గోవిందమాణిక్య ప్రభువు. నక్షత్రరాయలుతో ఈ విధంగా చెప్పి మహారాజుగారు కథను ముగించారు 'అసురుడు దుష్టుడు' అనే అభిప్రాయాన్ని కథ విన్న తరువాత ధ్రువుడు వ్యక్తంచేశాడు.

ధ్రువుని శిరము మీద కిరీటము ఉండటం నక్షత్ర రాయలుకు నచ్చలేదు నక్షత్రరాయలు చూపు తన మీదనే ఉందని గమనించిన ధ్రువుడు గంభీరంగా "నేను అజును" అని అతనితో చెప్పాడు.

"ఛీ, ఛీ, ఛీ! ఇది మరీఘోరం" అంటూ నక్షత్ర రాయలు ధ్రువుని శిరముమీద ఉన్న కిరీటాన్ని తీసి మహారాజుగారికి ఇవ్వటానికి ప్రయత్నించాడు. కిరీటాన్ని తీసుకొనే ప్రయత్నాన్ని చూచి ధ్రువుడు తానే మహారాజు నన్నట్లు బిగ్గరగా అరచాడు. ధ్రువునికి కలుగబోయే ఈ ఆపదనుంచి అతనిని కాపాడుతూ మహారాజుగారు నక్షత్రరాయల్ని అలాంటి పని చేయనివ్వలేదు.

తరువాత గోవిందమాణిక్య ప్రభువు నక్షత్రరాయల నుద్దేశించి "పూజారిరఘుపతి అబద్ధప్రచారంద్వారా ప్రజలలో అసంతృప్తిని రేకెత్తించాడని విన్నాను నువ్వు పట్టణంలో తిరిగి నిజమేమిటో అబద్ధమేమిటో తెలుసుకొనివచ్చి మాతో చెప్పు" అని అన్నారు.

"చిత్తం" అంటూ నక్షత్రరాయలు బయటకు వెళ్ళిపోయాడు కానీ ధ్రువుడు కిరీటము ధరించటము అతనికి ఎంత మాత్రం నచ్చలేదు.

తరువాత ద్వారపాలకుడు ప్రవేశించి "పూజారిగారి సేవకుడు జయసింహుడు మహారాజుగారి దర్శనార్థము వచ్చి ఉన్నాడు" అని చెప్పాడు.

మహారాజుగారు అతనిని ప్రవేశపెట్టవలసిందిగా ఆజ్ఞాపించారు.

జయసింహుడు మహారాజుగారికి నమస్కరించి ఇలా చెప్పాడు- "నేను చాలాదూరంగా వెళ్ళిపోతున్నాను తమరు మాకు మహారాజులు, మాకు గురువుతో సమానులు, అందుకని తమ ఆశీర్వాదం పొందటానికి వచ్చాను"

"జయసింహా, నువ్వు ఎక్కడికి వెళ్ళదలిచావు?" అని మహారాజుగారు అడిగారు.

"మహారాజా, ఎక్కడికి వెళతానో నిశ్చయంగా చెప్పలేను! అది మరెవ్వరూ చెప్పలేరు" అని జవాబు చెప్పాడు జయసింహుడు. మహారాజుగారు ఏదో మాట్లాడబోవటం గమనించి జయసింహుడు మళ్ళీ తానే ఇలా అన్నాడు- "మహారాజా, దయచేసి తమరు నన్ను ఆపకండి, తమరు ఆటంకపర్చి

నట్లయితే నా ప్రయాణం శుభంగా సాగదు. అక్కడికి చేరు కున్న తరువాత ఇక్కడ నా మనస్సులో ఉన్న సందేహాలన్నీ తీరాలని తమరు నన్ను దీవించండి. ఇక్కడ నాలో ఉన్న అజ్ఞాన మేఘాలు తమవంటి మహారాజుగారి పాలనలోకి వెళ్ళ గానే తొలగిపోయి శాంతి లభించాలని ఆశీర్వదించండి."

"ఎప్పుడు వెళతావు?" అనిరాజుగారు ప్రశ్నించారు.

"ఇవాళ సాయంత్రం వెళతాను ఎక్కువ సమయం లేదు మహారాజా! కనుక నేను శలవు తీసుకుంటాను" ఈ మాటతో పాటు మహారాజుగారి పాదాలమీద రెండుకన్నీటి బిందువులు రాలాయి

జయసింహుడు వెళ్ళుటకు లేచి నిలబడగానే ధ్రువుడు నెమ్మదిగా అతని దగ్గరకువచ్చి ధోవతిపట్టి లాగుతూ "నువ్వు వెళ్ళవద్దు" అని అన్నాడు.

జయసింహుడు నవ్వి వెనక్కి తిరిగి వచ్చాడు. ధ్రువుని ఎత్తుకొని ముద్దుపెట్టుకొంటూ "నాయనా, నేను ఎవరివద్ద ఉంటాను? నా కెవరున్నారు?" అని అన్నాడు.

"నేను రాజును" అన్నాడు ధ్రువుడు.

"నువ్వు రాజులకు రాజువు. నువ్వేగదా అందరినీ బంధించి ఉంచావు" అన్నాడు జయసింహుడు.

తరువాత ధ్రువునిని క్రిందికిదింపి జయసింహుడుగదిలో నుంచిబయటకు వెళ్ళిపోయాడు. మహారాజుగారు కొద్దిసేపటి వరకు గంభీరంగా ఆలోచిస్తూ కూర్చున్నారు.

# 15

ఇవాళ చతుర్దశి. ఆకాశంలో మబ్బులు ఉన్నాయి. చంద్రుడు కూడా ఉదయించాడు. ఒకచోట వెలుతురుగా ఉంటే మరొకచోట చీకటిగా ఉంది చంద్రుడు ఒకసారి మబ్బులలోనుంచి బయటకువచ్చిప్రకాశించేవాడు అంతలోనే మబ్బుల చాటుకు వెళ్ళిపోతూ ఉండేవాడు. గోమతి నదీతీరాన ఉన్న అడవి చంద్రునివైపు చూస్తూ తనలోని గాఢాంధకారాన్ని తొలగించుకొంటూ మధ్య మధ్య నిట్టూరుస్తున్నట్లుగా ఉంది.

ఇవాళరాత్రి ఎవరూ బయటకు రాకూడదని నిషేధం. అందుకని ఎవరూ బయటకురారు వీధులన్నీ మామూలు కంటె నిర్మానుష్యంగా కన్పిస్తున్నాయి నగరవాసులందరూ ఇళ్ళలోని దీపాలు ఆర్పుకొని, తలుపులు మూసుకొన్నారు వీధులలో కాపలా వాళ్ళుకూడా తిరగటంలేదు ఇవాళరాత్రి దొంగలుకూడా బయటకు రారు. ఆ రాత్రి సమయంలో ఎవరైనా చనిపోయినట్లయితే స్మశానానికి తీసుకు వెళ్ళటకు కూడా వీల్లేదు. శవాన్ని ఉదయం వరకు ఇంటిలోనే ఉంచుకోవాలి ఇంట్లో ఎవరికైనా జబ్బుగా ఉన్నప్పుడు ఆ రాత్రి వైద్యుని కొరకుకూడా వెళ్ళకూడదు. ప్రతిరోజుఅక్కడక్కడ వీధి అరుగులమీద నిద్రించే భిక్షుకులుకూడా ఇవాళ ఎవరి పశువులశాలలో తలదాచుకుంటారు.

ఇవాళ రాత్రి నక్కలు కుక్కలు నగరంలోని ప్ర . లోనూతిరుగుతున్నాయి ఒకటిరెండుచిరుతపులులో సింహాలో

కూడా వచ్చి ఇళ్ళద్వారాలముందు తొంగిచూస్తున్నాయి. మనుష్యులలో ఒక్కరు మాత్రమే ఇవాళ రాత్రి బయట కన్పిస్తున్నాడు. అతను నదీతీరాన రాతిమీద కత్తికి పదును పెడుతూఉన్నాడు. విచారంగా ఏదోఆలోచిస్తున్నట్లున్నాడు కత్తి బాగా పదునెక్కింది కానీ కత్తితోపాటు తన బావాలకు కూడా పదును పెడుతున్నట్లు అతడు భావించసాగాడు. అందుకనే అతడు ఇంకా పదును పెడుతూనే ఉన్నాడు, రాతి మీద రుద్దుతూ ఉన్నప్పుడు పత్తున్నైన కత్తి 'హిస్‌హిస్' అనే శబ్దంతో రక్తపిపాసను వ్యక్తంచేస్తూ ఉంది ఆ గాఢాంధకారపు రాత్రి అంధకారపు మహానది ప్రవహిస్తున్నట్లుగాకన్పిస్తుంది. ప్రపంచమంతటా ఆ అంధకారపు రాత్రి జాము తరువాత జాము గడిచిపోతూ ఉంది ఆకాశంలో నల్లని మబ్బులు గుంపులు గుంపులుగా వ్యాపించసాగాయి.

చివరికి శుభవృష్టి ప్రారంభమయినప్పుడు జయసింహుడు తన ఆలోచనల నుంచి ఈ లోకంలోకి వచ్చాడు. అతడు కాలుతున్న కత్తిని ఒరలో పెట్టుకొని లేచినిలబడ్డాడు. పూజా సమయం కావచ్చింది. అతనికి తన ప్రతిజ్ఞ సంగతి గుర్తొచ్చింది. ఇప్పుడిక క్షణకాలంకూడా ఆలస్యం చేయకూడదు

ఇవాళ ఆలయం అనేక వేల దీపాలతో ప్రకాశవంతంగా ఉంది. పదమూడు దేవతల మధ్య నిలబడిఉన్న కాళీమాత రక్తపానం చేయుటకు నాలుకచాస్తూ ఉంది. ఆలయంలోని సేవకులందరినీ పంపివేసి రఘుపతి పదునాలుగు దేవతలకు అభిముఖుడై కూర్చున్నాడు. వేల దీపాల కాంతిలో తళతళలాడు

చున్న ఖడ్గము వజ్రమువలె దేవతల ఆజ్ఞకై ఎదురు చూస్తు న్నట్లుగా ఉంది.

అర్ధరాత్రి సమయాన పూజ జరుగుతుంది. సమయం కావచ్చింది. రఘుపతి వ్యాకులతతో జయసింహుని రాకకై నిరీక్షిస్తున్నాడు అకస్మాత్తుగా గాలి తీవ్రంగావీస్తూ కుంభ వృష్టి ప్రారంభమయింది. గాలికి ఆలయంలోని వేలదీపాలు కంపించసాగాయి. దీపశిఖల కదలిక ఆ ఖడ్గము మీాద మెరుపు మెరిసినట్లుగా కన్పించసాగింది పదునాలుగు దేవతల రఘుపతి నీడలు సజీవులై ఆ దీపశిఖల నృత్యముతో తాళము కలిపి దేవతా విగ్రహాలమీాద నాట్యము చేస్తున్నట్లున్నాయి ఒక మానవ శిరస్సు ఆ గాలికి ఎగిరివచ్చి ఆలయానికి కొట్టు కోసాగింది రెండు గబ్బిలములు ఆలయములోనికి ప్రవేశించి ఎండుటాకులవలె అటు నిటు ఎగురుతున్నాయి. వాటి నీడ గోడలమీాద పడుతూ ఉంది.

రెండు జాములు గడిచిపోయాయి. ముందు ఆలయ సమీాపంలోనివి తరువాత దూరదూరాన ఉన్న నక్కలు అరివసాగాయి. తీవ్రంగా వీస్తున్న గాలి కూడా వాటి అరుపు లతో కలిసి హూా హూా అని ఏడుస్తున్నట్లుగా ఉంది. పూజా సమయమయింది రఘుపతి అశుభసూచకమనే భయంతో అత్యంత వ్యాకులంగా ఉన్నాడు.

ఆ దేసమయాన ప్రళయకాలపు తుఫానువలె జయసిం హుడు అంధకారంలోనుంచి అకస్మాత్తుగా ఆలయంలోనికి ప్రవేశించాడు. అతడు శరీరమంతా ఒక దుప్పటితో కప్పు కొని ఉన్నాడు శరీరమంతా వర్షానికి తడిసిపోయింది. శ్వాస

త్వరత్వరగా ఆడుతూ ఉంది నేత్రాల నుంచి నిప్పులు కురుస్తున్నాయి

రఘుపతి అతనిని పట్టుకొని చెవిలో "రాజరక్తం తీసుకు వచ్చావా?" అని అడిగాడు

జయసింహుడు అతని చేతుల్ని విదిలించివేసి "తెచ్చాను, రాజరక్తం తీసుకు వచ్చాను మీరు దూరంగా నిలబడండి, నేనే దేవికి అర్పిస్తాను" అని బిగ్గరగా అన్నాడు. అతని గర్జనకు ఆలయం కంపించింది

"అతడు కాళీవిగ్రహం ఎదుటనిలచి ఇలా అన్నాడు- "అమ్మా, నువ్వు నీ బిడ్డల రక్తాన్నే కోరుతున్నావనేమాట సత్యము. రాజరక్తము లేకుండా నీ దాహం తీరనే తీరదు. పుట్టినప్పటినుంచీ నేను నిన్ను 'అమ్మ' అనే అంటున్నాను. నిన్నే పూజిస్తున్నాను. నేను నా హృదయంలో నీకు తప్ప మరెవ్వరికీ చోటివ్వలేదు నా జీవితానికి నీ పూజతప్ప మరో ఉద్దేశ్యం కూడా లేదు నాదిరాజవంశం, నేను క్షత్రియుడను. మా ముత్తాతగారు మహారాజే నా తల్లివంశంలోనివారు నేటికీ రాజ్యాన్ని పాలిస్తున్నారు. నా రక్తము కూడా నీబిడ్డ రక్తమే- రాజరక్తమే" ఈ మాటలంటూ అతడు కప్పుకున్న దుప్పటి క్రిందికి జారవిడిచాడు అతడు నడుమునఉన్న కత్తి దూశాడు ఆ కత్తి మెరుపు మెరుపు మెరిసినట్లే ఉంది. వెంటనే అతడుఆకత్తినిపూర్తిగాతనగుండెల్లో గుచ్చుకున్నాడు.మృత్యుదేవత యొక్క ఆ పదునైన నాలుక అతని వక్షస్థలములో జొరబడింది. అతడు ఆ విగ్రహపు పాదాలముందు పడి

పోయాడు. కానీ ఆ రాతి విగ్రహం కొంచెమైనా కదలించ లేదు

రఘుపతి బిగ్గరగా అరుస్తూ గబగబవచ్చి జయసింహుని లేవనెత్తుటకు ప్రయత్నించాడు. కానీ అతడు ఆ పని చేయ లేకపోయాడు. అతడు జయసింహుని మృతశరీరంమీద పడి పోయాడు. జయసింహునిరక్తము ఆలయంలోని తెల్లనిగచ్చు మీద ప్రవహించసాగింది దీపాలన్నీ ఒక్కటొక్కటే ఆరి పోయాయి ఆ గాఢాంధకారంలో రాత్రంతా ఎవరిదో శ్వాస ఆడినచప్పుడు మాత్రమే విన్పించింది రాత్రి మూడోజాముకు వర్షము, గాలి ఆగిపోయాయి నలువైపుల నిశ్శబ్దం ఆవరిం చింది నాల్గవ జామున మేఘాలను చీల్చుకొని చంద్రుని కిర ణాలు ఆలయంలోకి ప్రవేశించాయి. జయసింహుని పాలి పోయిన ముఖంమీద వెన్నెలపడసాగింది పదునాల్గుమంది దేవతలు తలవైపున నిలబడే అదే చూడసాగాయి

ప్రాతఃకాలము అడవిలో పక్షుల కలరవం విన్పించి నప్పుడు రఘుపతి మృతశరీరంమీదినుంచి లేచాడు.

## 16

మహారాజుగారిఆదేశాన్ననుసరించిప్రజలలోవ్యాపించిన అసంతృప్తిని గురించి దర్యాప్తు చేయుటకు నక్షత్రరాయలు స్వయంగా బయలుదేరాడు ఆలయంలోనికి వెళ్ళినందువల్ల లాభం ఏముంది అని అతడు ఆలోచించాడు. రఘుపతి ఎదు టకు వెళ్ళినప్పుడు ఎందుకనో అతడు చలించేవాడు ఉచితా నుచిత జ్ఞానం కోల్పోయి తనను తాను నిగ్రహించుకోగలిగే

వాడు కాదు రఘుపతి ఎక్కడకు వెళ్ళటం అతనికి ఎంత మాత్రం ఇష్టంలేదు అందుకనే రఘుపతి కన్పించకుండా రహస్యంగా జయసింహుని గదిలోకి వెళ్ళి అతని ద్వారానే విషయాలన్నీ తెలుసుకోవాలని అతడు నిశ్చయించుకొన్నాడు.

నక్షత్రరాయలు మెల్ల మెల్లగా జయసింహుని గదిలోకి ప్రవేశించాడు గదిలో ప్రవేశిస్తూ తిరిగివచ్చినప్పుడే బ్రతికి బయటపడినట్లు అని అతడు ఆలోచించాడు. గదిలో ప్రవేశించగానే ఎదురుగా జయసింహుని పుస్తకాలు, దుస్తులు, అతని వస్తువులు గదినిండా చిందరవందరగా పడి ఉండటం కన్పించింది వాటిమధ్య రఘుపతి కూర్చొని ఉన్నాడు. కానీ జయసింహుడు అక్కడ లేడు. రఘుపతి నేత్రాలు అగ్నిగోళాలవలె మండుతున్నాయి. అతని జుట్టు ముడి వీడివుంది.

నక్షత్రరాయల్ని చూడగానే రఘుపతి అతని ముంజేతిని గట్టిగా పట్టుకొన్నాడు. నక్షత్రరాయల్ని గట్టిగా గుంజి క్రింద కూర్చోబెట్టాడు. నక్షత్రరాయల ప్రాణాలు పైపైనే ఎగిరిపోయాయి. రఘుపతి నిప్పులుకురిసే తన నేత్రాలతో నక్షత్రరాయల హృదయాన్ని దహించివేస్తూ పిచ్చివానివలె "రక్తంయేది?" అని ప్రశ్నించాడు. నక్షత్రరాయలహృదయం వేగంగా కొట్టుకోసాగింది. అతడేమీ మాట్లాడలేకపోయాడు.

రఘుపతి బిగ్గరగా అరుస్తూ "నీ ప్రతిజ్ఞ ఏమయింది? రక్తంఏది, చెప్పు" అని అడిగాడు

నక్షత్రరాయలు భయపడుతూ కొద్దిగా ప్రక్కకు జరిగి కూర్చున్నాడు. ధోవతి కొంగును పట్టుకొని మెలిపెట్టసాగాడు.

అతని కర్తవ్యం మేల్కొనసాగింది. తడియారిపోవు గొంతుతో "పూజారిగారూ... ...!" అన్నాడు నక్షత్రరాయలు

మరల రఘుపతి ఇలా అన్నాడు- "ఈ సారి మాత్ర తానే ఖడ్గము చేతబట్టినప్పుడు దేశంలో దశదిశల రక్తపు టేరులు ప్రవహిస్తాయి. మీ వంశంలో కూడా ఒక్కచుక్క రక్తం లేకుండా పోతుంది. అప్పుడు నక్షత్రరాయల భ్రాతృ స్నేహం ఏమవుతుందో చూస్తాను."

"భ్రాతృస్నేహమా! హా! హా! పూజారిగారూ...!" నక్షత్రరాయలు ఎక్కువగా నవ్వలేకపోయాడు.

అప్పుడు రఘుపతి ఇలా అన్నాడు — "నాకు గోవింద మాణిక్యుని రక్తము అవసరం లేదు. ఈ పృధ్విలో గోవిందమాణిక్యునికి తనః ప్రాణాలకంటె ఎక్కువ ప్రియమైన వారెవరో వారి రక్తము కావాలినాకు. ఆ వ్యక్తి రక్తాన్ని గోవిందమాణిక్యుని శరీరమంతటా పులిమి వేయాలని కోరుతున్నాను. దానివల్ల వారి వక్షస్థలమంతా రక్తవర్ణమై అది మరే విధంగానూ చెరిగిపోకూడదు. ఇదుగో, ఇటుచూడు, జాగ్రత్తగా చూడు!" అంటూ రఘుపతి తానుకప్పుకొనిఉన్న దుప్పటిని తీసివేశాడు. అతని శరీరమంతా రక్తసిక్తమై ఉంది. అతని వక్షస్థలాన కూడా అక్కడక్కడా రక్తము చిందిఉంది.

నక్షత్రరాయలు కంపించిపోయాడు. అతని కాళ్ళు చేతులు వణుకుతున్నాయి. రఘుపతి భల్లూకమువలె నక్షత్ర రాయల చేతిని గట్టిగా అదిమిపట్టుకొని ఇలా చెప్పసాగాడు- "ఎవరావ్యక్తి- గోవిందమాణిక్యునికి ప్రాణాలకంటె ప్రియ మైన వ్యక్తి ఎవరు? ఎవరు లేకపోతే గోవిందమాణిక్యునికి

ఈ ప్రపంచమంతా స్మశానంవలె కన్పిస్తుంది. వారుఉదయం నిద్రలేవగానే ముందుగా ఎవరిని చూడాలని తహతహ లాడుతారు? రాత్రులందు నిద్రపోయేముందు వారు ఎవరిని తలచుకుంటూవుంటారు? అనుక్షణంవారిహృదయంలోనివసించే వ్యక్తి ఎవరు? ఎవరా వ్యక్తి?" ఈ మాట అంటూ రఘుపతి భయపడిన లేడిపిల్లవైపు ఆక్రమణ చేయటానికి ముందు స్థిర దృష్టితో చూచే సింహంవలె మిరిమిరి చూడసాగాడు

నక్షత్రరాయలు వెంటనే "కాదు నేను కాదు" అని అన్నాడు కాని అతడు ఎంత ప్రయత్నించినప్పటికీ రఘుపతి పట్టును విడిపించుకోలేక పోయాడు

"అయితే, మరెవరో చెప్పు" అని అడిగాడు రఘుపతి.

"ధ్రువుడు" అని చెప్పాడు నక్షత్రరాయలు

"ధ్రువుడు ఎవరు!"

"అతడు ఒక బాలుడు"

అప్పుడు రఘుపతి మళ్ళీ ఇలా అన్నాడు– 'అవును, అతనిని నేనెరుగుదును– పూర్తిగా ఎరుగుదును. మహారాజుకు సంతానంలేదు. అతనినే తన కన్నబిడ్డవలె పెంచుతున్నారు. జనులు తమ కన్నబిడ్డల్ని ఎంత ప్రేమిస్తారో నాకు తెలియదు. కానీ పెంచుకున్న బిడ్డలను మాత్రం తమ ప్రాణాలకంటె అధికంగా ప్రేమిస్తారనే విషయం మాత్రం నాకు బాగుగా తెలుసు. తన రాజ్యము, సంపదలకంటె మహారాజు అతనిని అధికంగా ప్రేమిస్తారు. కిరీటాన్ని తాను ధరించటంకంటె అతని శిరముమీద ఉంచి చూచుకొని ఎంతో ఆనందిస్తారు."

నక్షత్రరాయలు ఆశ్చర్యపడుతూ "నిజమే" అని అన్నాడు

"నిజంకాక మరేమనుకున్నావు? మహారాజు అతనిని ఎంత ప్రేమిస్తారో నాకు తెలియదా, నేను అర్థంచేసుకోలేనా? నేను కోరేది కూడా అతనినే" అని అన్నాడు రఘుపతి

నక్షత్రరాయలు 'అలాగా' అని రఘుపతివైపుచూస్తూ ఉండిపోయాడు. తన మనసులో మాత్రము "అతనినే కోరుతున్నారు" అని అనుకున్నాడు.

"అతనిని తీసుకురావాలి- ఇవాళే తీసుకు రావాలి. ఇవాళ రాత్రికే నేనతనిని కోరుతున్నాను" అన్నాడు రఘుపతి

నక్షత్రరాయలు అతని ప్రతిధ్వని మాదిరిగా "ఇవాళ రాత్రికే నేనతని కోరుతున్నాను" అని అన్నాడు.

రఘుపతి కొద్దిక్షణాలవరకు నక్షత్రరాయల ముఖంలోకి చూస్తూ ఉండి తరువాత నెమ్మదిగా ఇలా అన్నాడు —"ఆ బాలుడే నీకు శత్రువు- ఈ విషయం తెలుసా నీకు? నువ్వు రాజవంశంలో జన్మించావు కులము గోత్రము తెలియని బాలుడెవరో ఎక్కడినుంచో నీ రాజ్యాధికారాన్ని లాక్కోవటానికి ఊడిపడ్డాడు ఈసంగతి తెలియదా నీకు? న్యాయంగా నీకు హక్కుగల రాజసింహాసనం మీద ఆ బాలుని హక్కు స్థిరపడిపోయింది- రెండు కళ్ళు ఉండికూడా ఈ విషయాన్ని గమనించలేవా?"

నక్షత్రరాయలకు ఈ మాటలేమీ కొత్తగాదు. అతడు కూడా ఇంతకు ముందు అదేవిధంగా ఆలోచించాడు. అతడు

సగర్వంగా "పూజారిగారూ, ఈ విషయంలో మీ రింత గా చెప్పాలా? నేను ఇదంతా గమనించటం లేదనుకున్నారా?' అన్నాడు.

"అయితే, ఇక ఆలోచన ఎందుకు? అతనిని తీసుకు వచ్చి నాకు వప్పగించు" అన్నాడు రఘుపతి

"నేను నీ మార్గంలోని ఆటంకాన్ని తొలగిస్తాను" అని కూడా అన్నాడు రఘుపతి.

"రోజంతా నువ్వు ఇక్కడే కూర్చొని ఉంటే మరి అతనిని తీసుకువచ్చే ప్రయత్నం ఎప్పుడు చేస్తావు?" అని మౌనంగా ఉన్న నక్షత్రరాయల్ని ప్రశ్నించాడు.

తరువాత రఘుపతి తన జందెమును పట్టుకొని ఇలా అన్నాడు- "నువ్వు అతనిని తీసుకురాలేకపోయినట్లయితే నీకు బ్రాహ్మణుని శాపం తగులుతుంది. అతనిని తీసుకు వస్తానని ప్రతిజ్ఞ చేసి దానిని నెరవేర్చనట్లయితే మూడురోజులలోపల ప్రతిజ్ఞచేసిన నీ నోటిని కాకులుగద్దలు పొడుచుకు తింటాయి."

ఈ మాటవిని నక్షత్రరాయలు త్రుళ్ళిపడి చేతులతో ముఖాన్ని కప్పుకున్నాడు. కోమలమగు తన శరీరాన్ని గ్రద్దలు పొడుచుకు తింటాయని వూహించటమే అతనికి భయంకరంగా కన్పించింది. రఘుపతికి నమస్కరించి అతడు వెంటనే లేచి వెళ్ళిపోయాడు. ఆ గదిలోనుంచి నక్షత్రరాయలు బయటగాలి వెలుతురుఉన్న జనుల కోలాహలం లోనికి వచ్చినప్పుడు తిరిగి నూత్న జీవితం లభించినట్లనిపించింది.

# 17

ఆదేరోజు సాయంత్రము నక్షత్రరాయల్ని చూచి ధ్రువుడు "పెదనాన్నా అంటూ అతని వద్దకు పరుగెత్తు కుంటూ వచ్చాడు. తరువాత అతని మెడను కౌగిలించుకొని తన చెక్కిళ్ళను అతని నోటి ముందుంచి చాలా నెమ్మదిగా "పెదనాన్నా" అని అన్నాడు.

"ఛీ! ఛీ! అలాంటి మాటలు మాట్లాడకు నేను నీపెద నాన్నను కాదు" అన్నాడు నక్షత్రరాయలు

ఇవాళ్టివరకు ధ్రువుడు నక్షత్రరాయల్ని పెదనాన్నఅనే పిలుస్తూ వచ్చాడు. కానిఇవాళ అకస్మాత్తుగానక్షత్రరాయలు అందుకు అభ్యంతరము చెప్పటము చూచి ధ్రువునికి చాలా ఆశ్చర్యం కలిగింది అతడు కొద్దిక్షణాల వరకు మౌనముద్ర దాల్చి గంభీరంగా కూర్చున్నాడు తరువాత తన విశాల నేత్రాలతో నక్షత్రరాయల ముఖంలోకి చూస్తూ "అయితే నువ్వెవరు?" అని ప్రశ్నించాడు

"నేను మీ పెదనాన్నను కాదు" అని జవాబు చెప్పాడు నక్షత్రరాయలు.

అది విని ధ్రువునికి చాలా నవ్వొచ్చింది. ఇంత అసంభవ విషయాన్ని అతడు ఇంతకు ముందెప్పుడూ విని యుండ లేదు. అతడు నవ్వి ఇలా అన్నాడు– "నువ్వు పెదనాన్న వే!" నక్షత్రరాయలు అనవద్దని ఎంతగట్టిగా చెప్పేవాడో అతడు అంత గట్టిగా 'నువ్వు పెదనాన్న,' 'నువ్వు పెదనాన్న' అని అనసాగాడు అంతేగాక అతడు కిలకిల నవ్వసాగాడు. నక్షత్ర

రాయల్ని 'పెదనాన్న' అని కవ్వించసాగాడు. చివరికి నక్షత్ర రాయలు "ధ్రువా, అక్కడగ్గరకు వస్తావా?" అని అడిగాడు.

ధ్రువుడు వెంటనే నక్షత్రరాయల మెడను వదలి ఎదురుగా నిలబడి "అక్కఎక్కడ ఉంది?" అని ప్రశ్నించాడు.

"అమ్మవద్ద ఉంది "

"అమ్మ ఎక్కడ ఉంది?"

"అమ్మ ఒకచోట ఉంది. నేను నిన్ను అక్కడకితీసుకు వెళతాను."

ధ్రువుడు చప్పట్లు చరుస్తూ "ఎప్పుడు తీసుకు వెళతావు, పెదనాన్నా?" అని అడిగాడు

"ఇప్పుడే" అన్నాడు నక్షత్రరాయలు

ధ్రువుడు ఆనందంతో కేకలు వేయసాగాడు. అతడు గట్టిగా నక్షత్రరాయల మెడను కౌగలించుకున్నాడు. నక్షత్ర రాయలు అతనిని ఎత్తుకొని పైన దుప్పటి ముసుగువేసి రహస్యమార్గంగుండా బయటకు తీసుకు వెళ్ళాడు.

ఇవాళ రాత్రి కూడా బయటకు రావటం నిషేధమే. అందుకనే వీధులలో ఎవరూ రక్షకభటులు కన్పించలేదు. ఆకాశంలో పూర్ణచంద్రుడు ప్రకాశిస్తున్నాడు

ఆలయంలోకి చేరుకొని నక్షత్రరాయలు ధ్రువుణ్ణి రఘుపతికి అందించబోయాడు. రఘుపతిని చూచి ధ్రువుడు నక్షత్రరాయల్ని గట్టిగా కౌగలించుకున్నాడు. ఎంత ప్రయత్నించినా అతనిని వదిలేట్లు కన్పించలేదు. రఘుపతి బలవంతంగా అతనిని నక్షత్రరాయల చేతుల్లోంచి లాక్కున్నాడు. ధ్రువుడు 'పెదనాన్నా!' అంటూ బిగ్గరగా ఏడ్వసాగాడు.

నక్షత్రరాయల నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి. కానీ రఘుపతి ఎదుట తన బలహీనత వ్యక్తం కావటం అతనికి సిగ్గుగా కన్పించింది రఘుపతి శిలావిగ్రహంవలె కన్పించాడు అతనికి ధ్రువుడు 'అక్కా, అక్కా' అంటూ ఏడ్వసాగాడు కానీ ఎంతపిలిచినా అక్కరాలేదు రఘుపతి పిడుగులాంటి కళ్లు గట్టిగా ఒకసారి కసురుకున్నాడు. భయంవల్ల ధ్రువుడు ఏడుప్పు మానేశాడు. వెక్కి వెక్కి లోలోపల ఏడ్వసాగాడు- ఆగి ఆగి ఏడుస్తున్నాడు. పదునాలుగు దేవతా విగ్రహాలు చూస్తూ నిలబడ్డాయి.

అర్ధ రాత్రి సమయాన నిద్రలో ఎవరిదో ఏడ్పువిన్పించి గోవిందమాణిక్యుడు నిద్రమేల్కొన్నారు మహారాజుగారు నిద్రించే గది కిటికీవద్ద క్రిందనిలబడి ఎవరో దీనంగా "మహారాజా! మహారాజా!" అని పిలవటం అకస్మాత్తుగా విన్పించింది.

వెంటనే మహారాజుగారు లేచి పుచ్చపువ్వులాంటి వెన్నెల్లో కిటికీ క్రింద కేదారేశ్వరుడు నిలబడి ఉండటం చూచారు. "ఏంజరిగింది?" అని ప్రశ్నించారు మహారాజు.

"మహారాజా, ధ్రువుడు ఎక్కడ వున్నాడు?" అని అడిగాడు కేదారేశ్వరుడు.

"ధ్రువుడు నీ వద్దలేడా?" అని అడిగారు మహారాజుగారు

"లేడు" అని కేదారేశ్వరుడు ఇలా చెప్పసాగాడు- "సాయంత్రము ధ్రువుడు ఎక్కడా కన్పించక పోయేసరికి నేను మహాలులోని సేవకులందరినీ అడిగాను ధ్రువుడు మహా

లులో యువరాజుగారి గదిలో ఉన్నాడని వారి సేవకుడు చెప్పాడు. కానీ రాత్రి చాలా ప్రొద్దుపోయిన తరువాతకూడా ధ్రువుడు రాకపోయేసరికి నాకు భయం కలిగింది. వెంటనేవెళ్ళి విచారించాను యువరాజు నక్షత్రరాయలు వారుకూడా భవనంలో లేరని తెలిసింది నేను ఈ విషయాలన్నీ తమరితో చెప్పుకోవాలని చాలా ప్రయత్నించాను. కానీ కాపలా భటులు నా మాటలేవీ విన్పించుకోలేదు. అందుకనే చివరికి గత్యంతరం లేక కిటికీ క్రింద నిలబడి మహారాజుగారిని పిలవ వలసి వచ్చింది. తమకు నిద్రాభంగం కలిగించినందుకు నన్ను మన్నించండి."

అకస్మాత్తుగా విద్యుత్ వలె మహారాజుగారి మనస్సులో ఒక ఆలోచన కలిగింది వెంటనే వారు నలుగురు భటుల్ని పిలిచి "మీరు నలుగురూ ఆయుధాలు ధరించి మా వెంటరండి" అని ఆజ్ఞాపించారు.

"మహారాజా, ఇవాళరాత్రి బయటకు వెళ్ళటం నిషేధం" అని అన్నాడు వారిలో ఒకడు.

"నేను ఆజ్ఞాపిస్తున్నాను" అన్నారు మహారాజుగారు

కేదారేశ్వరుడు కూడా వారివెంట బయలుదేరాడు. కానీ మహారాజుగారు అతనిని ఇంటికి వెళ్ళిపొమ్మని ఆదేశించారు. ఆ వెన్నెలరా నిర్జనంగాఉన్న మార్గాన మహారాజుగారు ఆలయంవైపు బయలుదేరారు.

అకస్మాత్తుగా ఆలయంద్వారం తెరుచుకునేసరికి కత్తిని ఎదురుగా ఉంచుకొని రఘుపతి, నక్షత్రరాయలు మద్యాన్ని సేవిస్తున్నారు. లోపల అంతగా వెలుతురులేదు. ఒక దీపం

మాత్రమే వెలుగుతుంది. కానీ ధ్రువుడు ఎక్కడ? ధ్రువుడు కాళీవిగ్రహంపాదాలముందు నిద్రపోతున్నాడు. అతని చెక్కిళ్ళ మీద కన్నీటి చారలు స్పష్టంగా కన్పిస్తున్నాయి అతని పెదవులు కొద్దిగా తెరుచుకొని ఉన్నాయి అతని ముఖంలో భయచిహ్నాలుగానీ, విచారచిహ్నాలుకాని ఏమీలేవు అతడు గట్టినేలమీద కాకుండా తనఅక్కఒడిలో నిద్రపోతున్నట్లు కని పించాడు. అక్క అతనిని ముద్దు పెట్టుకుంటూ కన్నీటిని తుడిచి నట్లుంది.

మద్యము అధికంగా సేవించినందువల్ల నక్షత్రరాయలు నిషాలో ఉన్నాడు. కానీ రఘుపతి మెదలకుండా కూర్చొని పూజాలగ్నం కొరకు నిరీక్షిస్తున్నాడు నక్షత్రరాయలు వాగుడును అతడు విన్పించుకోవటం లేదు నక్షత్రరాయలు నిషాలో ఇలా వాగుతున్నాడు- "పూజారిగారూ, మీకు భయం కలుగుతుందా? మీరు మనస్సులో భయపడు తున్నారు. నాకూ భయంగా ఉంది. కానీ ఏమీ భయంలేదు పూజారిగారూ! ఏమిటి భయం? ఎవరిని చూచి భయం? నేను మిమ్మల్ని కాపాడతాను. నేను మహారాజుకు భయపడు తున్నానని మీరు అనుకొంటున్నారా? నేను షుజా చక్ర వర్తికీ భయపడను, వాడి బాబు షాజహానుకూ భయపడను. పూజారిగారూ, మీరు నాకెందుకు చెప్పలేదు. మహారాజునే పట్టితెచ్చి కాళీమాతను సంతృప్తిపరచేవాడనుగదా! ఈచిన్న బాలునిలో ఎంత రక్తం ఉంటుంది?"

ఇంతలో అకస్మాత్తుగా గోడలమీద నీడలు కన్పిం చాయి. నక్షత్రరాయలు వెనుతిరిగి చూచాడు. మహారాజు

గారు కన్పించారు ఆశ్చర్యంతో అతని నిషా దిగిపోయింది. అతను అక్కడే పాతుకు పోయినట్లు కదలలేకపోయాడు. మహా రాజుగారు పరుగున వెళ్ళి నిద్రపోతున్న ధ్రువుణ్ణి ఎత్తుకొని భటులతో "వీళ్ళిద్దర్నీ బంధించండి" అని ఆజ్ఞాపించారు

నలుగురు భటులు రఘుపతిని, నక్షత్రరాయల్ని బంధించారు ధ్రువుణ్ణి తమ హృదయానికి హత్తుకొంటూ గోవింద మాణిక్య ప్రభువు చంద్రుని స్వచ్ఛమగు వెన్నెలలో నిర్మానుష్యంగా ఉన్న ఆ మార్గాన భవనానికి తిరిగి వచ్చారు. రఘుపతి, నక్షత్రరాయలు రాత్రంతా కారాగృహంలో ఉన్నారు

# 18

ఆ మర్నాడే విచారణ జరిగేరోజు. న్యాయస్థానం జనులతో క్రిక్కిరిసి పోయింది న్యాయాధికారి స్థానంలో మహారాజు గోవింద మాణిక్యులవారే ఆసీనులై వున్నారు. నలు వైపుల సభాసదులు తమతమ స్థానాలలో కూర్చొని ఉన్నారు ఎదురుగా ఇద్దరు ముద్దాయిలు నిలబడి ఉన్నారు వారి చేతులకు సంకెళ్ళు లేవు వారి చుట్టూ ఆయుధాలు ధరించిన సైనికులు నిలబడి ఉన్నారు. రఘుపతి శిలావిగ్రహంవలె నిలబడి ఉన్నాడు. నక్షత్రరాయలు తలవంచుకొని ఉన్నాడు.

రఘుపతి యొక్క అపరాధాన్ని నిరూపిస్తూ మహారాజు గారు "మీరు చెప్పుకోదలిచిందేమైన ఉందా?" అని అడిగారు

"నన్ను విచారించే అధికారం అన్యులెవరికీ లేదు" అని అన్నాడు రఘుపతి.

"అయితే, మిమ్మల్ని ఎవరు విచారిస్తారు?" అని ప్రశ్నించారు మహారాజుగారు.

"నేను బ్రాహ్మణుడను, దైవసేవకుడను. కనుక ఆ దేవతలే నన్ను విచారిస్తారు."

"పాపానికి శిక్షవిధించటానికి పుణ్యానికి బహుమతులివ్వటానికి ఈ ప్రపంచంలో దేవతల అనుచరులు అనేకమంది ఉన్నారు. వారిలో నేను కూడా ఒకడిని. ఆ దృష్టితో నేను మిమ్మల్ని విచారించ దలుచుకోలేను నిన్న సాయంత్రము బలి ఇచ్చే ఉద్దేశ్యముతో మీరు ఒక బాలుణ్ణి అపహరించారా లేదా?"

"అపహరించాను."

"అంటే మీ అపరాధాన్ని అంగీకరిస్తున్నారా?"

"అపరాధమా! అపరాధం ఎలా అవుతుంది? నేను ఆ కాళీమాత ఆజ్ఞను పాలిస్తున్నాను - ఆ మాత కోర్కెను పూర్తిచేస్తున్నాను మీరు దానికి విఘ్నం కలిగించారు. అపరాధం మీరు చేశారు. ఆ మాత ఎదుట మిమ్మల్ని నేను అపరాధిగా నిరూపిస్తున్నాను ఆమెమిమ్మల్నివిచారిస్తుంది."

మహారాజుగారు అతని మాటలకు జవాబు చెప్పకుండా ఇలా అన్నారు- "దేవతల పేరిట బలి ఇవ్వటంగానీ లేదా బలి ఇవ్వటానికి ప్రయత్నించటంగానీ చేయటం నారాజ్యంలో అపరాధమే. అలాంటివారిని దేశంనుంచి బహిష్కరించాలనే నియమం ఉంది. అదేశిక్షను మీకు విధిస్తున్నాను. మీరు

ఎనిమిది సంవత్సరాలు ఈ దేశాన్ని వదలి వెళ్ళాలి. సైని కులు మిమ్మల్ని దేశసరిహద్దులనుంచి బయటకు పంపివస్తారు ''

భటులు అతనిని సభాభవనం నుంచి బయటకు తీసుకు వెళ్ళటానికి ప్రయత్నించారు. అప్పుడు రఘుపతి 'ఆగండి' అని మహారాజువైపు తిరిగి ఇలా అన్నాడు- "ఇక మీ విచారణ జరగాలి. ఇప్పుడు నేను మిమ్మల్ని విచారిస్తాను. పదునాల్గు దేవతల పూజ జరిగే రెండురోజులు రాత్రులందు బయటికి ఎవరూ రాకూడదనే నియమం ఉంది. దానిని వ్యతిరేకించి బయటకు వచ్చినవారిని పూజారివిచారించిశిక్షవిధించవచ్చుననే ఆచారం ఉంది ఆ ప్రాచీన ఆచారాన్ననుసరించి మిమ్మల్ని శిక్షించవచ్చును ''

"మీరు విధించే శిక్షను అనుభవించటానికి నేను సిద్ధంగానే ఉన్నాను" అన్నారు మహారాజు.

"ఈ అపరాధానికిశిక్ష ధనరూపంలో మాత్రమేవిధించవచ్చు" అన్నారు సభాసదులు

"నేను మీకు రెండు లక్షల రూపాయల జరిమానా విధిస్తున్నాను అది ఇప్పుడే చెల్లించాలి" అన్నాడు రఘుపతి.

మహారాజు కొద్దిక్షణాలు ఆలోచించి "తథాస్తు" అన్నారు వారు కోశాధికారిని పిలిపించి రెండు లక్షల రూపాయలు పూజారిగారికి ఇవ్వవలసిందిగా ఆజ్ఞాపించారు భటులు రఘుపతిని బయటకు తీసుకు వెళ్ళారు.

"రఘుపతి వెళ్ళిన తరువాత మహారాజు నక్షత్రరాయల వైపు తీవ్రంగా చూస్తూ "నువ్వు నీ అపరాధాన్ని అంగీకరిస్తున్నావా లేదా?" అని ప్రశ్నించారు.

"మహారాజా, నేను అపరాధినే నన్ను క్షమించండి" అంటూ నక్షత్రరాయలు పరుగున వెళ్ళి గట్టిగా మహారాజుగారి పాదాలు పట్టుకున్నారు.

మహారాజుగారు చలించారు కొద్ది క్షణాలవరకు వారేమీ మాట్లాడలేక పోయారు. చివరి వారు నిగ్రహించుకొని ఇలా అన్నారు- "నక్షత్రరాయా, లేచినిలబడి, నేను చెప్పేది విను. క్షమించటానికి నేనెవరిని నేను కూడా శాసనబద్ధుడనే అపరాధి బంధించబడ్డట్లే న్యాయాధికారి కూడా శాసనానికి బద్ధుడై వుంటాడు ఒకే అపరాధానికి ఒకరిని శిక్షించి మరొకని క్షమించటమా?- అదెలాసాధ్యం? నువ్వే ఆలోచించు"

"మహారాజా, నక్షత్రరాయల వారు తమ సోదరులు తమరు తమ సోదరుని క్షమించండి" అని అన్నారు సభాసదులు.

"మీ రెవ్వరూ మాట్లాడవద్దు స్థానంలో కూర్చున్నంత వరకు నేనెవరికీ సోదరుడనూకాదు, బంధువునూ కాదు. న్యాయాధికారిని" అని మహారాజుగారు గట్టిగా నొక్కి చెప్పారు

సభాసదులందరూ మౌనం వహించారు. సభయావత్తు నిశ్శబ్దంగా ఉంది. మహారాజు గంభీరంగా ఇలా చెప్పారు "దేవతల పేరిట బలి ఇవ్వటంగానీ, బలిఇవ్వటానికి ప్రయత్నంగానీ చేసిన వ్యక్తిని దేశంనుంచి బహిష్కరించాలనే నియమం ఉన్న సంగతి మీ కెల్లరకూ తెలిసినదే నిన్న సాయంత్రం నక్షత్రరాయలు రఘుపతితో కలిసి కుట్రచే

ఒక శాలుణ్ణి అపహరించాను అతడు చేసిన అపరాధం నిరూపించబడింది కనుక ఎనిమిది సంవత్సరాలు దేశంవదలి పోవాలని శిక్ష విధిస్తున్నాను."

సైనికులు నక్షత్రరాయల్ని సభాభవనం నుంచి బయటకు తీసుకువెళ్ళే సమయంలో మహారాజుగారు సింహాసనం నుంచి దిగివచ్చి నక్షత్రరాయల్ని కౌగలించుకున్నారు లోలోపల ఎంతో దుఃఖపడుతూ ఇలా అన్నారు- "తమ్ముడూ, శిక్ష లభించింది నీకే కాదు, నాకు కూడా శిక్ష లభించింది నేను క్రిందటి జన్మలో ఏమి అపరాధం చేశానో ఏమో! బంధుమిత్రులకు దూరంగా శిక్షననుభవించే కాలంలో మన కులదేవత నీకు అండగా ఉండుగాక! నీకు శుభం కలుగుగాక!"

వెంటనే ఈ వార్త కార్చిచ్చువలె వ్యాపించింది. అంతఃపురంలో ఏడుపులు పెడబొబ్బలు ప్రారంభమయ్యాయి. మహారాజుగారు ఒంటరిగా ఒక గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకొని చేతులు జోడించి ఇలా ప్రార్థించారు- "ప్రభూ, నావల్ల ఎప్పుడైనా అపరాధం జరిగితే నన్ను క్షమించవద్దు. ప్రభూ, నా పాపాలకు తప్పక నన్ను శిక్షించు. పాపం చేసినప్పుడు శిక్ష అనుభవించ వచ్చు. కానీ క్షమాభిక్ష అనే భారం దుస్సహం ప్రభూ!"

మహారాజుగారి మనస్సులో నక్షత్రరాయలయందు అమిత ప్రేమ భావం కలిగింది. నక్షత్రరాయల బాల్యస్మృతులు వారి మనస్సులో మెదలసాగాయి. నక్షత్రరాయల చిన్నతనపు ఆటపాటలు, వచ్చీ రానీ ముద్దుమాటలు అతని పనులు ఒక్కొక్కటే మహారాజుగారి మనస్సులో

ఉంచాడు. రఘుపతి తన వద్ద చాలా తక్కువ డబ్బు ఉంచుకున్నాడు

కాలిపోయిన ఇళ్ళు, ప్రజలందరూ పారిపోయి నిర్జనంగా ఉన్న గ్రామాలు, సైనికులు త్రొక్కివేసిన పంట పొలాలు చూస్తూ ఎక్కడా క్షణమైనా విశ్రమించకుండా రఘుపతి ముందుకు సాగిపోతున్నాడు రఘుపతి ఇప్పుడు సాధు వేషంలో ఉన్నాడు. సన్యాసివేషంలో ఉన్నప్పటికీ అతనికి మార్గంలో ఆతిధ్యం దొరకటమే దుర్లభంగా ఉంది మిడుతల దండువలె సైనికులు ముందుపోతూవుంటే, వారు వెళ్ళినంత మేర గ్రామసీమలలో కరువు వ్యాపించింది. సైనికులు తమ తమ గుర్రాలకు, ఏనుగులకు మేత నిమిత్తము పంటకువచ్చిన పొలాలను నిర్దాక్షిణ్యముగా కోసుకుపోయారు. రైతులవద్ద ధాన్యపుగింజ లేకుండా దోచుకున్నారు దోచుకుపోగా మిగిలిన సామానులు నిర్జనంగా ఉన్న గ్రామాలలో ఇంకా అలాగే చెల్లాచెదురుగా పడివున్నాయి.

గ్రామాలలో ఏ కొద్దిమంది జనులోతప్ప అందరూ ఇళ్ళు వాకిళ్ళు వదలి పారిపోయారు ఎక్కడైన ఒకరిద్దరు వ్యక్తులు కన్పించినప్పటికీ వారి ముఖాలలో కళాకాంతులు లేవు. ఆశ్చర్యపడిన లేళ్ళవలె బెదిరిబెదిరి చూచేవారు. వారికిప్పుడు మనిషిమీద నమ్మకమూలేదు, సాటివారిమీద దయాదాక్షిణ్యాలు కూడా లేవు. తామే బ్రతకటము దుర్లభంగా ఉంటే ఇతరులమీద జాలిపడిమాత్రం వారు చేయగలిగిందేముంది?

నిర్జనంగా ఉన్న మార్గంప్రక్క చెట్టుక్రింద నలుగు రైదుగురు మనుష్యులు కర్రలు పట్టుకొని కూర్చునేవారు. వచ్చేపోయే ప్రయాణీకుల్ని దోచుకోవటమే రోజంతా వాళ్ళు చేసే పని సైనికులు దోచుకొనిపోగా మిగిలిన సామాన్లు వీళ్ళు దోచుకొనేవారు. ఒక శవం కోసం నక్కలకు కుక్కలకు కీచులాట జరిగినట్లే సైనికులకు, ఇలాంటి దోపిడీముఠాలకు సంఘర్షణ జరుగుతూ ఉండేది.

నిర్దాక్షిణ్యంగా వ్యవహరించటం సైనికులకు సామాన్యమైన ఆటగా ఉండేది నిస్సహాయుడగు ఒకబాటసారిగుండెల్లో అనవసరంగా కత్తితో పొడిచి చంపటము, లేదా తలగుడ్డతో సహా మరొకని తలను నరికివేయటం ఆ సైనికులకు నవ్వులాటగా ఉండేది గ్రామంలోని ప్రజలు సైనికులపేరు చెపితేనే భయంతో ఎక్కడివారక్కడ పారిపోయేవారు- ఇది తెలిసి సైనికులు చాలా సంతోషించేవారు. గ్రామాన్ని పూర్తిగా దోచుకున్న తరువాత పారిపోకుండా మిగిలిన ప్రజలను రకరకాలుగా హింసించి ఆనందించేవారు. ఒక్కొక్కప్పుడు ఇద్దరు స్త్రీబ్రాహ్మణులను తీసుకువచ్చి వారి రెండు పిలకల్ని కలిపి ముడివేసి ఇద్దరి ముక్కుల్లోనూ నశ్యం కూరేవారు, మరొకప్పుడు రెండు గుర్రాలను తెచ్చి ఒకదానిని తూర్పుముఖంగానూ రెండవ దానిని పడమటి ముఖంగానూ నిలబెట్టి ఒక మనిషిని వాటి వీపుమీద పండుకొనబెట్టేవారు. ఒకేసారి కొరడాతో ఆ రెండు గుర్రాలను అదలించేసరికి అవి అటొకటి ఇటొకటి పరుగెత్తేవి. వాటి మీదఉన్న మనిషి ఎగిరి క్రింద పడేవాడు కాళ్ళుచేతులు విరిగేవి. ఈ విధంగా

ప్రతిరోజు ఒక్కొక్క కొత్త పద్ధతిలో ప్రజలను హింసించే ఆటలు కనుగొంటూ ఉండేవారు ఏమీ కారణం లేకుండా నే గ్రామాలను తగులబెట్టేవారు చక్రవర్తిగారి వార్ధము మందు గుండు కాలుస్తున్నామని అంటూ గ్రామాలకు నిప్పంటించే వారు. దారి పొడుగునా సైనికులు చేసిన దుర్మార్గాలకు అనేక చిహ్నాలు కన్పిస్తాయి. ఇలాంటి పరిస్థితుల్లో రఘుపతిని ఆదరించి ఆతిథ్యం ఎవరిస్తారు? ఒక్కొక్కప్పుడు తినటానికి ఏదైనా దొరికేది, లేదా అలాగే అకలితో ముందుకు సాగి పోయేవాడు ఒకరాత్రి అతడు గ్రామం వెలుపలి పాడుపడి ఉన్న ఒక కుటీరంలో నిద్రపోతున్నాడు ఉదయం నిద్రలేచి చూసేసరికి అతని తలక్రింద ఒక శవంఉంది అంటే రాత్రంతా అతడు దానిమీదే తలపెట్టుకొని నిద్రపోయాడు మరొకనాడు మధ్యాహ్న సమయంలో ఆకలిగా ఉన్నందువల్ల రఘుపతి ఒక ఇంటిలోకి వెళ్ళిచూచాడు ఇంటిలోపల ఒక మనిషి విరిగిపోయిన పెట్టెమీద బోర్లాపడివున్నాడు దోచుకుపోయిన డబ్బును గురించి ఏడుస్తున్నాడేమో అనిపిస్తుంది. రఘుపతి దగ్గరగా వెళ్ళి అతనిమీద చేయివేసి కదిపాడు. ప్రాణాలు ఎప్పుడోపోయిన ఆ వ్యక్తి శవం ప్రక్కకు దొర్లింది

ఒకనాటి రాత్రి రఘుపతి ఒక ఇంటిలో నిద్రపోతు న్నాడు. కంటిమీద కునుకులేదు రాత్రిగడవటమే కష్టంగా ఉంది మరి కాస్సేపట్లో తెల్లవారు తుందనగా ఇంటి తలు పులు తెరుచుకొన్నాయి. శరత్కాలపు వెన్నెల లోపల పడుతూఉంది. ఏవో అనేక ఆకారాలు ఇంటిలోనికివచ్చాయి. గుసగుస శబ్దాలు విన్పించాయి. రఘుపతి త్రుళ్ళిపడి లేచి

కూర్చున్నాడు అతడు లేవటం చూచి అనేక స్త్రీకంఠాలు "అమ్మ బాబోయ్!" అని భయంగా కేక పెట్టాయి. ఒక పురుషుడు రెండడుగులు ముందుకువచ్చి "ఎవరవురా నువ్వు?" అని అడిగాడు.

నేను ఒక బ్రాహ్మణ బాటసారిని, మీా రెవరు?" అని అన్నాడు రఘుపతి.

"మేమీా ఇంటి యజమానులము. మేము మహమ్మదీయ సైనికులకు భయపడి ఇల్లువదలి పారిపోయాము. సైనికులు వెళ్ళిపోయారని తెలుసుకొని తిరిగివచ్చాము."

"సైనికులు ఎటు వెళ్ళారు?"

"విజయగఢంవైపు వెళ్ళారు. ఇప్పటికి విజయగఢపు అడవుల్లోకి చేరుకొని ఉంటారు."

రఘుపతి ఆ మాటవిని వారితో మరేమీా మాట్లాడకుండా వెంటనే అక్కడినుంచి బయలుదేరి వెళ్ళాడు.

# 20

విజయగఢపు విశాలమైన అడవి దోపిడీ ముఠాలకు నిలయం. అడవిలోని మార్గానికి ఇరువైపుల ఎన్ని నర కంకాళాలు పాతి వున్నాయో అంతులేదు. అడవి మొక్కలుతప్ప నరకంకాళాల గుర్తులేమీా కన్పించవు. అడవి మధ్య ఒక పెద్ద మర్రిచెట్టు ఉంది. తుమ్మచెట్లు, వేపచెట్లు ఇంకా అనేకరకాల వృక్షములతో అడవి నిండి వుంది. అక్కడక్కడ చిన్న చిన్న చెరువులు, మడుగుల లాంటివి ఉన్నాయి. చిన్నచిన్న కాలిబాటలు చీకటిగా ఉండే అడవిలో నుంచి పులికలు తిరిగిన

సర్పాలవలె పోతున్నాయి. చెట్లమీద కొమ్మకొమ్మన అనేక కోతులున్నాయి మర్రిచెట్లు నుంచి అనేక ఊడలు, కోతుల తోకలు క్రిందికి వ్రేలాడుతున్నాయి. పడిపోయిన ఆలయపు ఆవరణ తెల్లని పారిజాత పుష్పాలతోనూ, పళ్ళు ఇకిలించే కోతులతోనూ నిండి ఉంది. పెద్దపెద్ద సరివిచెట్లమీద రామ చిలుకలు గుంపులుగుంపులుగా చేరి చేస్తున్న గోలకు అడవిలోని అంధకారము ఛిన్నాభిన్నమై పోతున్నట్లుగా ఉంది.

అలాంటి అడవిలో ఇవాళ ఇంచుమించు ఇరవై వేల మంది సైనికులు ప్రవేశించారు. వృక్షములతోనూ నానా విధ లతలతోనూ నిండిన విశాలమగు అడవి వాడియగు ముక్కులు, గోళ్ళుగల ఇరవై వేల గ్రద్దలు సైనికుల రూపంలో వచ్చి కూర్చున్నట్లుగా ఉంది అసంఖ్యాక సైనిక సమూహాన్ని చూచి కాకులు 'కావ్ కావ్' మంటూ గుంపులుగా ఆకాశంలో ఎగురుతున్నాయి. అవి ఎంతప్రయత్నించినా చెట్లమీద వాలటానికి సాహసించలేకపోతున్నాయి.

ఏవిధమైన అల్లరి చేయవద్దని సైన్యాధిపతి ఆజ్ఞ. పగలంతా నడిచి నడిచి వచ్చి సైనికులు అడవిలోకి చేరుకోగానే ఎండు పుల్లలు ఏరితెచ్చి అన్నం వండుకొంటున్నారు నెమ్మదిగా మాట్లాడుకొంటున్నారు. ఇరవై వేలమంది సైనికుల గుసగుసలతో అడవి ప్రతిధ్వనిస్తూ సాయంత్రపు కీచురాళ్ళధ్వని కూడా విన్పించకుండా పోయింది చెట్లకు కట్టిన గుర్రాలు మధ్య మధ్య గిట్టలతో మట్టిని కుళ్ళగిస్తూ సకిలిస్తూ ఉంటే అడవి త్రుళ్ళిపడుతున్నట్లుంది. పడిపోయిన ఆలయ సమీపాన షుజా చక్రవర్తి డేరా ఉంది. మిగిలిన సైనికులు ఇవాళ

డేరాలు లేకుండా చెట్లక్రిందనే ఉన్నారు. రోజంతా నడిచి రఘుపతి కూడా అడవిలోనికి చేరుకున్నాడు. అప్పటికి చీకటి పడింది అనేకమంది సైనికులు అప్పటికే నిద్రపోతున్నారు. కొద్దిమంది సైనికులు మెదలకుండా కాపలా కాస్తున్నారు. మధ్య అక్కడక్కడా నిప్పుమండుతూ ఉంది అంధకారం ఎంతో కష్టంగా నిద్రముంచుకువస్తున్న తన ఎర్రని నేత్రాలు మూసుకున్నట్లుగా ఉంది ఆ దృశ్యం అడవిలో కాలుపెట్టిన రఘుపతికి ఇరవై వేలమంది సైనికుల ఉచ్ఛ్వాస నిశ్వాసములు విన్పించాయి అడవిలోని అనేకవేల వృక్షాలు తమకొమ్మల్ని చాచి కాపలా కాస్తున్నట్లుగా ఉన్నాయి అప్పుడే జనించిన తన పసికూన మీద రెక్కలు చాచి కూర్చునేగుడ్లగూబవలె నలువైపుల వ్యాపించిన అంధకారం అడవిలోని గాఢాంధ కారం మీద తన నల్లని రెక్కలుచాచి మౌనంగా కూర్చొని ఉన్నట్లుగా ఉంది. అడవిలోపల ఒకరాత్రి తన తలదాచుకొని నిద్రపోతున్నట్లుగానూ మరొక రాత్రి బయట మేల్కొని తల ఎత్తుకొని నిలబడి ఉన్నట్లుగానూ ఉంది. రఘుపతి రాత్రికి అడవిలోనే నిద్రపోయాడు

అతడు ఉదయం నాలుగైదు తన్నులు తగిలి కలవర పడుతూ నిద్రమేల్కొని లేచి కూర్చున్నాడు. ఎదురుగా తల పాగాలు ధరించిన అనేకమంది మహమ్మదీయ సైనికులు ఉర్దూలో ఏదో మాట్లాడుతూ కన్పించారు వారి మాటలను బట్టి తనను వాళ్ళు తిడుతున్నట్లు రఘుపతి గ్రహించాడు. రఘుపతి కూడా బెంగాలీ భాషలో ఒక అపశబ్దం ఉపయో గించాడు. సైనికులు అతనిని పట్టుకొని లాగారు.

"ఇదేమైనా నవ్వులాటా?" అని అన్నాడు రఘుపతి. కానీ వారిలో నవ్వులేదు. ఆటా లేదు, వారు నిజంగానే అతనిని అడవిలోగుండా నిర్దాక్షిణ్యంగా ఈడ్చుకు పోసాగారు.

రఘుపతి చాలా బాధపడుతూ "ఎందుకు ఇలా లాక్కొని పోతారు? కావాలంటే నేను మీ వెంట వస్తాను. ఇంతదూరం నేను వచ్చింది ఎందుకు?" అని అన్నాడు.

సైనికులు నవ్వసాగారు. రఘుపతి బెంగాలీభాషలో తిట్టిన తిట్టును అతడుఅన్న మాదిరిగానే అనసాగారు క్రమంగా అతని చుట్టూ మరి కొంతమంది సైనికులుచేరి రకరకాలుగా గోల చేయసాగారు. అందరూ తలకొక విధంగా అతనిని బాధించసాగారు. ఒక సైనికుడు ఒక ఉడతను తోకపట్టుకొని తెచ్చి రఘుపతి నున్నని తలమీద వదలాడు. ఆ ఉడుత అతని తలను ఏదో పండుగా భావించి తింటుందో లేదో చూడాలని ఆ సైనికుని ఉద్దేశ్యం. మరొక సైనికుడు ఒక లావుపాటి బెత్తమును వంచి అతని ముక్కుకు ఎదురుగా ఉంచి వెంట నడుస్తున్నాడు ఆ బెత్తపు దెబ్బతగిలితే రఘుపతి ముఖంలో ఉన్న ముక్కుయొక్క గొప్పతనం కాస్తా క్షణంలో ఎగిరి పోగలదు సైనికుల నవ్వులతో అడవి ప్రతిధ్వనించసాగింది. ఇవాళ మధ్యాహ్నం యుద్ధం జరుగనున్నది, కనుక ఉదయం వారికి రఘుపతి వినోదవస్తువుగా కన్పించాడు. అతనితో రకరకాలుగా కాలక్షేపం చేసిన తరువాత సైనికులు అతనిని షుజా డేరాలోకి తీసుకు వెళ్ళారు.

షుజాను చూచి రఘుపతి నమస్కరించలేదు. బ్రాహ్మణులు దైవానికి, బ్రాహ్మణులకు తప్ప మరెవ్వరికీ తలవంచరు.

అతడు షుజా ఎదుట నిలబడి చేయెత్తి "చక్రవర్తికి జయం కలుగుగాక!" అని అన్నాడు

షుజా సభాసదులతో కలిసి మద్యము సేవిస్తూ కూర్చు న్నాడు. అతడు మత్తుతో తూలుతూ "ఏమిటో, చెప్పు" అన్నాడు తడబడు మాటలతో.

"ప్రభూ, ఇతడు శత్రుపక్షమువారి గూఢచారి. మన సైన్యపు సంగతులు తెలుసుకొని వెళ్ళుటకు వచ్చాడు అందు కని తమ ఎదుటకుతీసుకువచ్చాం" అని ఒక సైనికుడు షుజాకు నమస్కరించి చెప్పాడు

"మంచిది, మంచిది పాపం, చూడటానికి వచ్చాడు అతనికి అన్నీ వివరంగా చూపించి వదలివేయండి. తన దేశా నికి వెళ్ళి ఇవన్నీ వర్ణించి చెప్తాడు" అని అన్నాడు షుజా.

రఘుపతి వచ్చీరాని హిందీలో "నేను ఏలినవారివద్ద ఉద్యోగం చేయటానికి వచ్చాను" అని అన్నాడు రఘుపతి.

షుజా మత్తుగా చేతులు వూపుతూ వెంటనే వెళ్ళి పొమ్మని సైగ చేశాడు. "వెచ్చగా ఉంది" అని అనగానే సేవకుడు విసనకర్రతో త్వరత్వరగా విసరసాగాడు.

షుజా ఆక్రమణను ఎదిరించుటకు దారా తన కుమా రుడు సులేమానును జయసింహుని వెంట పంపాడు. వారి సైన్యముకూడా దగ్గరకు వచ్చింది. ఈ వార్త అంతకుముందే షుజాకు తెలిసింది అందుకని షుజా విజయగఢ కోటను పట్టు కొనుటకు తన సైన్యాన్ని అక్కడే కేంద్రీకరించి ఉంచాడు కోటను కోటలోని ఖజానాను షుజాకు అప్పగించ వలసిందని చెప్పటానికి విజయగఢ మహారాజు విక్రమ సింహుని వద్దకు

ఒక దూతను పంపాడు విక్రమసింహుడు ఆ దూతతో "ఢిల్లీ చక్రవర్తి షాజహానును, పరమేశ్వరుడినితప్ప నేనెవరిని ఎరుగను. ఈ షుజా ఎవరో నాకు తెలియదు" అని చెప్పి పంపాడు.

షుజా ఆ మాటలు విని "ఇంత అహంకారమా, యుద్ధము చేయక తప్పదు. పెద్దయుద్ధమే జరుగుతుంది" అని అన్నాడు

రఘుపతి ఈ మాటలన్నీ విన్నాడు. అతడు సైనికుల దృష్టినుంచితప్పించుకొని విజయగఢమువైపు బయలుదేరాడు.

# 21

విజయగఢం పర్వతముమీద ఉంది. విజయగఢపు అడవి కోటచుట్టుపట్లనే అంతమవుతుంది. అడవిలోనుంచిబయటకు రాగానే రఘుపతికి ఎదురుగా కొండమీద ఉన్న కోట ఆకాశాన్నంటుతూ కన్పించింది. అరణ్యము అనేక వేలవృక్షాల మధ్య దాగి ఉన్నట్లే కోటకూడా పెద్దపెద్ద రాళ్ళమధ్య దాగి వుంది. అడవి మెలకువగా ఉంటే కోటకూడా మెలకువగానే ఉంటుంది అరణ్యము వ్యాఘ్రమువలె వెనుక కాళ్ళమీద కూర్చొని మీసాలు మెలిపెడితే కోట కూడా సింహమువలె జూలు విదలించి మెడవంచి చూస్తూ కూర్చుంటుంది. అడవి భూమిమీద చెవియొగ్గి ఏదో వింటూఉన్నట్లుంటే కోట ఆకాశంలోకి తలెత్తి ఏదో చూస్తున్నట్లుంటుంది.

రఘుపతి అడవిలోనుంచి బయటకురాగానే కోటగోడల మీద ఉన్న సైనికులు మెలకువగా ఉన్నారు. కోటగోడమీది

సైనికుడు కొమ్ముబూర ఊదేసరికి కోట అప్రమత్తమైంది. ఎలాంటి అవాంతరం ఎదురైనా ఎదిరించటానికి సిద్ధంగా లేచినిలబడినట్లుంది. రఘుపతి తన జందెమును చూపిస్తూ చేతితో సైగలు చేయసాగాడు. సైనికులు సిద్ధంగా నిలబడి ఉన్నారు. రఘుపతి కోటకు మరింత దగ్గరగా చేరుకున్నాడు. అప్పుడు సైనికులు అతని నుద్దేశించి "ఎవరు నువ్వు?" అని అడిగారు

"నేను బ్రాహ్మణబాటసారిని" అని జవాబు చెప్పాడు రఘుపతి.

మహారాజు విక్రమసింహుడు అత్యంతధర్మనిష్ఠాపరుడు. అతడు బ్రాహ్మణులను, అతిథులను గౌరవించి ఆదరించేవాడు. జందెము ఉండగా కోటలో ప్రవేశించటానికి మరొక అర్హత ఏదీ అవసరంలేదు. కానీ ఇది యుద్ధసమయం కావటంవల్ల ఏమిచేయాలో సైనికులు నిశ్చయించుకోలేకపోయారు.

"మీరు ఆశ్రయం ఇవ్వనట్లయితే నేను మహమ్మదీయుల చేతుల్లో మరణించాల్సివస్తుంది" అని రఘుపతి వారితో అన్నాడు

విక్రమసింహ మహారాజుకు ఈ విషయం తెలియగానే బ్రాహ్మణునికి కోటలోపల ఆశ్రయం ఇవ్వవలసిందిగా ఆజ్ఞాపించాడు. గోడపైనుంచి ఒక త్రాటినిచ్చెన క్రిందికివచ్చింది. దాని ద్వారా రఘుపతి కోటలోనికి చేరుకొన్నాడు.

కోటలోపల అందరూ యుద్ధప్రయత్నాలలో మునిగి ఉన్నారు. వృద్ధ చాచా (పినతండ్రి) గారు రఘుపతి ఆతిథ్య సత్కార బాధ్యతను వహించారు. అతని అసలు పేరు ఖడ్గసింహుడు, కానీ కొందరు అతనిని బాబాయిగారూ అంటారు

మరికొందరు రాష్ట్రాధిపతిగారూ అని అంటారు ఏదిఏమైనప్పటికీ ప్రజలు అతనిని అలా పిలవటానికి ఏమీ కారణం కన్పించదు. ఈ ప్రపంచంలో అతనికి అన్నలుగానీ, అన్నకుమారులుగానీ ఎవరూ లేరు. కనుక బాబాయి అని పిలవబడేహక్కు ఇప్పుడు కాదుగదా ఇకముందు కలుగదనే చెప్పవచ్చును పోతే, అతనిని రాష్ట్రాధిపతి అని పిలవడంకూడా అలాంటిదే. కానీ నేటివరకు అతనిని అలా పిలవటానికి ఎవరూ సందేహించలేదు.

బాబాయిగారు అక్కడికివచ్చి "భేష్! భేష్! బ్రాహ్మణులంటే ఇలా ఉండాలి!" అని రఘుపతికి భక్తిపూర్వకంగా నమస్కరించాడు రఘుపతి ఆకారము తేజోవంతమగు జ్యోతివలె ఉంటుంది. అది చూచి దీపకాంతికి ఆకర్షింపబడే పురుగులవలె ప్రజలు అతనివైపు ఆకర్షింపబడేవారు.

బాబాయిగారు ప్రస్తుత ప్రపంచపు శోచనీయ స్థితికి ఎంతో బాధపడుతూ "మహాశయా! పూర్వకాలంలోని బ్రాహ్మణులవంటివారు ఇవాళ ఎంతమంది ఉన్నారంటారు?" అని అన్నాడు.

"చాలా తక్కువ ఉంటారు" అని జవాబు చెప్పాడు రఘుపతి

"పూర్వం బ్రాహ్మణుల ముఖంలో అగ్నిఉండేది ఇప్పుడా అగ్ని యీావత్తూ వారి పొట్టలలోనికి చేరుకొంది" అని బ్రాహ్మణులు ఈనాడు తిండిపోతులనే ధ్వనిని వ్యక్తంచేశాడు బాబాయిగారు

"అది కూడా పూర్వం మాదిరిగా ఈనాడు లేదు" అని అన్నాడు రఘుపతి.

శాబాయిగారు తలవంచి "నిజమే అగస్త్యమహాముని ఆచమనం చేసినట్లు ఆహారాన్ని కూడా భుజించివుంటే ఎలా ఉండేదో! ఒకసారి ఆ విషయం ఆలోచించి చూడండి" అని అన్నాడు.

"దానికి ఇంకా ఇతర నిదర్శనాలు చాలా ఉన్నాయి"

"అవునవును, ఉన్నాయనుకోండి. జహ్నుమునిపిపాసను గురించి ఒకకథ ఉందిగదా! వారి ఆకలినిగురించిన కథఎక్కడా లభించలేదు కానీ వూహించుకోవచ్చును. కరకాయలు తిన్నంత మాత్రాన తక్కువగా తింటారని అనుకోలేము. వారు రోజూ ఎన్ని కరకాయలు తింటున్నారు తెలిస్తేగదా అది వూహించుకోటానికి"

రఘుపతి బ్రాహ్మణుల గొప్పతనాన్ని స్మరించుకొని గంభీరంగా "కాదు మహాశయా, భోజనాదులయందు వారికి అంత ఆసక్తి ఉండేది కాదు" అని అన్నాడు

శాబాయిగారు పళ్ళతో నాలుక నొక్కుకుంటూ "రామరామ, ఎంత మాటన్నారు! వారి జఠరాగ్ని ఎంత ప్రబలంగా ఉండేదో గొప్పగొప్ప నిదర్శనాలున్నాయి. మీకు తెలియవా? కాలచక్రంలోపడి సమస్త అగ్ని ఆరిపోయింది. చివరికి యజ్ఞముల అగ్నికూడా ప్రజ్వరిల్లటం లేదు కానీ..." అని అన్నాడు.

రఘుపతి ఖేదపడుతూ ఇలా అన్నాడు– "హోమాగ్ని ఇప్పుడెలా ప్రజ్వరిల్లగలుగుతుంది? దేశంలో నెయ్యి అనేది ఎక్కడుంది? పరదేశీయులు గోవులన్నింటినీ చంపివేస్తున్నారు, ద్రవ్యం ఎలావస్తుంది? హోమాగ్ని ప్రజ్వరిల్లనప్పుడు బ్రహ్మ

తేజం ఎంతకాలం నిలుస్తుంది?" ఈ మాట అని రఘుపతి తన లోని ప్రచ్ఛన్న దహనశక్తిని చక్కగావూహించుకోసాగాడు.

"తమరు యదార్థం చెప్పారు. గోవులు మరణించి ఈ కాలంలో మానవ గర్భాన జన్మిస్తున్నాయి. ఇప్పుడు గోవులవల్ల నేయి లభిస్తుందనే ఆశకూడా లేదు ఎక్కడ చూచినా తెలివితేటలునాస్తి. తమరాక ఎక్కడి నుండి మహాశయా!" అని ప్రశ్నించాడు బాబాయిగారు

"త్రిపుర మహారాజుగారి కొలువునుంచి" అని రఘుపతి జవాబు చెప్పాడు.

విజయగఢమునకు వెలుపల వున్న భారతదేశ భూగోళము ను గురించిగానీ దాని చరిత్రను గురించిగానీ బాబాయిగారికి ఏమీ తెలియదనే చెప్పవచ్చును. విజయగఢము తప్ప భారతదేశములో తెలుసుకోదగినవి మరేవైనా ఉన్నవనే విషయం అతడు అంగీకరించలేడు రఘుపతి మాట వినగానే అతడు ఏదో వూహించుకొంటూ "త్రిపుర మహారాజు చాలా గొప్పవాడా?" అని అడిగాడు.

రఘుపతి ఆ విషయాన్ని పూర్తిగా సమర్థించి చెప్పాడు.

"తమరు అక్కడ ఏంచేస్తూ ఉంటారు?"

"నేను త్రిపుర రాజపురోహితుణ్ణి"

బాబాయిగారు కన్నులు మూసుకొని తలవూపుతూ "ఓహో!" అని అన్నాడు రఘుపతియందు అతనికి భక్తి భావం మరింత బలపడింది.

"మహాశయా, తమరు వచ్చిన పని ఏమిటి!"

"తీర్థయాత్రలకు బయలుదేరి ఇటువచ్చాను."

పెద్దచప్పుడు వినిపించింది. శత్రువులు కోటను ముట్టడించారు. బాబాయి నవ్వుతూ కళ్ళుమూసుకొని "అదేమీ లేదు. రాళ్ళు దొర్లిస్తున్నారు" అని అన్నాడు విజయగఢపు కోట కట్టడంకంటె దానిని గురించి బాబాయిలో ఉన్న నమ్మకం చాలా దృఢమైనది. బయటి వారెవరైనా కోటలోనికి వస్తే చాలు బాబాయి అతనిని అంటిపెట్టుకొని ఉండి విజయగఢపు గొప్పతనాన్ని గురించి అనేక విధాల వర్ణించి చెపుతాడు. రఘుపతి త్రిపుర రాజ్యం నుంచి వచ్చాడు ఇలాంటి అతిథి ఈ చరాచర జగత్తులో మళ్ళీ లభించడు అందుకని బాబాయికి ఇవాళ చాలా సంతోషంగాఉంది. అతడు ఆ బ్రాహ్మణ అతిథితో విజయగఢపు ప్రాచీన చరిత్రను గురించి చర్చిస్తున్నాడు

'ఈ బ్రహ్మాండము, విజయగఢపు కోట ఒకేసారి సృష్టించబడి ఉంటాయి. మనువు తరువాత నుంచీ ఈ కోట విక్రమసింహమహారాజుగారి పూర్వీకుల అధీనంలో ఉంటూ వచ్చింది. ఈ విషయంలో ఎలాంటి అనుమానానికి తావు లేదు" అని చెపుతూ ఈ కోట విషయంలో శివుని వరము ఏమిటో,దీనిలో కార్తికేయుడు, వీరఅర్జునుడుఏవిధంగాబంధించబడ్డారో బాబాయి విపులంగా చెప్పాడు.

శత్రువులు కోటకు ఏమీ హాని కలిగించలేక పోయారని సాయంత్రానికి వార్త అందింది. శత్రువులు పేల్చిన ఫిరంగిగుళ్ళు కోటవరకు రాలేకపోయాయి బాబాయి విజయగర్వంతో నవ్వుతూ రఘుపతివంక చూచాడు. కోటకు ఆ పర

మేశ్వరుడు ఇచ్చిన వరము అమోఘమైనది. అందుకు ఇంత కంటె వేరే నిదర్శనం ఏమికావాలి అని అతని అభిప్రాయం. మహానంది స్వయంగావచ్చి శత్రువులు పేల్చిన ఫిరంగిగుళ్ళను మధ్యలోనేఆపి వాటిని కైలాసానికితీసుకువెళితే కార్తికేయుడు, గణపతి వాటితో బంతి ఆడినట్లు ఆడుకుంటూఉంటారు.

## 22

షుజా చక్రవర్తిని ఏదోవిధంగా తన వశం చేసుకోవటమే రఘుపతి ఉద్దేశ్యము షుజా కోటమీద దండెత్తి వచ్చాడని విన్నప్పుడు మిత్రభావంతో తాను ముందు కోటలోకి ప్రవేశించి కోటను ఆక్రమించుకొనుటకు షుజాకు ఏదో విధంగా సహాయపడాలని రఘుపతి ఆలోచించాడు కానీ బ్రాహ్మణులకు యుద్ధములను గురించి ఏమీ తెలియదుకనుక షుజాకు తాను ఏ విధంగా సహాయపడగలనా అని ఆలోచించ సాగాడు.

మర్నాడు మళ్ళీ యుద్ధం ప్రారంభమయింది. శత్రువులు మందుగుండుతో కోటగోడలో కొద్దిభాగాన్ని ధ్వంసం చేయగలిగారు కానీ ఎంత ఫిరంగి గుళ్ళవర్షం కురిపించినా మహమ్మదీయ సైనికులెవ్వరూ కోటలోనికి వెళ్ళలేకపోయారు. చూస్తూ ఉండగానే పడిపోయిన కోటగోడ మళ్ళీ మామూలుగా తయారయింది ఇవాళ అప్పుడప్పుడు ఫిరంగిగుళ్ళు కోటలోపలికి కూడా వచ్చిపడుతున్నాయి కోటలోని సైనికులు కూడా ఇద్దరిద్దరు, ముగ్గురు ముగ్గురు చనిపోతున్నారు. గాయపడుతున్నారు.

"బ్రాహ్మణ మహాశయా, భయపడాల్సిన పనేమీ లేదు. ఇదంతా ఒక తమాషా" అని బాబాయి రఘుపతిని వెంటబెట్టుకొని కోటలోపల నలువైపుల తిరగసాగాడు. ఆయుధాగారము, ఆహారపదార్థములు మొదలగునవి నిలవ చేయు గిడ్డంగులు, గాయపడిన సైనికులకు చికిత్స చేయు చోటును, కారాగృహాన్ని, మహారాజుగారి సభాభవనమును, ఒక్కటొక్కటే చూపిస్తూ మధ్యమధ్య రఘుపతి ముఖంలోకి చూడసాగాడు

"చాలా విశాలమైన కోట! అద్భుతంగా ఉంది. దీని ముందు త్రిపుర కోట ఏపాటిది? కానీ రహస్యంగా పారిపోవ టానికి త్రిపురకోటలో చాలా విచిత్రమైన సొరంగమార్గం ఉంది అలాంటిది ఇక్కడ వున్నట్లులేదే!" అని అన్నాడు రఘుపతి

బాబాయి ఏదో చెప్పాలనుకుంటూనే తటాలున తనను తాను నిగ్రహించుకొని "లేదు, ఈ కోటలో అలాంటిదేమీ లేదు" అని అన్నాడు.

రఘుపతి చాలా ఆశ్చర్యపడుతూ "ఇంత పెద్దకోటలో ఒక్క సొరంగమార్గం కూడా లేదా? విచిత్రంగా ఉంది" అని అన్నాడు.

బాబాయి కొంచెం మెత్తబడి "లేదు, లేకుండా ఎలా వుంటుంది? కానీ మాకు తెలియదు" అని అన్నాడు.

రఘుపతి నవ్వి "అలాంటప్పుడు ఉండి కూడా లేని దానితో సమానమే. మీకే తెలియనప్పుడు మరొకరికిమాత్రం ఎలా తెలుస్తుంది?" అని అన్నాడు.

బాబాయి అత్యంత గంభీరంగా కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాడు. తరువాత 'రామరామ' అంటూ ఆవులించి చిటిక వేస్తూ గడ్డము మీసాలు ఒకసారి తృప్తిగా సవరించుకొని ఇలా అన్నాడు- "మహాశయా, పూజలు వగైరాలతో కాలక్షేపం చేయు మీ వంటి వారితో చెప్పటం వల్ల దోషమేమీ ఉండదు కోటలోనుంచి బయటకు వెళ్ళటానికి ఒక రహస్య మార్గము, బయటినుంచి లోనికిరావటానికి ఒక మార్గము ఉన్నాయి. కానీ ఇతరులకు వాటిని చూపించ గూడదని రాజాజ్ఞ."

రఘుపతి ఇంకా ఏదో సందేహిస్తున్నట్లుగా "ఉంటే ఉండవచ్చును" అని అన్నాడు.

తన పొరపాటువల్ల ఒకసారి 'కాదు' అని మరొకసారి 'అవును' అని చెప్పటంవల్ల ఎదుట మనిషికి సందేహం కలగటం సహజమేనని బాబాయి అర్థంచేసుకొన్నాడు. మరొక రాజ్యానికి చెందిన మనిషికి దృష్టికి విజయగఢ కోటలో లోపం ఉన్నట్లు కన్పించటం అతనికెంతమాత్రం ఇష్టంలేదు.

"మహాశయా, త్రిపుర ఇక్కడికి చాలా దూరం ఉంటుందని నా ఉద్దేశ్యం. తమరు బ్రాహ్మణులు. దైవపూజ తమ నిత్యకార్యక్రమం. కనుక ఈ విషయం తమ వల్ల ఇతరులకు తెలుస్తుందనే భయం కూడా లేదు."

"అంత అవసర మేముంది? మీకు అంత సందేహంగా ఉంటే అలాంటి విషయాలు నాతో చెప్పకండి. నేను బ్రాహ్మణుడను, కోటలోని విషయాలు ఏవి ఎలాఉంటే నాకెందుకు?"

"రామరామ! తమను సందేహించటమా? వెడదాం పదండి, మీ కొకసారి చూపిస్తాను!"

అటు అకస్మాత్తుగా కోట వెలుపల షుజా సైన్యంలో పెద్ద అలజడి ప్రారంభమయింది. సైనికులు పారిపోసాగారు. షుజా డేరా అడవి మధ్య ఉంది. సులేమాను, జయసింహుల సైన్యంవచ్చి షుజాను బంధించింది. అకస్మాత్తుగా వెనుక నుంచి కోటమీాద దండెత్తిన షుజా సైన్యంమీాద విరుచుకు పడ్డారు షుజా సైన్యం యుద్ధమంటే విరక్తిజెంది ఇరవైఫిరం గుల్ని అక్కడేవదలి ప్రాణాలు దక్కించుకొని పారిపోయింది.

కోటలోపల చాలా హడావుడిగా ఉంది. దూతవచ్చి విక్రమసింహమహారాజుకు సులేమాను రాకను తెలియజేయ గానే కోటద్వారం తెరుచుకొంది. మహారాజుగారు స్వయంగా ఎదురేగి సులేమానును, జయసింహ మహారాజును, మర్యాదగా ఆహ్వానించి లోనికి తీసుకువెళ్ళారు. ఢిల్లీ చక్రవర్తిగారి సైనికులతోనూ, ఏనుగులు, గుర్రములతోనూ విజయగఢ కోట నిండిపోయింది. జండా రెపరెప ఎగురసాగింది. రణభేరి శంఖనాదము విన్పించాయి. బాబాయి నెరిసిన మీసాలక్రింది పెదవులమీాద విజయగర్వం తొణికిసలాడింది.

# 23

ఆ రోజు నిజంగా బాబాయికి ఎంతోసంతోషకరమైన దినము. ఇవాళ ఢిల్లీ చక్రవర్తిగారి రాజపుత్ర సైనికులు విజయగఢ మహారాజుగారి అతిథులు, మహాపరాక్రమవంతు డగు షుజా కోటలోని కారాగృహంలో బందీగా ఉన్నారు.

కార్తికేయుడు, వీర అర్జునిని బంధించిన విషయం గాబాయి నిట్టూరుస్తూ రాజపుత్రుడు సుచేత సింహునితో ఇలా అన్నాడు- "ఒకసారి ఆలోచించి చూడు! అనేక వేలమంది చేతులకు బేడీలు వేయాలంటే చాలా ఏర్పాట్లు చేయాలి. ఈకలియుగంలో ఏదిచేయాలన్నా సమయం చాలా తక్కువ ఈ కాలంలో మహారాజుల కుమారుడైనా, చక్రవర్తికుమారుడైనా అందరికీ రెండుచేతులేకదా, వాటిని బంధించటంలో ఏమంత ఆనందం ఉంటుంది?"

సుచేతసింహుడు నవ్వుతూ "ఈ రెండుచేతులే చాలు" అని అన్నాడు తన చేతుల్ని చూచుకొంటూ.

"అదినిజమే. ఆ కాలంలో పని చాలా ఎక్కువగా ఉండేది. ఈ కాలంలో పని చాలా తక్కువ ఈ చేతులుచేసే పనుల్ని వివరంగా చెప్పనేలేము. మరికొన్ని చేతులుంటే వాటితో మీసాలనైనా సవరించుకోవచ్చుగదా!" అని అన్నాడు బాబాయి.

ఇవాళ బాబాయి వేషంలో ఎలాంటి లోపమూ జరుగలేదు. గడ్డాన్ని రెండుపాయలుగాజేసి రెండు చెవుల మీదకు వేసుకొన్నాడు. మీసాలను బాగా మెలిపెట్టి నిలబెట్టాడు. అందమైన తలపాగా, నడుముకు అందంగా ఉన్న కత్తి వేలాడుతూ ఉంది. జరీచెప్పుల ముందుభాగం సింహాకారంలో వెనక్కి మెలితిరిగి వుంది. విజయగఢపు గొప్పతనం యావత్తు అతనిలో మూర్తీభవించినట్లు ఎంతో ఠీవిగా నడుస్తున్నాడు. విజయగఢపు గొప్పతనం నేడు మరొకసారి రుజువైందన్న ఆనందంతో అతడు ఇవాళ ఆకలినీ, నిద్రనూ మర్చిపోయాడు.

అతడు ఇవాళ రోజంతా సుచేతసింహుడిని వెంటబెట్టు కొని కోటలో తిరుగుతూనే ఉన్నాడు. సుచేత సింహుడికి ఎక్కడైనా ఒకవిషయం ఆశ్చర్యంకలిగించనప్పుడు బాబాయి తాను కల్పించుకొని 'భేష్, అద్భుతం' అంటూ ఆ వీరరాజ పుత్రుని హృదయంలో ఉత్సాహం కల్గించాలని ప్రయత్నించే వాడు ముఖ్యంగా కోట ప్రహరీ నిర్మాణాన్ని గురించి ఎక్కువగా చెప్పవలసి వచ్చింది విజయగడపు కోటగోడలవలెనే సుచేతసింహుని మనస్సుకూడా చలించనిదే అతని ముఖంలో ఎలాంటి భావమూ కన్పించటం లేదు. బాబాయి అతనిని కోటలో అటూ ఇటూ క్రిందికీ మీదకూ త్రిప్పుతూ "ఆహా, ఎంత అందంగా ఉంది!" అని ఎన్నోసార్లు అన్నాడు. చివరికి సాయంత్రమయ్యేసరికి సుచేతసింహుడు అలసిపోయి "నేను భరతపురం కోటను చూచాను. దానిని చూచిన తరువాత నా కంటికి మరేదీ నచ్చటం లేదు" అని అన్నాడు

బాబాయి ఎవరితోనూ ఎప్పుడూ వాదించడు. అతడు చాలా నొచ్చుకుంటూ "కావచ్చు, అంతేకావచ్చు!" అని అన్నాడు

అతడు ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చి కోటను గురించి చర్చించటం ఆపివేశాడు. ఈసారి అతడు విక్రమసింహుని పూర్వీకులను గురించి చెప్పనారంభించాడు– "విక్రమసింహుని పూర్వీకుడు దుర్గాసింహుడు. వారికి ముగ్గురు కుమారులు. వారిలో చిన్నవాడు చిత్రసింహుడు. వారికి ఒక విచిత్రమైన అలవాటు ఉండేది వారు ప్రతిరోజు ఉదయం అర్ధశేరు శనగల్ని పాలతో ఉడికించి తినేవారు వారి శరీరంకూడాఅలాగే

వుండేది. అది సరేగానీ మీరింతకుముందు భరతపురం కోటను గురించి చెప్పారుగదూ, అది చాలా విశాలమైన కోట కావచ్చును. కానీ బ్రహ్మవైవర్త పురాణంలో దానిని గురించి ఎక్కడా చెప్పనే లేదు."

సుచేత సింహుడు నవ్వి "అంతమాత్రాన వచ్చిన నష్టమేమీ లేదుగదా!" అని అన్నాడు.

బాబాయి లేనినవ్వు తెచ్చుకొని "ఆహా!హా! నిజమే, నిజమే! మరేమనుకున్నావ్! త్రిపురకోటకూడా తక్కువదేమీ కాదు, కానీ విజయగథ ... ..."

"సుచేతసింహుడు మధ్యలో అడ్డొస్తూ త్రిపుర ఎక్కడ, అదీ రాజ్యమేనా?" అని అడిగాడు

"అది చాలా గొప్పరాజ్యము. దానిని గురించి ఇన్ని మాట లెందుకు? ఆ రాజ్యపు రాజపురోహితుడు మనకు అతిథిగా ఈ కోటలోనే ఉన్నారు. వారి ద్వారా విషయాలన్నీ స్వయంగా తెలుసుకోవచ్చును"

కానీ బ్రాహ్మణుడు ఇవాళ వెతికినా ఎక్కడా కన్పించలేదు. బాబాయి ఆ బ్రాహ్మణుని కోసం తపించసాగాడు. అతడు తన మనస్సులో "ఈ పల్లెటూరి రాజపుత్రులకంటె ఆ బ్రాహ్మణుడు ఎంతో మంచివాడు!" అని అనుకున్నాడు. అతడు రఘుపతిని గురించి సుచేతసింహునితో చాలా ప్రశంశించి విజయగథమును గురించి ఆ బ్రాహ్మణుని అభిప్రాయాలేమిటో కూడా చెప్పాడు.

# 24

బాబాయిగారి నుంచి తప్పించుకోటానికి సుచేత సింహుడు ఎక్కువ శ్రమపడాల్సిన అవసరం లేకపోయింది. రేపు ఉదయం షుజాను బంధించి చక్రవర్తి సైన్యం ఇక్కడినుంచి బయలుదేరాలని నిశ్చయించారు వారివెంట వెళ్ళటానికి ఇక్కడి సైనికుల్ని కూడా కొంతమందిని నియమించారు. కారాగృహంలో షుజాచక్రవర్తి చాలా అసంతృప్తిచెంది తనలో తాను ఇలా అనుకున్నాడు- "వీళ్ళందరూ మర్యాద మన్నన తెలియనివాళ్ళు డేరాలో నుంచి నా హుక్కా తీసుకు రావాలనే ఆలోచన కూడా వీళ్ళకు లేకపోయింది"

విజయగఢ పర్వతము దిగువభాగాన ఒక పెద్ద గొయ్యి ఉంది. ఆ గోతి ఒడ్డున ఒకచోట పిడుగుపడి కాలిపోయిన రావి చెట్టు ఉంది. ఆ రావిమోడు సమీపాన చాటున నక్కి రఘుపతి ఆ చీకట్లో అదృశ్యమై పోయాడు.

రహస్యంగా కోటలోనికి ప్రవేశించే సొరంగమార్గము ఈ గోతిలోపలనుంచే ఉంది. ఈ మార్గంగుండా సొరంగ ద్వారం వద్దకు వెళ్ళి క్రిందినుంచి గట్టిగా త్రోసినట్లయితే ఒక రాతి పలక పైకిలేస్తుంది. పైనుంచి దానిని కదిలించటం అసాధ్యము. కనుక కోటలోపల నివసించేవారు ఈ మార్గం గుండా బయటకు రాలేరు.

కారాగృహంలో షుజా మంచం మీద నిద్రిస్తూ ఉన్నాడు. ఆ మంచంతప్ప గదిలో రెండోపక్క ఏదీలేదు. ఒక దీపం వెలుగుతూ ఉంది. అకస్మాత్తుగా గదిలో ఒక రంధ్రం

ఏర్పడింది. నెమ్మదిగా రఘుపతి క్రిందనుంచి పైకి వచ్చాడు. అతని శరీరమంతా పూర్తిగా తడిసిపోయింది. అతని దుస్తుల నుంచి నీరు ధారగా కారుతూ ఉంది అతడు నెమ్మదిగా షుజాను తాకాడు.

షుజా త్రుళ్ళిపడిలేచి అలాగే చూస్తూ కూర్చుండి పోయాడు. తరువాత ఆశ్చర్యపడుతూ "ఏమిటీఆగడం? నన్ను రాత్రి కూడా నిద్రపోనివ్వరా యేమిటి? నీ ప్రవర్తన చూస్తూ ఉంటే నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది."

రఘుపతి నెమ్మదిగా "దయచేసి రాకుమారులు లేవండి. నేను ఆ బ్రాహ్మణుడనే. నన్ను గుర్తుచేసుకోండి ఇకముందు కూడా నన్ను మర్చిపోకండి" అని అన్నాడు.

మర్నాడు చక్రవర్తిగారి సైన్యము ఢిల్లీకి ప్రయాణ మయింది. షుజాను నిద్రమేల్కొల్పుటకు జయసింహ మహా రాజు స్వయంగా కారాగృహానికి వెళ్ళారు. షుజా ఇంకా నిద్రలేవలేదనే వారు అనుకున్నారు వారు మంచం వద్దకు వెళ్ళి మీద చేయి వేశారు కానీ మంచం మీద షుజా లేడు అతని దుస్తులు మాత్రం మంచం మీద పడివున్నాయి. గది నేలమీద ఒక సొరంగమార్గం కన్పించింది. దానిమీదఉన్న రాతి పలక తెరిచి ఉంది.

ఖైదీ పారిపోయాడనే వార్త కోటలో అందరికీ తెలి సింది. నలువైపుల వెతుకుటకు సైనికులు వెళ్ళారు. మహా రాజు విక్రమసింహునికి చాలా తలవంపులుగా ఉంది. ఖైదీ ఎలా పారిపోయాడో చర్చించటానికి ఒకసమావేశం జరిపారు.

మహాసంతోష పడుతున్న బాబాయిగారి గర్వం ఇప్పు డేమయింది? అతడు పిచ్చివానివలె "బ్రాహ్మణుడు ఎక్కడున్నాడు?" అంటూ నలువైపుల రఘుపతికోసం వెతక సాగాడు. కానీ బ్రాహ్మణుడు ఎక్కడా కన్పించ లేదు. బాబాయి తలపాగా తీసి కొద్ది క్షణాలవరకు తలపట్టుకొని అలాగే కూర్చుండి పోయాడు. సుచేతసింహుడు కూడా అతని వద్దకు వచ్చి కూర్చొని "బాబాయిగారూ, ఎంత ఆశ్చర్యం జరిగింది? ఇదంతా భూతాలపనే అంటారా?" అని అన్నాడు.

బాబాయి చాల ఖేదపడుతూ తలవంచుకొని ఇలా అన్నాడు- "కాదు, ఇది భూతాలపని కాదు. సుచేతా, ఇది ఒక వృద్ధుడు చేసినకాండ. ఒకవిశ్వాసఘాతకుడు, ఒక దురాత్ముని పని"

సుచేతసింహుడు ఆశ్చర్యపడుతూ "అతడెవరో మీకు తెలిస్తే వెంటనే మహారాజుగారితో చెప్పిఎందుకుబంధించరు?" అని అన్నాడు

"ఇద్దరిలో ఒక వ్యక్తి పారిపోయాడు. మరొకనిని బంధించటానికి మహారాజుగారి ఎదుటకు తీసుకు వెళుతు న్నాను" అని చెప్పి తలపాగా ధరించి లేచివెళ్ళాడు.

బాబాయి వెళ్ళినప్పటికి కాపలాసైనికులు తమ సంజా యిషీ చెప్పుకొంటున్నారు. బాబాయి తలవంచుకొని సభ లోకి ప్రవేశించి నడుముకుఉన్న కత్తిని తీసి మహారాజుగారి పాదాలముందు ఉంచాడు "నేనే అపరాధిని నన్ను బంధిం చండి మహారాజా" అని అన్నాడు సవినయంగా.

మహారాజుగారు ఆశ్చర్యపడుతూ "బాబాయిగారూ, ఏంజరిగింది?" అని అడిగారు.

"ఆ బ్రాహ్మణుడే. ఇదంతా ఆ బెంగాలీ బ్రాహ్మణుడు చేసినపనే" అని అన్నాడు బాబాయి

"మీ రెవరు?" అని అడిగారు జయసింహ మహారాజు.

"నేను విజయగఢకోటలో వృద్ధబాబాయిని" అని జవాబు చెప్పాడు బాబాయి.

"మీరు ఏమిచేశారు?" అని తిరిగి జయసింహ మహారాజుగారు ప్రశ్నించారు.

"నేను విజయగఢపు రహస్యమార్గాన్ని గురించి చెప్పి ద్రోహం చేశాను నేను చాలా తెలివితక్కువగా ఆ బెంగాలీ బ్రాహ్మణునిని విశ్వసించి అతనికి సొరంగమార్గం చెప్పాను" అని చెప్పాడు బాబాయి.

విక్రమసింహ మహారాజు అకస్మాత్తుగా ఆగ్రహావేశపరులై "ఖడ్గసింహా!" అని అరిచారు.

బాబాయి త్రుళ్ళిపడ్డాడు. తన పేరే ఖడ్గసింహుడని కూడా ఇంచుమించు అతడు మరచిపోయాడు.

"ఖడ్గసింహా! ఇంతకాలానికి నువ్వు మరల చిన్నవాడవైపోయావా?" అని అన్నారు మహారాజుగారు.

బాబాయి తలవంచుకొని నిలబడ్డాడు.

"బాబాయిగారూ! ఈ పని మీరు చేశారు! ఇవాళ మీ మూలాన విజయగఢానికి ఎంత అపకీర్తి వచ్చిందో తెలుసుకున్నారా?" అన్నారు మహారాజుగారు మరల.

బాబాయి మెదలకుండా అలాగే నిలబడ్డాడు. అతని చేతులు కంపిస్తున్నాయి వణుకుతున్న చేతులతో తలబాదు కొంటూ "దురదృష్టం!" అనుకున్నాడు మనస్సులో.

విక్రమసింహమహారాజుగారు మరల అతనిని ఉద్దేశించి "మనకోటలో నుంచి ఢిల్లీ చక్రవర్తిగారి ఖైదీ తప్పించుకొని పోయాడు. ఢిల్లీ చక్రవర్తిగారి ఎదుట నన్ను అపరాధిగా చేసింది నువ్వే, ఆలోచించావా?" అని అన్నారు

"అపరాధమంతా నాదే తమవల్ల అపరాధం జరిగిం దని ఢిల్లీ చక్రవర్తిగారు ఏనాడూ అనుకోరు" అని అన్నాడు బాబాయి.

విక్రమసింహ మహారాజుగారు విరక్తిభావంతో "నువ్వెవరు? నీ గురించి ఢిల్లీ చక్రవర్తిగారికి ఏం తెలుసు? నువ్వు మా కొలువులో ఉన్నావు అంటే మేమే స్వయంగా ఖైదీని మా చేతులారా వదలివేసినట్లే అవుతుంది" అని అన్నారు

బాబాయి అందుకేమీ జవాబు చెప్పలేకపోయాడు. అతడు దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు.

"అయితే ఇప్పుడు నీకేమి శిక్ష విధించమంటావు?" అని అడిగారు విక్రమసింహ మహారాజుగారు.

"మహారాజుగారి ఇష్టం!"

"నువ్వు వృద్ధుడవు నీకు ఏ కఠిన శిక్ష విధించాలి? దేశంనుంచి బహిష్కరించే శిక్షచాలును నీకు "

బాబాయి మహారాజుగారి పాదాలు గట్టిగా పట్టుకొని విలపించసాగాడు- "మహారాజా, విజయగఢం నుంచి నన్ను

బహిష్కరిస్తారా! వద్దు, మహారాజా, నేను వృద్ధుడను, నా మతిపోయింది. నన్ను విజయగఢంలోనే మరణించ నివ్వండి. నాకు మరణదండన విధించండి! ఈ ముసలితనంలో నన్ను కుక్కలకు నక్కలకు తరిమివేసినట్లు విజయగఢంనుంచి దూరం చేయవద్దు ”

జయసింహ మహారాజు కల్పించుకొని “మహారాజా, తమరు ఇతని అపరాధాన్ని మన్నించి వదలి వేయాలని నా కోర్కె చక్రవర్తిగారితో జరిగిన విషయాలన్నీ నేను వివరంగా చెపుతాను” అని అన్నాడు

బాబాయి అపరాధాన్ని క్షమించి వదలివేశారు. సభా భవనం నుంచి బయటికి వెళుతూ వెళుతూ అతడు కంపిస్తూ పడిపోయాడు. ఆ నాటి నుంచి అతడు బయట ఎక్కడా కన్పించటం లేదు. అతని వెన్నుపూస విరిగిందేమో అన్నట్లు ఇంటి నుంచి బయటకే రావటం లేదు.

## 25

బ్రహ్మపుత్రానది తీరాన గూజరపాడా అను ఒకచిన్న గ్రామముంది. పీతాంబరరాయ్ ఈ గ్రామానికి జమీందారు గ్రామ జనాభా చాలా తక్కువ. పీతాంబరరాయ్ తమ పాత చండీమండపంలో కూర్చొని తాను మహారాజునని చెప్పుకొనే వాడు. ప్రజలుకూడా అతనిని మహారాజనే అనేవారు. అతని రాజరికపు మహత్తు మామిడి వృక్షములు మొదలగు వాటితో విరాజిల్లు ఆ చిన్నగ్రామంలోనే చలామణీ అవుతూ ఉండేది అతని కీర్తి చంద్రికలు ఆ గ్రామపు పొదరిండ్లలోనే ప్రతి

ధ్వనిస్తూ ఆ హద్దులలోపలే అణగిపోతూ ఉంటాయి ప్రపం చంలోని గొప్పగొప్ప చక్రవర్తుల ప్రచండ ప్రతాపాలేవీ ఈ చల్లని గూటిమీద ప్రసరించేవికావు తీర్థస్నానానికి వచ్చి నప్పుడు ఉపయోగించే నిమిత్తము త్రిపుర మహారాజ వంశీ కులు ఇక్కడ ఒక భవనం కట్టించారు. కానీ చాలా కాలం నుంచి రాజవంశంలోని వారెవ్వరూ ఇక్కడ స్నానం చేయ టానికి రాలేదు. అందువల్ల త్రిపుర మహారాజును గురించి గ్రామప్రజలలో ఒక అస్పష్టమైన వదంతిమాత్రం వ్యాప్తిలో ఉంది.

భాద్రపదమాసంలో ఒకనాడు త్రిపురనుంచి ఒక రాజ కుమారుడు నదీతీరాన ఉన్న భవనంలో నివసించటానికి వస్తు న్నాడనే వార్త వ్యాపించింది కొద్దిరోజుల అనంతరం పెద్ద పెద్ద తలపాగాలు ధరించిన మనుష్యులు వచ్చి భవనంలో చాలా హడావుడి చేశారు ఇది జరిగిన ఒక వారం రోజులలో ఏనుగులు, గుర్రాలు సైనికులతో సహా నక్షత్రరాయలు గూజరపాడా గ్రామానికి చేరుకున్నాడు. వారి ఆడంబరాన్ని గ్రామ ప్రజలు ఎంతో ఆశ్చర్యపడుతూ చూడసాగారు. గ్రామప్రజలు ఇంతవరకు పీతాంబరరాయ్‌నే మహారాజుగా భావించారు కానీ ఇవాళ వారికి అలాంటి అభిప్రాయంలేదు. నక్షత్రరాయ్‌ను చూచిన తరువాత "మహారాజు అంటే ఇలా ఉంటారు" అని అందరూ చెప్పుకోసాగారు

ఈ విధంగా పీతాంబరరాయ్ అకస్మాత్తుగా ప్రజల మనసులలో నుంచి చండీమండపంతో సహా అదృశ్యమై పోయాడు. కానీ పీతాంబరరాయ్‌కు ఇది చాలా ఆనందమే

కలిగించింది నక్షత్రరాయ్‌ను మహారాజుగా భావించి అతడు తన రాజరికపు మహత్తునంతా వారి పాదాలముందు అర్పించు కొని చాలా సుఖాన్ని పొందుతున్నట్లే భావించాడు ఎప్పుడైనా నక్షత్రరాయలు ఏనుగుమీద నెక్కి బయటకు బయలుదేరి నప్పుడు పీతాంబరరాయ్ తన ప్రజలతో "మీరు మహారాజుగారిని చూచారా? చూడండి, వారే మహారాజు గారు!" అని చెప్పేవాడు

చేపలు, కూరగాయలు మొదలగు కానుకలు తీసుకొని పీతాంబరరాయ్ ప్రతిరోజూ నక్షత్రరాయలును చూడటానికి వెళుతూ ఉండేవాడు. యువకుడగు నక్షత్రరాయల అంద మైన ముఖాన్ని చూచి పీతాంబరరాయ్‌కు అతనిమీద ఎంతో ప్రేమ కలిగేది ఈ విధంగా నక్షత్రరాయలే ఆ గ్రామానికి మహారాజయ్యాడు, పీతాంబరరాయ్ ప్రజలలో ఒకడై పోయాడు

ప్రతిరోజు మూడువేళల నౌబత్తు మ్రోగుతూ ఉండేది గ్రామపు వీధులలో ఏనుగులు, గుర్రాలు తిరుగసాగాయి మహారాజుగారి భవనద్వారంలో విచ్చుకత్తులు తళతళలాడ సాగాయి. గ్రామంలో క్రొత్త దుకాణాలు వెలిశాయి. పీతాం బరరాయ్, గ్రామంలోని ప్రజలు చాలా సంతోషించారు నక్షత్రరాయలు దేశంనుంచి బహిష్కరించబడి ఈ క్రొత్త ప్రదేశానికి రాజైనతరువాత తన దుఃఖాలన్నీ మర్చిపోయాడు ఇక్కడ అతడు సర్వస్వతంత్రుడు. తన రాజధానిలో అతని ప్రతాపం ఇంత గొప్పగా ఉండేదికాదు. ఇక్కడ రఘుపతినీడ కూడా పడదు. తన ఈ మానసిక సుఖంవల్ల నక్షత్రరాయలు

విలాస జీవితంలో మునిగిపోయాడు. ఢాకానగరం నుంచి నాట్యక త్తెలను పిలిపించాడు. నృత్యగానాలంటే అతనికిచాలా ఇష్టం ఎప్పుడూ విసుగు అనేదే ఉండేది కాదు.

నక్షత్రరాయలు త్రిపుర రాజ్యపు విషయాలన్నీ అనుసరించాడు సేవకులలో ఒకరిని మంత్రిగా నియమించాడు, ఇంకొకరిని సైన్యాధిపతిగానియమించాడు పీతాంబరరాయ్‌ను మహామంత్రి అని పిలవసాగారు. నియమానుసారంగా రోజూ రాజదర్బారు జరుగుతూ ఉండేది.

ఒకరోజున నకుడు వచ్చి మాధుర్ తనను 'కుక్క' అని అన్నాడని ఫిర్యాదు చేశాడు. దానిని గురించి పద్ధతి ప్రకారము విచారణ జరిగింది. అనేక నిదర్శనములు చూపించి మాధుర్ దోషియని నిర్ణయించారు. నక్షత్రరాయలు న్యాయాధికారి హోదాలో అత్యంత గంభీరంగా నకుడు మాధుర్ చెవిని రెండుసార్లు మెలిపెట్టాలని ఆజ్ఞాపించారు.

ఈ విధంగా సుఖశాంతులతో కాలం గడిచిపోతూ వుంది ఒక్కొక్క రోజున ఏమీపని లేనప్పుడు ఏదో ఒక కొత్త వేడుక కోసము అతడు మహామంత్రిని పిలిపించేవాడు. మహామంత్రి వెంటనే బయలుదేరి వచ్చి సభాసదుల్ని సమావేశపర్చి చాలా హడావుడిగా కొత్త వినోద కార్యక్రమాన్ని ప్రదర్శిస్తూ ఉండేవాడు అప్పుడు దానిని గురించి వాళ్ళందరూ ఎంతో గంభీరంగా చర్చించేవారు. ఒకనాడు సైన్యసమేతంగా పీతాంబరరాయ్ చండీమండపముమీాద దండెత్తివెళ్ళి అతని చెరువులోని చేపల్ని, తోటలోని కొబ్బరికాయల్ని, పల్లకీలో ఉన్న కూరగాయల్ని దోచుకొని చాలా ఆడంబ

రంగా భవనానికి తిరిగి వచ్చారు ఇలాంటి ఆటలవల్ల నక్షత్ర రాయలతో పీతాంబరరాయ్ స్నేహసంబంధం మరింత దృఢ పడింది

ఇవాళ రాజభవనంలో పిల్లిపిల్లలకు వివాహం జరుగుతుంది. నక్షత్రరాయలవద్ద ఒక పిల్లి ఉంది. మహాలులోని మొగపిల్లితో దానికి వివాహం జరుగనున్నది ఈ వివాహాన్ని జరిపించటానికి చూడామణిని నియమించారు. అందుకు అతనికి మూడువందల రూపాయలు, ఒక శాలువాలభించాయి. పెళ్ళి కుమార్తెను చేయు ఆచారం పూర్తయింది. ఇవాళ సాయంత్రం నిర్ణయించిన శుభలగ్నానికి వివాహం జరుగుతుంది ఇందువల్ల రాజభవనంలో చాలా రోజుల్నుంచీ అందరికీ చేతినిండా పనితగిలింది.

సాయంత్రత సమయానికి రేవును వీధుల్ని దీపాలతో రణాలతో అలంకరించారు నౌబత్తు విన్పిస్తూ ఉంది మండప భవనంనుంచి పెళ్ళికుమారుడు విలువైన దుస్తులు ధరించి పల్లకీలో మ్యావ్ మ్యావ్ మంటూ బయలుదేరాడు. మరొక చిన్న బాలుడు తోడుపెళ్ళికొడుకువలె పెళ్ళికుమారుని మెడలోని త్రాడును పట్టుకొని వెంటనడుస్తున్నాడు. మంగళ వాయిద్యాలతో పెళ్ళికుమారుడు వివాహ మండపానికి చేరుకున్నాడు

పురోహితుని పేరు కేనారాయ్. నక్షత్రరాయలు మాత్రం అతనిని రఘుపతి అనే పేరుతో పిలుస్తాడు. అసలు రఘుపతినిచూస్తే నక్షత్రరాయలుకు చాలా భయం. అందువల్ల ఇతనిని రఘుపతి పేరుతో పిలుస్తూ చాలా ఆనందించే

వాడు. అంతేగాక ప్రతిచిన్న విషయంలోను అతనిని రకరకా లుగా బాధించేవాడు. దురదృష్టవశాత్తు ఇవాళ కేనారాయ్ సభకు హాజరు కాలేదు. అతని కుమారునికి చాలా జబ్బుగా ఉంద.

నక్షత్రరాయలు ఆలస్యానికి విసుక్కొంటూ "రఘు పతి ఏడీ?" అని ప్రశ్నించాడు.

"వారి కుమారునికి చాలా జబ్బుగా ఉంది" అని సేవ కుడు జవాబు చెప్పాడు

నక్షత్రరాయలు రెండోసారి బిగ్గరగా అరుస్తూ "వెంటనే అతనిని పిలుచుకొని రండి" అని అన్నాడు

సేవకులు పిలవటానికి వెళ్ళారు. అదే సమయంలో ఏడు స్తున్న పిల్లిపిల్లల ఎదుట నృత్యగానాలు ప్రారంభించ బడ్డాయి.

సన్నాయి వాయించండి" అని నక్షత్రరాయలు ఆజ్ఞాపించాడు.

సన్నాయి ప్రారంభమయింది.

కొద్దిసేపట్లో ఒక సేవకుడువచ్చి "మహారాజా, రఘుపతి గారు వచ్చారు" అని విన్నవించాడు.

"వెంటనే ప్రవేశపెట్టు" అని నక్షత్రరాయలు చాలా కోపంగా చెప్పాడు.

అదేక్షణంలో పురోహితుడు అక్కడికి వచ్చాడు. అతనిని చూడగానే నక్షత్రరాయల కోపం విచిత్రంగా మాయ మయింది. నక్షత్రరాయల భావమే మారిపోయింది. అతని ముఖం వెలవెలపోసాగింది. ముఖంనిండా ముచ్చెమటలు

పట్టాయి. సన్నాయి, సారంగి, మృదంగ వాయిద్యాలన్నీ అకస్మాత్తుగా ఆగిపోయాయి ప్రశాంతంగా ఉన్న ఆ భవనంలో పిల్లిపిల్లల 'మ్యావ్ మ్యావ్' అనే ధ్వనులు తప్ప మరేమీ విన్పించటం లేదు.

ఇతడు నిజంగా 'రఘుపతి' పూజారే! ఇందులో ఏ మాత్రం సందేహం లేదు. కాంతివంతమగు అతని విశాల నేత్రాలు లోపలికి పీక్కుపోయాయి. ఆ కళ్ళు చాలా కాలం నుంచి ఆకలిగొని ఉన్న కుక్క నేత్రాలవలె మండుతున్నాయి. అతడు లోనికి వచ్చి దుమ్ముకొట్టుకొని ఉన్న కాళ్ళను పట్టు పరుపుమీద ఉంచి ఠీవిగా నిలబడి "నక్షత్రరాయా!" అని అన్నాడు.

నక్షత్రరాయలు ఏమీ మాట్లాడలేదు.

తిరిగి రఘుపతే ఇలా అన్నాడు- "నువ్వు రఘుపతి కోసం కబురు పంపావు నేను వచ్చేశాను."

నక్షత్రరాయలు అస్పష్టంగా "పూజారిగారూ!" అని గొణిగాడు

"లేచి ఇలా రా!" అన్నాడు రఘుపతి

నక్షత్రరాయలు నెమ్మదిగా లేచి అక్కడికి వెళ్ళాడు. పిల్లిపిల్ల వివాహం ఆగిపోయింది.

## 26

"ఇప్పుడీ జరుగుతున్నదంతా ఏమిటి?" అని అడిగాడు రఘుపతి.

నక్షత్రరాయలు తలగోక్కుంటూ "నృత్యం జరుగుతూ ఉంది" అని చెప్పాడు.

'ఛీ! ఛీ!'' అని రఘుపతి అసహ్యించుకున్నాడు.

నక్షత్రరాయలు అపరాధివలె మౌనంగా నిలబడ్డాడు.

"నే నిప్పుడు ఎక్కడికి రావాలి?" అని అడిగాడు నక్షత్రరాయలు

"అదంతా తరువాత చెపుతాను- ముందు నా వెంట బయటకు వెళదాం రా!"

"నా కిక్కడ చాలా ఆనందంగా గడచిపోతుంది."

"ఆనందంగా గడచిపోతుందా? నువ్వు జన్మించింది రాజవంశంలో, నీ పూర్వీకులందరూ రాజ్యాన్ని పాలించారు. అలాంటి వంశంలో జన్మించిన నువ్వు ఈ అరణ్య ప్రదేశంలో నక్కలకు రాజుగా పడివుండి పైగా నాకు చాలా ఆనందంగా గడిచిపోతుందని అంటున్నావా?"

రఘుపతి తీవ్రపదజాలంతోనూ, తీక్షణమగు చూపుల తోనూ నక్షత్రరాయలకు ఇక్కడ ఆనందంగా లేదని నిరూ పించాడు నక్షత్రరాయలు కూడా రఘుపతి ముఖంలోని తీవ్రతకు లొంగిపోయి అతని మాదిరిగానే ఆలోచించసాగాడు.

"ఏమి ఆనందం? ఏదో ఇలా బ్రతుకుతున్నాను. అంత కంటే చేయగలిగింద్దిమాత్రం ఏముంది? మరో ఉపాయమేదీ లేదు" అని అన్నాడు నక్షత్రరాయలు.

"ఉపాయాలకేం తక్కువ కావలసినన్ని ఉపాయా లున్నాయి. నేను నీకు ఉపాయం చెపుతాను. నువ్వు నావెంట రా" అన్నాడు రఘుపతి.

"ఒకసారి మంత్రిగారిని అడగనా?"

"వద్దు."

"మా తాలూకు ఈ సామానులన్నీ ఎలా?"

"ఇప్పుడవేమీవద్దు."

"మరి నాతోఉన్న సేవకులు... ...?"

"ఏమీ వద్దు."

"ఇప్పుడు నా వద్ద డబ్బుకూడా ఎక్కువలేదు."

"నా వద్ద కావలసినంత డబ్బు ఉంది తప్పించుకో టానికి ప్రయత్నించకు. ఇవాల్టికి వెళ్ళి నిద్రపో. రేపు వుద యమే బయలుదేరి వెళ్ళాలి" అని చెప్పి రఘుపతి అతని జవా బుకుకూడా ఎదురుచూడకుండా వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం నక్షత్రరాయలు నిద్రమేల్కొనే సమయానికి వందిమాగధులు చక్కని రాగాలతో మధుర మైన పాటలుపాడసాగారు. నక్షత్రరాయలు గదిలోనుంచి ఇవ తలికివచ్చి కిటికీలోనుంచి తొంగిచూశాడు. తూర్పుదిక్కున సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఇరువైపుల దట్టమగు వృక్ష ములతోనూ, లతలతోనూ విలసిల్లుతూ చిన్నచిన్న ప్రసుప్త గ్రామ సమూహాల ముందునుంచి బ్రహ్మపుత్రానది అగాధ జలంతో వేగంగా ప్రవహిస్తూ వుంది. కిటికీలోనుంచి చూస్తే నదీతీరాన ఉన్న ఒక చిన్నకుటీరము కన్పిస్తుంది. ఒక బాలిక ఇంటి ముంగిట ఊడుస్తూ ఉంది. ఒక పురుషుడు ఆ బాలికతో ఒకటి రెండు మాటలు మాట్లాడి తలపాగా చుట్టుకొని ఒక పెద్ద కర్రకు చిన్నమూట తగిలించుకొని ఎక్కడికో వెళ్ళటా నికి బయటకు వచ్చాడు. కోకిల మొదలగు పక్షులు కూస్తు న్నాయి. ఒక పెద్దపనస చెట్టు ఆకులలో దాగిఉన్న కోకిల పాటపాడుతూ ఉంది. కిటికీవద్ద నిలబడి బయటకు చూస్తున్న

నక్షత్రరాయల హృదయంలోనుంచి దీర్ఘమైన నిట్టూర్పు వెలు వడింది. ఆ దేసమయాన వెనుకగా రఘుపతి ప్రవేశించి నక్షత్ర రాయల భుజంమీద చేయివేశాడు. అతడు త్రుళ్ళిపడ్డాడు. రఘుపతి మధుర గంభీరస్వరంతో "ప్రయాణానికి అన్నీ సిద్ధంగా ఉన్నవా?" అని అడిగాడు.

నక్షత్రరాయలు అతనికి నమస్కరించి జాలిగొలుపు నట్లుగా "పూజారీగారూ! నన్ను మన్నించి వదలివేయండి! నాకు ఎక్కడికీ రావాలని లేదు. నాకు ఇక్కడ సంతోషం గానే ఉంది" అని వేడుకొన్నాడు

రఘుపతి అందుకు ఒక్కమాటకూడా మాట్లాడకుండా నిప్పులు కురిపించేట్లు అతని ముఖంలోకి తీవ్రంగా చూడ సాగాడు. నక్షత్రరాయలు అతని చూపుల్ని తట్టుకోలేక తల వంచుకొని "ఎక్కడికి వెళ్ళాలి?" అని అడిగాడు.

"ఆ విషయం ఇప్పుడే చెప్పటానికి వీల్లేదు "

"అన్నగారికి విరుద్ధంగా నేనేమీ కుట్రచేయలేను."

రఘుపతి కోపంతో మండిపడుతూ "మీ అన్నగారు నీకు చేసిన ఉపకారం ఏమిటో చెప్పు వింటాం!" అని అన్నాడు.

నక్షత్రరాయలు ముఖం అటు త్రిప్పుకొని అడవివైపు చూస్తూ "నేనంటే వారికి చాల ప్రేమ అని మాత్రం నాకు తెలుసు" అని జవాబు చెప్పాడు.

రఘుపతి కర్కశంగా నవ్వి ఇలా అన్నాడు- "రామ రామ! ఎంతప్రేమ! ఆ ప్రేమతోనే ఎలాంటి అవరోధమూ లేకుండా ధ్రువుని యువరాజుగా చేసి మీ అన్న నిన్ను

దేశమునుంచి వెళ్ళగొట్టాడు. వెన్నవలె అతిమెత్తనివాడవు, సున్నితమగు నీవు రాజ్యభారాన్ని మోయలేక ఎక్కడ అణగి పోతావో, నీ కెంత బాధకలుగుతుందో అని మీ అన్నకు నీ మీద జాలి కలిగింది ఆ రాజ్యంలో తిరిగి నువ్వు తేలికగా ప్రవేశించగలవా? మూర్ఖుడా!"

నక్షత్రరాయలు వెంటనే అందుకొని "ఇలాంటి చిన్న విషయాలు నాకు తెలియవంటారా? నాకు అన్నీ తెలుసు. కానీ ఏంచేయను? మీరే చెప్పండి, మరోమార్గం ఏముంది?" అని అన్నాడు

"ఆలోచిస్తే మార్గమే ఉండదా, ఇప్పుడు నేను చెప్పేది దానిని గురించే. ఇష్టమైతే నా వెంట బయలుదేరు, లేదా ఈ అడవిలోనే కూర్చొని ప్రేమమూర్తియగు మీ అన్నగారిని తలుచుకుంటూ ఉండు. నేను వెళుతున్నాను" అన్నాడు రఘుపతి.

ఈమాట అని రఘుపతి బయలుదేరాడు. నక్షత్ర రాయలు గబగబ అతని వెనుకనే వెళ్ళి "నేను కూడా మీ వెంట వస్తాను పూజారిగారూ! కానీ మంత్రిగారుకూడా మన వెంట రాగోరినయడల అభ్యంతరమేముంది?" అని అన్నాడు.

"నీ వెంట నేను తప్ప మరెవరూ రాకూడదు" అని చెప్పాడు రఘుపతి

నక్షత్రరాయలుకు ఇంటిలోనుంచి అడుగు బయటకు పడ టంలేదు. ఆనందాన్ని కల్గించే ఈ వస్తువులనూ, మంత్రినీ వదలి రఘుపతి వెంట ఎక్కడికి వెళ్ళాలి? కానీ రఘుపతి తనను జుట్టుపట్టుకొని ఈడ్చుకు పోతున్నట్లుగా ఉంది అతనికి. అదే

గాక నక్షత్రరాయల మనస్సులో ఒక విధమగు భయము గొల్పు కుతూహలము కూడా జనిస్తూ ఉంది. అది కూా ఒక భీషణ ఆకర్షణగా ఉంది.

నావ సిద్ధంగా ఉంది. నదీతీరానికి చేరుకునేసరికి స్నానానికి వస్తున్న పీతాంబరరాయ్ అతనికి కన్పించాడు. నక్షత్ర రాయలును చూడగానే పీతాంబరరాయ్ సంతోషంగా "మహారాజుగారికి జయం కలుగుగాక! నిన్న ఎక్కడినుంచో ఒక అశుభ లక్షణాలుగల విచిత్ర బ్రాహ్మణుడు వచ్చి శుభ వివాహానికి విఘ్నం కలిగించాడని విన్నాను, నిజమేనా?" అని అన్నాడు

నక్షత్రరాయలు చాలా ఇరుకున పడ్డాడు.

"ఆ విచిత్ర బ్రాహ్మణుడను నేనే" అని రఘుపతి గంభీరంగా జవాబు చెప్పాడు

"పీతాంబరరాయ్ నవ్వుతూ ఇలా అన్నాడు- "అలా అయితే మీా ఎదుటనే మిమల్ని గురించి మాట్లాడటం మంచిది కాదు. తెలిసి ఎవరూ అలా చేయరు. మీారు అన్యథా భావించవద్దు. చాటుమాటున అనేకం అనుకుంటారు. నా ఎదుట ప్రజలు నన్ను 'మహారాజు' అంటారు. చాటున పీతాంబర రాయ్ అనే అంటారు. ముఖం ఎదుటమాత్రం ఇలామాట్లాడకూడదు నా ఉద్దేశ్యం మాత్రం ఇదే ఇంతకూ వాస్తవం ఏమిటో మీాకు తెలుసునా? ఎందుకనో మీా ముఖం చాలా మొరటుగానూ, అయిష్టంగానూ కన్పిస్తుంది. ఇలాంటి ముఖాన్ని చూచి ఎవరికీ సదభిప్రాయం కలుగదు మహారాజా, తమరు ఉదయమే నదీతీరానికి వచ్చారెందుకు?"

నక్షత్రరాయలు జాలిగొలుపునట్లుగా "వెళ్ళిపోతు న్నాను మంత్రిగారూ" అని అన్నాడు

"వెళుతున్నారా, ఎక్కడికి? నౌపాడా మండలుని ఇంటికా!" అని అడిగాడు పీతాంబరరాయ్.

"నక్షత్రరాయలు ఒకసారి రఘుపతి ముఖంలోకి చూచి దుఃఖపడుతూ కాదన్నట్లు తల ఆడించాడు.

"ప్రొద్దెక్కుతూ ఉంది. త్వరగా బయలు దేరాలి" అని అన్నాడు రఘుపతి.

పీతాంబరరాయ్ అనుమానంతో కోపంగా బ్రాహ్మణుని వంక చూచి "మా మహారాజుగారిని ఆజ్ఞాపించటానికి నువ్వెవరు?" అన్నాడు.

నక్షత్రరాయలు చింతిస్తూ పీతాంబరరాయ్‌ను ప్రక్కకు తీసుకువెళ్ళి "వారు మా గురువుగారు!" అని చెప్పాడు.

"గురువుగారే కావచ్చు! వారిని మన చండీమండపంలో ఉండనివ్వండి. రోజూ బియ్యమూ అరటిపండ్లు పంపుతాను. గౌరవంగా వుండమని చెప్పండి. మహారాజుగారితో అతనికి పనేముంది?" అన్నాడు పీతాంబరరాయ్.

"కాలం వృథాగా గడిచిపోతుంది నేనిక వెళ్ళిపోతు న్నాను" అన్నాడు రఘుపతి.

"అది మీ ఇష్టం! ఆలస్యమైనందువల్ల లాభం ఏముంది? తమరు వెంటనే వెళ్ళిపోతే, నేనూ మహారాజుగారు భవనానికి తిరిగి వెళతాం" అన్నాడు పీతాంబరరాయ్.

నక్షత్రరాయలు ఒకసారి పీతాంబరరాయ్ వైపు మరొకసారి రఘుపతివైపుచూచి మృదువుగా "లేదు, మంత్రి గారూ, నేను వెళతాను" అన్నాడు.

"నేనుకూడా వస్తాను. సేవకులు మొదలగువారినికూడా వెంటతీసుకొని మహారాజాగారివలె బయలుదేరండి. మహారాజుగారు వెళుతూవుంటే వెంట మంత్రి వెళ్ళడా!" అన్నాడు పీతాంబరరాయ్.

నక్షత్రరాయలు ఏమీ మాట్లాడకుండా రఘుపతి ముఖంలోకి చూచాడు.

"వెంట ఎవ్వరూ రావటానికి వీల్లేదు" అని అన్నాడు రఘుపతి

పీతాంబరరాయ్ ఉగ్రుడైపోతూ 'ఇదుగో, చూస్తూ ఉంటే మీరు.. ..."

వెంటనే నక్షత్రరాయలు అతని మాటకు అడ్డొస్తూ "మంత్రిగారూ, నేను వెళుతున్నాను. ఆలస్యమవుతుంది" అని చెప్పాడు.

పీతాంబరరాయ్ చాలా బాధపడుతూ నక్షత్రరాయల చెయ్యిపట్టుకొని ఇలా చెప్పాడు- "చూడు నాయనా, నేను మిమ్మల్ని మహారాజు అనిఅంటున్నాను కానీ కుమారునికంటె అధికంగా నిన్నుప్రేమిస్తున్నాను. నాకు బిడ్డలు లేరు. నేను నిన్ను శాసించలేను. నువ్వు వెళ్ళిపోతున్నావు, కానీ నేను నిన్ను బలవంతంగా పట్టిఉంచలేను. నా దొక చిన్నకోర్కె. నువ్వు ఎక్కడికి వెళ్ళినా నేను చనిపోయేముందు మాత్రం

తప్పక తిరిగి రావాలి. నా చేతులతో నేను నీకు నారాజ్యాన్ని అప్పగిస్తాను. నా కోర్కెను తప్పక తీరుస్తావనే ఆశిస్తాను."

నక్షత్రరాయలు, రఘుపతి నావలోకి ఎక్కి కూర్చున్నారు. నావ దక్షిణదిశగా బయలుదేరింది పీతాంబరరాయ్ స్నానం చేయకుండానే పరధ్యానంగా ఇంటికి తిరిగి వెళ్ళాడు. గూజరపాడా నిర్జనమైపోయినట్లుంది. అక్కడి విలాసాలన్నీ అదృశ్యమైపోయాయి ప్రతిరోజు నేత్రానందం కల్గించు ప్రకృతి ఉత్సవం, ప్రాతఃకాలమందు పక్షుల కలరవగానం, ఆకుల గలగల ధ్వనులు, బ్రహ్మపుత్రానది తరంగాల మధుర నినాదము మాత్రము అలాగే ఉన్నాయి.

# 27

చాలా దూరప్రయాణము. మధ్యమధ్య నదులు, దట్టమైన అడవులు, ఒక్కొక్కచోట చెట్టుచేమలేని విశాలమైదానాలు కన్పిస్తున్నాయి కొంతదూరం నావలోనూ, కొన్ని చోట్ల కాలినడకనూ, ఒక్కొక్కచోట పొట్టి గుర్రాల మీదనూ, ఎండలో, వానలో, పగలు, రాత్రి విశ్రాంతిఅనేది లేకుండా నక్షత్రరాయలు ప్రయాణం చేస్తున్నాడు. ఎన్నో దేశాలు, అనేక విచిత్రదృశ్యాలు, చిత్రవిచిత్రమగు మనుష్యులు కన్పిస్తున్నారు– కానీ నక్షత్రరాయల వెంట నీడవలె క్షీణించిన ఎండవలె తేజస్సుగల రఘుపతి అనుక్షణం అంటిపెట్టుకొని ఉంటున్నాడు. పగలు, రాత్రి, కన్నుమూస్తే కన్ను తెరిస్తే రఘుపతి రూపమే కన్పిస్తూ ఉంది. మార్గాన ఇంకా అనేకమంది బాటసారులు వెళుతున్నారు. దారిప్రక్క

దుమ్ములో చిన్నపిల్లలు ఆటలాడు కొంటున్నారు. దుకాణ ములలో క్రయవిక్రయాలు జరుగుతున్నాయి. గ్రామాలలోని వృద్ధులు పాచికలు ఆడుతున్నారు రేవులలో యువతులు నీళ్ళ బిందెలతో కన్పడుతున్నారు నావికులు పాటపాడుతూ తమ పడవలు నడుపుతున్నారు. కానీ నక్షత్రరాయల ప్రక్కన మాత్రం ఎల్లవేళల ఆ ఒక్క బ్రాహ్మణుడు రఘుపతి కడు జాగరూకతతో ఉంటాడు. ప్రపంచంలో నలువైపుల విచిత్ర మగు ఆటలెన్నో జరుగుతున్నాయి అనేక విచిత్రఘటనలు జరుగుతున్నాయి కానీ ఈ నాటకరంగములోని విచిత్రలీలల మధ్యనుంచి నక్షత్రరాయల భవిష్యత్తు అతనిని ఈడ్చుకు పోతూఉంది తన వారినప్పుడు అతనికి పరాయివాళ్ళు, కోలా హల భరితమగు నగరాలు అతనికి నిర్జన మైదానాలు.

నక్షత్రరాయలు అలసిపోయి తన ప్రక్కనే నడుస్తున్న నీడను "ఇంకెంతదూరం నడవాలి?" అని అడిగాడు.

"చాలా దూరం వెళ్ళాలి" అని నీడ జవాబు చెప్పింది.

"ఎక్కడికి వెళ్ళాలి?"

దీనికేమీ జవాబు రాలేదు. నక్షత్రరాయలు దీర్ఘంగా నిట్టూర్చి ముందుకు సాగాడు. పచ్చని ప్రకృతి మధ్య నిర్జన ప్రదేశంలో చెట్లనీడలో ఉన్న ఒక చిన్న కుటీరాన్ని చూచి నక్షత్రరాయలు "నేను దీనిలో ఉండగలిగితే ఎంతహాయిగా వుంటుంది?" అని ఆలోచించేవాడు. సాయంత్ర సమయాల్లో పశుల కాపరులు కర్రలు భుజాన పెట్టుకొని దుమ్ములేపుతూ ఆవులను దూడలను తోలుకొని ఇళ్ళకు తిరిగి వస్తూవుంటే వారినిచూచి "నేను కూడా వీరివెంట వెళ్ళగలిగితే హాయిగా

ఇంటికివెళ్ళి విశ్రాంతి తీసుకోవచ్చుగదా!” అనే ఆలోచన కలిగేది. మధ్యాహ్నపు మండుటెండలో రైతులు తమ పొలాలలో పనులు చేస్తున్నారు. వారినిచూచి “వీరి జీవిత మెంత సుఖమైనది” అని ఆలోచించేవాడు.

దూరప్రయాణం వల్లనూ, ప్రయాణంలోని కష్టాల వల్లనూ నక్షత్రరాయలు బాగానలిగిపోయి వాడినపుష్పంవలె తయారయ్యాడు. అతడు రఘుపతితో “పూజారిగారు నేనిక బ్రతకను” అని అన్నాడు.

“నిన్నిప్పుడు చావనిస్తామా!” అన్నాడు రఘుపతి.

రఘుపతి అవకాశాన్నివ్వకపోతే తాను చావటానికి కూడా వీలుండదని అతడు ఆలోచించాడు ఒక స్త్రీ నక్షత్రరాయలును చూచి “ఎవరిబిడ్డో, పాపం! ఇతనిని బయటకు తీసుకు వచ్చిందెవరో!” అని అంది. ఆమె మాటలు విని అతని ప్రాణాలు ద్రవించాయి కళ్ళనిండా నీళ్ళు నిండాయి ఆ స్త్రీని ‘అమ్మా’ అని పిలిచి ఆమె వెంట ఆమె ఇంటికి వెళ్ళాలనే కోర్కె కలిగింది.

కానీ నక్షత్రరాయలు రఘుపతివల్ల ఎన్ని కష్టాలు పొందుతున్నాడో అంతగా అతనికి లొంగిపోతున్నాడు. రఘుపతి సైగలు అతనిని బంధించి నడిపిస్తున్నాయి. అతని సైగలకు నక్షత్రరాయలు దాసుడు.

ముందుకు సాగిపోయిన కొద్దీ నదులు తగ్గిపోయాయి. రాతి ప్రదేశం ప్రారంభమయింది. ఎర్రరాతిభూమి, నగరాలు చాలా దూరదూరంగా ఉన్నాయి. ఎక్కడో ఒకచోట తప్ప చెట్లుకూడా చాల తక్కువగా వున్నాయి. కొబ్బరిచెట్లు అధి

కంగా ఉన్న దేశం దాటారు. తరువాత తాటిచెట్ల దేశంలోకి ప్రవేశించారు మధ్య మధ్య పెద్దపెద్ద వంతెనలు, ఎండి పోయిన నదులు. చాలా దూరాన పర్వతాలు మబ్బులవలె కన్పిస్తున్నాయి. షుజా చక్రవర్తి రాజధాని మహాలుకు దగ్గ రవుతూ ఉన్నారు.

# 28

చివరికి వారు రాజధానీ నగరంలోకి చేరుకున్నారు. పరాజయం పొంది, కారాగృహం నుంచి తప్పించుకొని వచ్చిన తరువాత షుజా కొత్త సైన్యాలను సమకూర్చుకోవ టంలో మునిగి ఉన్నాడు, కానీ ఖజానాలో ధనం చాలా తక్కువగా ఉంది. ప్రజలు పన్నుల భారంతో క్రుంగిపోతు న్నారు. ఈ మధ్యకాలంలోనే దారాను ఓడించి అతనిని చంపి ఔరంగజేబు ఢిల్లీ సింహాసనం ఎక్కాడు. ఈ వార్త తెలిసి షుజా చాలా కలవరపడ్డాడు. ఇంకా తనకు తగినంత సైన్యం సమకూడలేదు. అందుకని కొంత అవకాశం కల్పించుకోవా లనే కుత్సిత బుద్ధితో అతడు ఔరంగజేబు వద్దకు ఒక దూతను పంపాడు. ప్రాణసముడు, మా కంటి వెలుగు, అత్యంతస్నేహ పాత్రుడు, ప్రియసోదరుడు ఔరంగజేబు ఢిల్లీ సింహాసనాన్న ధిష్ఠించాడని విని నిరాశ చెందిన షుజాకు పరమానందం కలి గిందనీ, షుజాను బెంగాలు ప్రభువుగా అంగీకరించటము మరింత సంతోషదాయకమనీ అతడు దూతతో చెప్పిపంపాడు.

ఔరంగజేబు అత్యంత ఆదరపూర్వకంగా దూతను పిలిపించాడు. అతడు అత్యంత ప్రేమపూర్వకంగా షుజా

యొక్క క్షేమసమాచారములు, అక్కడి పరిస్థితులు అడిగి తెలుసుకున్నాడు. తరువాత ఔరంగజేబు ఆ దూతతో ఈ విధంగా చెప్పాడు-"షాజహాను చక్రవర్తిగారే స్వయంగా షుజాకు బెంగాలు పరిపాలనా భారాన్ని అప్పగించారు అలాంటప్పుడు దానికి మరొకరి అంగీకారం అనవసరం"

అదేసమయంలో ఇక్కడ రఘుపతి షుజా దర్బారు లోకి ప్రవేశించాడు.

షుజా కృతజ్ఞతాభావంతో, గౌరవపూర్వకంగా తనను కాపాడిన రఘుపతిని చూసి "ఏమిటి సమాచారం!" అని అడిగాడు

"మహారాజుగారితో ఒక విషయం విన్నవించుకోవాలి" అన్నాడు రఘుపతి.

"ఇతడు విన్నవించుకొనేదేమిటి? డబ్బు కాదుగదా, అలా అయితే చాలా ఇబ్బందిపడాలి" అని అతడు మనసులో అనుకున్నాడు.

"నేను ప్రార్థించేదేమంటే..."

అని రఘుపతి అంటూ ఉండగా షుజా మధ్యలోనే అడ్డొస్తూ "ఓయీ బ్రాహ్మణా, నీకోర్కెను నేను తప్పక తీరుస్తాను, కానీ కొంతకాలం ఆగాలి ప్రస్తుతం ఖజానాలో డబ్బు తక్కువగా ఉంది" అని అన్నాడు.

"చక్రవర్తీ! నాకు ధనకనక వాహనా లేవీ వద్దు. నాకిప్పుడు గౌరవం కాపాడే శక్తిసహాయం కావాలి నాఫిర్యాదు విని తమరు తగిన న్యాయం చేకూర్చాలని ప్రార్థిస్తున్నాను" అన్నాడు రఘుపతి.

"చాలా కష్టమైనపనే మా కిప్పుడు ఆలోచించే అవ కాశం కూడా లేదు బ్రాహ్మణ మహాశయా, మీరు తీరిక లేని సమయంలో వచ్చారు."

"రాకుమారా! సమయము అసమయము అనేవి అంద రికీ ఉంటాయి. తమరు చక్రవర్తులు, తమకూ ఉంటాయి. నేను దరిద్ర బ్రాహ్మణుడను, నాకూ ఉంటాయి. తమరు అవకాశం లభించినప్పుడు నా ఫిర్యాదును గురించి ఆలో చించాలంటే అప్పుడు నాకు అవకాశం ఉంటుందా?"

షుజా నిరాశచెంది "చాలా చిక్కేవచ్చింది ఈమాట లన్నీ వినటంకంటె ఆ ఫిర్యాదు వినటమే మంచిది. సరే, మీరు చెప్పదలచిందేమిటో చెప్పండి" అని అన్నాడు.

"త్రిపుర మహారాజు గోవింద మాణిక్యుడు తన తమ్ముడు నిరపరాధియగు నక్షత్రరాయలును దేశంనుంచి బహిష్కరించాడు."

షుజా ఆ మాట విని ముఖం చిట్లించి "బ్రాహ్మణ మహాశయా, ఇతరుల విషయాలను గురించి మా సమయాన్ని ఎందుకు పాడుచేస్తావు? వీటిని గురించి ఆలోచించటానికి ఇది సమయం కాదు" అని అన్నాడు.

"రాకుమారా, ఫిర్యాది మన రాజధానిలోనే ఉన్నాడు" అన్నాడు రఘుపతి.

"అతడు మా ఎదుటకు వచ్చి తనకు జరిగిన అన్యా యాన్ని గురించి స్వయంగా చెప్పుకున్నట్లయితే మేము అప్పుడు ఈ విషయాన్ని గురించి ఆలోచిస్తాము."

'అతనిని ఎప్పుడు హాజరు పర్చమని ఆజ్ఞ?"

ఈ బ్రాహ్మణుడు తనను వదలేట్టులేడని షుజా మన సులో అనుకొని "ఒక వారంరోజుల తరువాత అతనిని తీసు కొనిరా" అని అతనితో అన్నాడు.

"చక్రవర్తిగారి ఆజ్ఞ అయితే అతనిని రేపే తమ ఎదుట హాజరు పర్చగలను."

"సరే, రేపే తీసుకు రండి" అన్నాడు షుజా విసుగుతో.

ఆ నాటికి ఎలాగో వదిలించుకున్నాడు. రఘుపతి వెళ్ళి పోయాడు.

"నవాబుగారివద్దకు వెళ్ళటానికి నా కేమీ అభ్యంతరం లేదు కానీ వట్టిచేతులతో ఎలా వెళ్ళటం?" అని అన్నాడు నక్షత్రరాయలు.

"దానిని గురించి నువ్వేమీ దిగులుపడవద్దు" అని అన్నాడు రఘుపతి.

అతడు చక్రవర్తిగారికి కానుకగా ఇవ్వటానికి లక్షన్నర రూపాయలు తెచ్చి నక్షత్రరాయల చేతికిచ్చాడు

మర్నాడు ఉదయమే రఘుపతి నక్షత్రరాయలును వెంటబెట్టుకొని షుజా దర్బారుకు వెళ్ళాడు. లక్షన్నర రూపా యలు తన పాదాలముందు కానుకగా సమర్పించటం చూచిన తరువాత షుజా ముఖంలో అంతకు ముందున్న అయిష్టత కన్పించలేదు. నక్షత్రరాయల ఫిర్యాదును శ్రద్ధగా విన్నాడు.

"ఇప్పుడు దీనిని గురించి మీరేమి ఆలోచిస్తున్నారో చెప్పండి" అని షుజా ప్రశ్నించాడు.

"గోవిందమాణిక్యని దేశం నుంచి బహిష్కరించి నక్షత్రరాయలును మహారాజుగా చేయాలని ఆజ్ఞాపించండి" అన్నాడు రఘుపతి.

తన సోదరుడు ఔరంగజేబు చక్రవర్తి అయినందుకు వ్యతిరేకించటానికి షుజా ఎంతమాత్రం సందేహించక పోవచ్చును. కానీ ఈ సమయంలో అతడు ఎందుకనో సందేహించసాగాడు కానీ రఘుపతి కోర్కెను తీర్చటం ఇతర విషయాల కంటె అతనికి చాల తేలికగా కన్పించింది లేకపోతే రఘుపతి అధికంగా వాగుతాడని అతని భయం. అదీగాక లక్షన్నర రూపాయల కానుక లభించిన తరువాత అభ్యంతరం చెప్పటం కూడా మంచిది కాదని అతడు ఆలోచించాడు.

"గోవిందమాణిక్యని దేశంనుంచి బహిష్కరిస్తూ నక్షత్రరాయలే త్రిపుర మహారాజు అని మేము ఫర్మానాను మీ చేతికిస్తాము. మీరు తీసుకు వెళ్ళండి" అని అన్నాడు షుజా.

"తమ సైన్యం కూడా కొంత మా వెంట రావాలి" అన్నాడు రఘుపతి.

"లేదు అది వీలుపడదు. మేము యుద్ధం చేయము" అన్నాడు షుజా దృఢనిశ్చయంతో.

"యుద్ధానికి అయ్యే ఖర్చుకుగాను ముప్పది ఆరువేల రూపాయలు నేను ప్రత్యేకంగా ఇచ్చుకుంటాను. నక్షత్ర రాయలు త్రిపుర మహారాజు అయిన తరువాత ఒక సంవత్సరపు ఆదాయాన్ని కూడా తమకు సమర్పించుకుంటాము" అన్నాడు రఘుపతి.

రఘుపతి చెప్పినది కూడా షుజాకు చాలా సబబుగానే కన్పించింది. సభాసదులు కూడా అందుకు అంగీకరించారు. ఒక మహమ్మదీయ సైనిక దళమును వెంటబెట్టుకొని రఘుపతి నక్షత్రరాయలు త్రిపురకు బయలుదేరారు.

# 29

కథాకాలము ప్రారంభమై ఇప్పటికి రెండు సంవత్సరాలు గడిచింది అప్పుడు ధ్రువుని వయస్సు రెండు సంవత్సరాలు ఇప్పుడు అతడు నాలుగేండ్లవాడు. అతడు ఇప్పుడు బాగా మాటలు చెప్పటమేగాక తాను పెద్దవాడనయ్యానని కూడా అనుకోసాగాడు. అతడు అన్ని మాటల్ని స్పష్టంగా అనలేక పోయినప్పటికీ గబగబ బిగ్గరగా మాట్లాడ గలుగుతున్నాడు అతడు మహారాజుగారిని తరచు "నీకు బొమ్మ ఇస్తాను" అని ఎంతో ముద్దుగా మురిపించేవాడు మహారాజుగారు ఎప్పుడైనా అతనిని ఎగతాళి చేస్తూ మాట్లాడినప్పుడు "నిన్ను గదిలోపెట్టి తాళంవేస్తాను" అని భయపెట్టేవాడు. ఈ విధంగా మహారాజుగారు ఇప్పుడు ప్రత్యేక అధికారంలో వుంటున్నారు. ధ్రువుని అనుమతి లేకుండా వారు ఏ పనీ చేయటం లేదు.

ఈ లోపల ధ్రువునికి మరొక స్నేహితురాలు లభించింది. ఆమె పొరుగున నివసించే బాలిక, ధ్రువునికంటె ఆరు మాసాలు చిన్నది. పదినిముషాలకాలంలో ఇద్దరికీ సన్నిహిత స్నేహం కుదిరింది మధ్యలో ఒకసారి వారి స్నేహం చెడిపోయే ప్రమాదం కలిగింది. ధ్రువుని చేతిలో ఒక పెద్ద లడ్డు

ఉంది. తొలి ప్రేమ ఉత్సాహంలో ధ్రువుడు జాగ్రత్తగా చిన్న ముక్క తుంచి తన స్నేహితురాలి నోట్లో పెడుతూ ఎంతో దయతలచినట్లుగా "నువ్వు తిను" అన్నాడు. స్నేహితురాలు నోటికి తియ్యదనం తగలగానే సంతృప్తి చెందుతూ "ఇంకా తింటాను" అని అంది.

అప్పుడు ధ్రువుని పని చాలా ఇరుకున పడ్డట్లయింది. స్నేహంలో ఇంత ఇరుకున పెట్టటం అతనికి నచ్చలేదు. ధ్రువుడు తన సహజమగు గంభీర భావంతో ఠీవిగా తల ఆడిస్తూ కళ్ళు పెద్దవి చేసి "ఛీ! ఎక్కువ తినకూడదు. రోగం వస్తుంది బాబా కొడతాలు" అని అన్నాడు ఈ మాట అని అతడు మిగిలిన లడ్డును ఒకేసారి నోట్లో కుక్కుకొని తినేశాడు. అకస్మాత్తుగా బాలికయొక్క ముఖభావం మారిపోయింది. పెదవులు ఎగిరిపడసాగాయి. ముఖం ముడుచుకుపోయింది. ఏడ్చే లక్షణాలన్నీ ముఖంలో కన్పించసాగాయి

ఎవరైనా ఏడిస్తే ధ్రువుడు చూడలేడు. అతడు వెంటనే చాలా గంభీరంగా "రేపు చాలా పెలతాను" అని ఓదార్చాడు

మహారాజుగారు రాగానే ధ్రువుడు చాలా తెలివిగా తన కొత్త స్నేహితురాలిని పరిచయంచేస్తూ "ఈమెను ఏమీ అనవద్దు. కొట్టవద్దు, ఏడుస్తుంది. కుల్లుబోతు, ఛీ!" అని అన్నాడు

మహారాజుగారి మనస్సులో నిజానికి ఆ బాలికను గురించి దురభిప్రాయమేమీ లేదు. కాని బలవంతాన మహారాజుగారిని హెచ్చరించటం చాలా అవసరమని ధ్రువుడు

అనుకొన్నాడు. మహారాజుగారు బాలికను కొట్టలేదు. మహారాజుగారు తన ఉపదేశాన్ని అక్షరాలా పాటించటం ధ్రువుడు గమనించాడు.

తరువాత ధ్రువుడు తాను చాలా గొప్పవాడిననే భావంతో గర్వపడ్డాడు. బాలిక ఏడుస్తుందనే ప్రమాదంలేదని కూడా గ్రహించాడు. అప్పుడు చాలా పెద్దమనిషివలె గంభీరంగా ఆమెకు ధైర్యం చెప్పసాగాడు.

ధ్రువుడు ఆమెకు ధైర్యం చెప్పాల్సిన అవసరమేమీ లేదు ఎందుకంటే ఆమె చాలా నిర్భయంగా మహారాజు చెంతకు వెళ్ళి నిలబడి చాలా ఆసక్తితో తనచేతి గాజులను అటునిటు త్రిప్పి చూడసాగింది.

ఈ విధంగా తన ప్రయత్నంవల్ల, శ్రమపడి ఈ భూమి మీద శాంతినీ, ప్రేమనూ స్థాపించినసంతోషంతో, మంచిగా వ్యవహరించిన మహారాజుగారికి బహుమానంగా ముద్దమల్లె పువ్వువలె గుండ్రముగా, సుకుమారంగా ఉన్న తన పవిత్రమైన ముఖాన్ని వారి ముందుకు చాచాడు. మహారాజుగారు ముద్దుపెట్టుకున్నారు

అప్పుడు ధ్రువుడు తన స్నేహితురాలి ముఖాన్నికూడా పైకెత్తి "ఈమెను కూడా ముద్దుపెట్టుకోండి" అని కోరాడు తన అనుమతిని తెలియజేస్తూ.

మహారాజుగారు ధ్రువుని ఆజ్ఞను ఉల్లంఘించటానికి సాహసించలేక పోయారు ఆ బాలిక కూడా మహారాజుగారి పిలుపుకోసం ఎదురుచూడకుండానే నిస్సంకోచంగా వారి ఒడిలోకి ఎక్కి కూర్చుంది.

ఇప్పటి వరకు ఆ ప్రపంచంలో ఆందోళన కలిగించే పనులుగానీ, నియమవిరుద్ధమైన పనులుగానీ జరుగలేదు. కానీ ఈసారి ధ్రువునిసింహాసనాన్ని మరొకరు ఆక్రమించేసరికి అతని ఏకాధిపత్య ప్రేమ కంపించసాగింది మహారాజుగారి ఒడిలో తన ఏకాధిపత్యాన్ని స్థాపించుకోవాలనే కోర్కె అతని హృదయంలో బలపడసాగింది. అతనికి చాలా దుఃఖం కలిగింది. ఒకటి రెండుసార్లు అతడు బాలికను క్రిందికి లాగాలని ప్రయత్నించాడు. ఇలాంటి ప్రత్యేక పరిస్థితుల్లో తన కోసం ఆ చిన్న బాలికను కొట్టటం కూడా అతనికి సబబుగానే కన్పించింది.

తగాదాను పరిష్కరించే ఉద్దేశ్యంతో మహారాజుగారు ధ్రువునిని కూడా తమ ఒడిలోకి తీసుకున్నారు కానీ అప్పటికీ ధ్రువునికి సంతృప్తి కలుగలేదు. మిగిలిన సగభాగాన్ని కూడా ఆక్రమించుకోవాలనే అతడు ప్రయత్నించసాగాడు ఇంతలో కొత్తగా వచ్చిన రాజపురోహితుడు బిల్వాణుడు గదిలోకి వచ్చాడు

మహారాజుగారు ఇద్దరినీ క్రిందికిదించి పురోహితునికి నమస్కరించి ధ్రువునితో "పూజారిగారికి నమస్కారంచెయ్యి" అని చెప్పారు. ధ్రువుడు ఆ పని అవసరమని భావించలేదు. అతడు నోట్లో వ్రేలువేసుకొని తిరుగుబాటు భావంతో నిలబడి ఉన్నాడు. బాలిక మహారాజుగారిని చూచి తాను కూడా పూజారిగారికి నమస్కరించింది.

పూజారి బిల్వాణుడు ధ్రువకుమారునిని ఎత్తుకొని "నీకు ఈ స్నేహితురాలు ఎక్కడ దొరికింది?" అని అడిగాడు.

ధ్రువుడు కొద్దిక్షణాలు ఆలోచించి "నేను చల్‌చల్ ఎక్కుతాను చల్‌చల్ అంటే గుర్రం" అని అన్నాడు.

"అద్భుతం! చాలా బాగుంది! ప్రశ్నకు జవాబుకు ఎంత దగ్గర సంబంధం!" అని అన్నాడు బిల్హణుడు

అకస్మాత్తుగా ధ్రువుని దృష్టి ఆ బాలికమీద పడింది. ఆమెను గురించి సంక్షిప్తంగా తన అభిప్రాయాన్ని తెలియజేస్తూ "ఆమె దుల్మార్గులులాలు. ఆమెను కొలతాను" అని పిడికిలి బిగించి చూపించసాగాడు.

మహారాజుగారు గంభీరంగా "ధ్రువా, తప్పు" అని అన్నారు.

ఉఫ్ అనగానే దీపం ఆరిపోయినట్లు ఆ మాటతో వెంటనే ధ్రువుని ముఖభావం మారిపోయింది. మొట్టమొదట అతడు కన్నీళ్ళు ఆపుకోటానికి రెండు చేతులతోనూ కళ్ళు నలుముకోసాగాడు చివరికి స్వచ్ఛమైన అతని హృదయం దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది- బిగ్గరగా ఏడ్చేశాడు.

పూజారి బిల్హణుడు అతనిని చేతులమీద ఎత్తుకొని అటునిటు వూపుతూ ఆడిస్తూ "ఇదుగో విను, విను! నీ కోసం నేనొక శ్లోకం చెప్తాను విను" అని అన్నాడు.

"కలహా కటకటాం కాత్ కాఠిన్యం కాట్యం.
కటన్ కిటన్ కీటం కుటాణ్షం ఖట్టపట్టం!"

అంటె ఏడ్చే అబ్బాయిని కలహా కటకటాం మధ్య ఉంచి కాత్ కాఠిన్యం కాట్యం సంపూర్ణంగా ఇస్తారు. ఆ తరువాత కొద్దిగా కటన్‌కిటన్ కీటం తీసుకొని ఒకేసారి మూడింటి వరకు కుటాణ్షం ఖట్టపట్టం.

ఈ విధంగా పూజారి అర్థంపర్థంలేని మాటల్ని గడ గడ మాట్లాడాడు ధ్రువుడు మధ్యలోనే ఏడ్పుమానేశాడు. పూజారి మాటలయొక్క అర్థం తెలియక అతడు గబగబ మాట్లాడుతూ ఉంటే ధ్రువుడు నిశ్చేష్టుడై కళ్ళుప్పగించి బిల్వాణుని వంక చూడసాగాడు. ముఖము చేతులు ఆడిస్తూ మాట్లాడే పూజారిగారు అతనికి తమాషాగా కన్పించారు.

ధ్రువుడు సంతోషిస్తూ "మళ్ళీపాడు" అన్నాడు.

పూజారిగారు ఆ శ్లోకాన్ని మళ్ళీ చదివి అర్థం చెప్పారు

ధ్రువుడు కిలకిలా నవ్వుతూ "మళ్ళీ" అని అన్నాడు.

కన్నీటితో తడిసిన అతని చెక్కిళ్ళను, దరహాస చంద్రికలు చిందే అతని అధరములను మహారాజుగారు తనివితీరా ముద్దుపెట్టుకున్నారు. అప్పుడు మహారాజుగారు, రాజపురోహితుడు, ధ్రువుడు, ఆ బాలిక నలుగురు కలిసి ఆటలాడుకోసాగారు

బిల్వాణుడు మహారాజుగారితో ఇలా అన్నాడు- ఈ పిల్లలవలన మహారాజుగారికి చాలా ఆనందం కలుగుతూ ఉంది రాత్రింబవళ్ళు ఎప్పుడూ గొప్పగొప్ప తెలివిగలవారితో కలిసి ఉన్నందువల్ల ఉన్న తెలివి కూడా పోతుంది. కత్తికి ఎప్పుడూ పదును పెడుతూవుంటే క్రమంగా అరిగిపోయి చివరికి దాని రూపం కూడా లేకుండా పోతుంది. చివరికి ఆ కత్తి పిడి మాత్రం మిగులుతుంది."

మహారాజుగారు నవ్వి "అంటే నా తెలివి ఇంకా మందగించలేదంటారు, అంతేనా?" అని అన్నారు.

"అవును, బుద్ధి మందగించినప్పుడు అది అతి స్వల్ప విషయాలను కూడా కఠినంగా మార్చివేస్తుంది. ఇదే దాని లక్షణం. ఈ ప్రపంచంలో గొప్పగొప్ప తెలివిగలవాళ్ళే లేక పోతే దీనిపని చాలా తేలికవుతుంది. అనేక రకాల సౌకర్యాలు కల్గించటంవల్లనే అనేక కష్టాలు ఎదురవుతూ ఉంటాయి. ఎక్కువ తెలివితేటల్ని మనిషి ఏంచేసుకుంటాడో అర్థంకాదు."

"మన చేతికి ఉన్న అయిదు వ్రేళ్ళతోనే కావలసినంత పని జరుగుతుంది కానీ దురదృష్టవశాత్తు ఏడు వ్రేళ్ళులభిస్తే తెలిసి పనిని పెంచుకోవలసే వస్తుంది" అని అన్నారు మహారాజుగారు

తరువాత మహారాజుగారు ధ్రువుని తన వద్దకు పిలిచారు ధ్రువుడు అప్పటికే తన స్నేహితురాలితో రాజీపడి ఆడుకొంటున్నాడు. రాజుగారి పిలుపు వినగానే అతడు ఆట ఆపి వారి వద్దకు వచ్చాడు.

మహారాజుగారు అతనిని తనకు ఎదురుగా కూర్చొబెట్టుకొని "ఆ క్రొత్త పాటను పూజారిగారికి పాడివిన్పించు" అని చెప్పారు. ధ్రువుడు చాలా అభ్యంతరంగా పూజారిగారి వైపు చూచాడు.

మహారాజుగారు అతనికి "చల్ చల్ ఎక్కిస్తాను" అని ఆశ చూపించారు.

ధ్రువుడు సగం పలుకుతూ సగం వదలివేస్తూ ఆపాటను పాడి విన్పించాడు.

ధ్రువుని వచ్చీరాని మాటలలో ఆ పాటను విని పూజారిగారి హృదయం ద్రవించింది.

"నాయనా నువ్వు చిరంజీవిగా వర్ధిల్లాలని ఆశీర్వదిస్తున్నాను" అని పూజారిగారు అతనిని ఆశీర్వదించి ప్రేమతో ఎత్తుకొని "మరొకసారి పాడు బాబూ!" అని కోరాడు

ధ్రువుడు మౌనంగానే అందుకు అయిష్టతను వ్యక్తం చేశాడు. పూజారిగారు కళ్ళుమూసుకొని "అయితే నేను ఏడుస్తాను" అని బెదిరించాడు

ధ్రువుడు కలవరపడుతూ "రేపు పాడతాను ఏడ్వవద్దు. మీరు ఇప్పుడు ఇంటికి వెళ్ళండి. బాబా కోలతాలు" అని అన్నాడు

బిల్హణుడు నవ్వి "ఎంత మధురమైన కంఠస్వరం" అన్నాడు తరువాత మహారాజగారివద్ద శలవు తీసుకొని బయటకు వెళ్ళిపోయాడు

దారివెంట ఇద్దరు ప్రయాణీకులు వెళుతున్నారు. వారిలో ఒకడు రెండవవానితో "మూడు రోజులనుంచి అతని ఇంటిముందు పడివున్నాను ఒక్క పైసాకూడా వసూలుచేయలేకపోయాను. ఈసారి ఆతడు బయటకువస్తే తల పగలకొడతాను ఏంజరుగుతుందో చూద్దాం" అని అన్నాడు.

బిల్హణుడు వెనుకనుంచి "దానివల్ల కూడా ఏమీ ప్రయోజనం ఉండదు. దుర్బుద్ధితప్ప బుర్రలో మరేమీలేదని తెలుస్తూనే ఉందికదా!" అని అన్నాడు.

వాళ్ళిద్దరూ పూజారిగారిని చూచి ఉలిక్కిపడి నమస్కరించారు.

"మిత్రమా, మీరు అనుకున్న మాటలు మంచివి కావు" అని బిల్హణుడు వారితో అన్నాడు.

"చిత్తం, మళ్ళీ అలాంటి మాటలు మాట్లాడము" అని వారిద్దరూ పూజారిగారితో అన్నారు

"పూజారిగారిని దారిలో పిల్లలు చుట్టుముట్టారు. "ఇవాళ సాయంత్రం మీరందరూ అక్కడికి రండి, మంచి మంచి కధలు చెప్పుతాను" అని పూజారిగారు వాళ్ళతో చెప్పారు. పిల్లలు గంతులువేస్తూ చాలా అల్లరి చేశారు

పూజారి బిల్వాణుడు అప్పుడప్పుడు మధ్యాహ్న సమయాలలో రాజధానిలోని శాలురను ప్రోగుచేసి వారికి అర్ధమయ్యే తెలుగు భాషలో రామాయణము, భారతము, భాగవతము, పురాణములు మొదలగు కధలు చెప్పుతూఉండేవారు. మధ్యమధ్యలో కొన్ని నీరసమగు కధల్ని కూడా చక్కగా చెప్పటానికి ప్రయత్నించేవారు. కానీ పిల్లలు వరుసగాఒక్కొక్కరే ఆవులింతలు ప్రారంభించినప్పుడు వాళ్ళను తోటలోనికి పంపేవారు. అక్కడ రకరకాల పండ్ల చెట్లున్నాయి శాలురు ఆకాశం ఎగిరిపోయేట్లు కేకలువేస్తూ కోతులవలె చెటమీాదకు ఎగప్రాకేవారు బిల్వాణుడు సంతోషంగా వారి అల్లరిని చూస్తూ ఉండేవాడు.

బిల్వాణుడు ఎక్కడివాడో, అతడు ఎవరో ఎవరికీ తెలియదు. అతడు బ్రాహ్మణుడే, కానీ అతడు జందెమును తీసివేశాడు బలులు మొదలగు వాటిని ఆపివేసి అతడు ఒక కొత్త పద్ధతి ప్రకారము దేవీపూజ ప్రారంభించాడు మొట్టమొదట ఈ విషయంలో ప్రజలు అతనిని అనుమానించారు. వ్యతిరేకించారు. కానీ బిల్వాణుడు ప్రశాంతంగా వాటన్నిటినీ సహించాడు. రానురాను ప్రజలకు అతనిమీాద నమ్మకం కుదిరింది.

బిల్వాణుడు ఇంటింటికీ వెళ్ళి అందరితోనూ మాట్లాడేవాడు. అందరి క్షేమసమాచారాలు అడిగేవాడు. రోగులకు అతడు మందులు యిచ్చేవాడు మంత్రించినట్లు వారిరోగాలు తగ్గిపోయేవి సుఖదుఃఖాలన్నింటిలో అతడు ప్రజల అభిప్రాయం ప్రకారం నడుచుకునేవాడు అతడు ఒక తగాదాను గురించి తీర్పు చెప్పినప్పుడుగానీ, ఒక విషయాన్ని గురించి అతడు ఏదైనా చెపితేగానీ ఎవరూ అతనిని కాదని మాట్లాడేవారు కాదు.

# 30

ఆ సంవత్సరము త్రిపురాలో ఇంతకు ముందెన్నడూ జరుగని సంఘటన ఒకటి జరిగింది ఉత్తరదిశనుంచి గుంపులు గుంపులుగా ఎలుకలు త్రిపుర పొలాలలో ప్రవేశించాయి. పొలాలలోని పంటనేగాక అవి రైతుల ఇళ్ళలో ఉన్న ధాన్యాన్ని సైతం తినేశాయి. రాజ్యమంతటా హాహాకారాలు చెలరేగాయి. చూస్తూ ఉండగానే కరువు వచ్చింది. కంద మూలాలు తిని ప్రజలు జీవితం గడుపుకోసాగారు అడవుల కేమీ తక్కువ లేవు అడవులలో తినటానికి ఏవో ఒకటి లభించేవి. జంతువుల మాంసం కూడా చాలా ప్రియమై పోయింది. ప్రజలు అడవి దున్నలను, లేళ్ళను, కుందేళ్ళను, ఉడుతలను, అడవిపందులను, పెద్దపెద్ద తాబేళ్ళను వేటాడి తినసాగారు. ఏనుగులు దొరికినప్పుడు వాటినికూడతినసాగారు. కొండశిలువ మొదలగు సర్పాల మాంసమును కూడా తింటున్నారు. అడవిలో తినటానికి కావలసినన్ని పక్షులుకూడా

దొరుకుతూ ఉండేవి చెట్లతొర్రలలో తేనెపట్టెలు లభించేవి. అక్కడక్కడ నదులకు అడ్డుకట్టలువేసి కొన్నిరకాల లతలను నీళ్ళలో వేసినట్లయితే చేపలు చచ్చి పైకి తేలుతూ ఉండేవి. వాటిని పట్టి తింటూ, మిగిలినవాటిని ఎండబెట్టి దాచుకుంటూ ఉండేవారు ఏదో ఒక విధంగా ఆకలితీరుతూ ఉండేది కానీ అందుకు ఎంతో ప్రయత్నించాల్సి వచ్చేది ఎక్కడచూచినా దొంగతనాలు, దోపిడీలు ప్రారంభమయ్యాయి. ప్రజలలో తిరుగుబాటు తత్త్వం ప్రబలింది

"బలుల్ని నిషేధించినందుకు భువనేశ్వరిమాత శపించింది అందుకే ఈ అనర్థాలన్నీ జరుగుతున్నాయి" అని ప్రజలు అనుకోసాగారు పూజారి బిల్వాణుడు వారి మాటల్ని నవ్వుతూ త్రోసిపుచ్చేవాడు కైలాసపర్వతం మీద కార్తికేయుడు, గణేశుడు అన్నదమ్ములిద్దరూ పంచుకున్నారు కార్తికేయుని మయూరానికి వ్యతిరేకంగా గణేశుని ఎలుకలు త్రిపురాలోని త్రిపురేశ్వరునికి ఫిర్యాదు చేసుకోటానికి వచ్చాయని పూజారి నవ్వులాటకు అనేవాడు. ప్రజలు ఈ మాటను పరిహాసంగా తలచలేదు. బిల్వాణుడు చెప్పిన విధంగానే ఎలుకలు ప్రవాహంగా ఎంత అకస్మాత్తుగావచ్చాయో అంత అకస్మాత్తుగా పొలములను నాశనం చేసి మాయమై పోయాయి. మూడురోజులకే వాటి ఆనవాలు కూడా కన్పించలేదు. పూజారిగారు మహావిజ్ఞాని అని అందరూ విశ్వసించసాగారు. ఇప్పుడు వారిని గురించి ఇంతకు ముందున్న అనుమానాలు ఎవరికీ లేవు కైలాసంలో అన్నదమ్ముల ఎడబాటును గురించి అనేక పాటలు ప్రచారంలోకి వచ్చాయి ఆకాల

గోపాలం అందరూ ఆ పాటలేపాడసాగారు. వీధుల్లోనూ, నదీ తీరాన, ఒకచోట అని ఏమిటి, ఎక్కడ ఎవరినోట విన్నా ఆ పాటలే

కానీ మహారాజు గోవిందమాణిక్యుని యందుమాత్రం ప్రజలకు ద్వేషభావం పూర్తిగా పోలేదు పూజారి బిల్వాణుని అభిప్రాయాన్ననుసరించి మహారాజుగారు క్షామ పీడితులగు ప్రజలు ఈ సంవత్సరము శిస్తుకట్టనవసరములేదని ప్రకటించారు దానివల్ల కొంతమేలుజరిగింది. కానీ అప్పటికీ పజలు భువనేశ్వరిమాత శాపాన్ని తప్పించుకోటానికి చట్టగ్రామ్ మొదలగు పర్వత ప్రాంతాలకు పారిపోయారు. రానురాను మహారాజుగారికి కూడా ఇలాంటి సందేహమే కలుగసాగింది.

వారు బిల్వాణుని పిలిపించి "పూజారిగారూ! మహారాజు చేసిన పాపానికి ప్రజలు అనేక కష్టాలనుభవిస్తున్నారు. బలిని నిషేధించటం వల్ల నేను పాపం 'చేశానంటారా? ఈ అనర్థాలన్నీ అందుకు శిక్షా?" అని అడిగారు

బిల్వాణుడు మహారాజుగారి మాటల్ని త్రోసిపుచ్చాడు. "మహారాజా, బలుల్ని మీరు నిషేధించకపూర్వం అనేక వేల నరబలులు జరిగేవి. ఈ క్షామ సమయంలో అప్పటికంటె ఎక్కువమంది చనిపోయారా ?" అని అన్నాడు.

మహారాజుగారు జవాబు చెప్పలేకపోయారు, కాని వారి మనసులోని సందేహం మాత్రం తీరలేదు. 'ప్రజలు మహారాజుగారంటే అసంతృప్తిగా ఉన్నారు, వారిని అనుమానిస్తున్నారు'—ఈ కారణంవల్ల వారి హృదయం తీవ్రంగా గాయపడింది, అంతేగాక మహారాజుగారికి తమలో తమకే

సందేహం కలుగసాగింది "ఇదంతా నాకేమీ అర్థం కావటం లేదు" అన్నారు మహారాజుగారు.

"ఇందులో తెలియవలసిన అవసరంమాత్రం ఏముంది ! ఇన్ని ఎలుకలువచ్చి పంటల్ని ఎందుకు పాడుచేశాయి - ఇది తెలియనందువల్ల వచ్చేనష్టం ఏమీలేదు. మీ మనసులో ఈ సంకల్పం ఉంటే అదేచాలు తరువాత ఈ పరమేశ్వరుడు తన పని తాను చేస్తాడు, అతడు ఏదిచేసినా మనతో చెప్పిచేయడు గదా !" అని చెప్పాడు బిల్వాణుడు

"పూజారిగారూ, మీరు ఇంటింటికీ తిరిగి ఏదో ఒక పనిచేస్తూనే ఉన్నారు ప్రజలకు మీరు ఎంతమేలు చేస్తున్నారో మీకు అంత సత్ఫలితం లభిస్తూఉంది-ఈ ఆనందంలో మీలోని సందేహాలు తీరిపోతున్నాయి నేను రాత్రింబవళ్ళు ఒక కిరీటాన్ని నెత్తిమీద ధరించి సింహాసనంమీద కూర్చుంటున్నాను. అనేక విచారాలు నా నెత్తిమీద మోస్తున్నాను. మీపనినిచూసి నాకు ఈర్ష్యకలుగుతుంది" అన్నారు మహారాజుగారు.

"మహారాజా, నేను తమరిలో ఒక అంశాన్ని. తమరు ఆ సింహాసనంమీద లేనట్లయితే నేను ఇవన్నీ చేయగలనా ! తమరు నేను కలిస్తేనే పరిపూర్ణం అవుతాము "

ఈమాట అని బిల్వాణుడు మహారాజుగారివద్ద శలవు తీసుకొని వెళ్ళిపోయాడు. మహారాజుగారు కిరీటము ధరించి ఆలోచిస్తూ కూర్చున్నారు. వారు తమలోతాము ఇలా ఆలోచించుకోసాగారు—

"నేను చేయవలసిన పనులు చాలా ఉన్నాయి. కానీ, నేనేమీ చేయటంలేదు. నేను నా స్వవిషయం మాత్రమే చూచుకొని నిశ్చింతగా ఉంటున్నాను. అందుకనే ప్రజల విశ్వాసాన్ని చూరగొనలేక పోతున్నాను నేను రాజ్యము చేయతగిన రాజునుకాను."

# 31

ముగలు సైన్యానికి నాయకత్వం వహించి నక్షత్ర రాయలు మార్గమధ్యమందు తేంతుల అను చిన్న గ్రామంలో విశ్రాంతి తీసుకొంటున్నాడు. ఉదయం రఘుపతి అతని వద్దకు వచ్చి "మహారాజా, మనం బయలుదేరాలి, ప్రయాణానికి సిద్ధంకండి" అని అన్నాడు.

అకస్మాత్తుగా రఘుపతి నోటినుంచి మహారాజు అనే మాట అతనికి చాలా మధురంగా కన్పించింది నక్షత్ర రాయలు సంతోషంగాలేచి కూర్చున్నాడు అతడు వూహా లోకంలో లీనమై ఈ ప్రపంచంలోని ప్రజలందరూ తనను 'మహారాజు' అని పిలుస్తున్నట్లు భావించసాగాడు. ఉన్నత మైన త్రిపుర సింహాసనాన్ని అధిష్ఠించినట్లు తనలో తాను కలలుగనసాగాడు. తనలోతాను ఆనందపడుతూ అతడు ఇలా అన్నాడు—"పూజారిగారూ, నేను మిమ్మల్ని ఏపరిస్థితుల్లోనూ వదలను. మీరు మా సభలోనే ఉండాలి మీరు ఏదికోరితే అది మాతో చెప్పండి."

నక్షత్రరాయలు తన మనస్సులో అప్పటికప్పుడు రఘుపతికి ఒక పెద్ద జాగీరును ఇచ్చివేశాడు.

"నేనేమీ కోరటంలేదు" అని అన్నాడు రఘుపతి.

"అలా ఎందుకని? అలా వీల్లేదు, పూజారిగారూ! మీరు ఏదో ఒకటి కోరుకోవాల్సిందే. కైలాసరపరగణాను మీకు ఇచ్చివేస్తున్నాను. కావాలంటే ఇప్పుడే మీరు వ్రాత కోతలు పూర్తిచేసుకోండి."

"అవన్నీ తరువాత చూచుకుందాం"

"మళ్ళీ తరువాత ఎందుకు? నేను ఇప్పుడే మీకు ఇచ్చివేస్తాను కైలాసర పరగణా అంతా నేటినుండి మీదే. మీరు నాకు ఒకపైసా కప్పముకూడా ఇవ్వనవసరంలేదు." ఈమాట అని నక్షత్రరాయలు తలపైకెత్తి ఠీవిగా కూర్చున్నాడు.

"చనిపోవటానికి ఆరడుగుల నేలలభిస్తే అదేసంతోషం. నాకు మరేమీ అవసరంలేదు" అనిచెప్పి రఘుపతి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

అతనికి జయసింహుడు గుర్తొచ్చాడు. జయసింహుడు జీవించి ఉంటే ఏదోఒకటి బహుమానంగా తీసుకునేవాడే. జయసింహుడే లేనప్పుడు అతనికి ఈ రాజ్యం ఇచ్చినా తృణ ప్రాయంగా కన్పిస్తుంది.

నక్షత్రరాయల మనస్సులో రాజ్యకాంక్షను రేకెత్తిం చాలని ప్రస్తుతం రఘుపతి చాలా ప్రయత్నిస్తున్నాడు. తాను చేసిన ఈ ప్రయత్నాలన్నీ వ్యర్థమౌతాయేమోననీ, దుర్బల హృదయుడగు నక్షత్రరాయలు త్రిపుర చేరిన తరువాత యుద్ధం చేయకుండా మహారాజుగారివద్దకు వెళ్ళి లొంగిపోతాడేమో

నని అతనిభయం. కానీ ఒకసారి దుర్బల హృదయంలో రాజ్యా కాంక్ష కలిగితే తరువాత భయపడాల్సిన అవసరం ఉండదు.

రఘుపతి ఇప్పుడు నక్షత్రరాయల్ని తిరస్కారంగా మాట్లాడటంలేదు. పైగా మాటమాటకు అతనిని చాలా గౌరవిస్తున్నాడు. ప్రతి విషయంలోనూ అతడు నక్షత్ర రాయలను అడిగి అనుమతి పొందుతున్నాడు. ముగలు సైన్యము నక్షత్రరాయల్ని 'మహారాజు' అని పిలుస్తుంది. అతనిని చూడగానే సైనికులు హడావుడిపడుతూ లేచి నిలబడేవారు. గాలి వీచినప్పుడు సస్యములు తలవంచిన విధంగా నక్షత్ర రాయలువచ్చి నిలబడగానే ముగలుసైనికులందరూ బారులు తీరి తలలువంచి నమస్కరించేవారు సైన్యాధిపతికూడా సగౌర వంగా అతనికి నమస్కరించేవాడు. అనేకవందల విచ్చుకత్తుల తళతళలమధ్య ఏనుగుమీద బంగారు అంబారిలో రాజఠీవితో నక్షత్రరాయులు ప్రయాణం చేసేవాడు వెంట ఉత్తేజాన్ని కలిగించేవాయిద్యాలు వినిపించేవి. సైనికులు రాజపతాకాన్ని సగర్వంగా పట్టుకొని ముందునడిచేవారు. నక్షత్రరాయలు గ్రామాలలోనుంచి వెళుతూ ఉన్నప్పుడు సైనికులను చూచి భయపడి గ్రామాలప్రజలు పారిపోతూ ఉండేవారు. వారి భయాన్నిచూచి నక్షత్రరాయల మనస్సులో చాలా గర్వం కలిగేది. 'దిగ్విజయం పొందుతూ ముందుకు సాగిపోతున్నాను' అని అతడు తనలో అనుకునేవాడు. చిన్నచిన్న జమీందారులు కానుకలు తెచ్చి నమస్కరించి వెళ్ళేవారు. వాళ్ళందరూ అతనికి పరాజితులైన రాజులవలె కన్పించేవారు. పూర్వము

దిగ్విజయము పొందిన పాండవుల భారతకథ అతని మనస్సులో మెదిలింది

ఒకనాడు సైనికులు నక్షత్రరాయల వద్దకువచ్చి నమస్కరించి ఇలా చెప్పారు–"మహారాజా! మేము తమకోసం మా ప్రాణాలు అర్పించటానికికూడా సిద్ధంగా ఉన్నాము. మేము ప్రాణాలను లెక్కచేయము. మేము యుద్ధానికి బయలుదేరి వెళ్ళినప్పుడు దారిలో కన్పించిన గ్రామాలను దోచుకోవటం పూర్వంనుంచీ వస్తున్న ఆచారము. ఏ శాస్త్రములోనూ ఇది దోషమనిలేదు."

నక్షత్రరాయలు ఠీవిగా తల ఆడిస్తూ "నిజమే, నిజమే!" అన్నాడు.

"కానీ పూజారిగారు గ్రామాలను దోచుకోవద్దని మమ్మల్ని హెచ్చరించారు. మేము యుద్ధంలో ప్రాణాలు అర్పించటానికి బయలుదేరి వెళుతున్నాం. అలాంటప్పుడు ఒక్క గ్రామాన్నికూడా దోచుకోకుండా వెళ్ళటం చాలా అన్యాయం" అని సైనికులు విన్నవించారు.

నక్షత్రరాయలు మళ్ళీ తల ఆడిస్తూ "అవునవును, నిజమే!" అన్నాడు.

"మహారాజుగారి అనుమతి లభిస్తే పూజారిగారి మాటను లెక్కచేయకుండా మేము గ్రామాలను దోచుకుంటాం."

"మిమ్మల్ని శాసించటానికి ఆ బ్రాహ్మణుడు ఎవరు? బ్రాహ్మణులకు రాజనీతి ఏం తెలుస్తుంది! మీరు నిరాటం

కంగా గ్రామాలను దోచుకోవచ్చునని మేము అనుమతి స్తున్నాం” అని నక్షత్రరాయలు సగర్వంగా చెప్పాడు.

ఈమాట చెప్పి అతడు నలువైపుల జాగ్రత్తగా పరిశీ లించి చూచాడు. ఆ చుట్టుపట్ల ఎక్కడా రఘుపతి లేకపోవటం చూచి నిశ్చింతగా ఉన్నాడు

కానీ ఇంత గట్టిగా రఘుపతి ఆజ్ఞను వ్యతిరేకించి అతడు లోలోపల చాలా సంతోషించాడు. 'తనలో సామర్థ్యం ఉంది, అనే మత్తు మద్యమువలె అతని నరనరాన ప్రవహిస్తూ ఉంది అతడు ఈ ప్రపంచాన్ని నూత్న దృష్టితో చూడ సాగాడు వ్యూహాలోకంలో విహరిస్తున్న అతనికి ఈ ప్రపంచం చిన్న మబ్బువలె అదృశ్యమైనట్లు కన్పించింది మధ్య మధ్య రఘుపతి కూడా లేనట్లే కన్పించసాగింది అకస్మాత్తుగా అత నికి గోవిందమాణిక్యుని మీద చాలా కోపం వచ్చింది అతడు తనలో తాను ఇలా అనుకోసాగాడు- నన్ను, దేశంనుంచి, బహి ష్కరించటమా? సామాన్యునివలె నన్ను కూడా న్యాయస్థానా నికి పిలిపించి విచారించటమా? ఎవరిని ఎవరు బహిష్కరిస్తారో ఈసారి చూస్తాను! ఈసారి నక్షత్రరాయల శక్తిసామర్థ్యా లేమిటో త్రిపుర ప్రజలకు కూడా తెలుస్తాయి.” ఈ విధంగా ఆలోచించి నక్షత్రరాయలు లోలోపల సంతోషం పట్టలేక పోతున్నాడు

నిర్దోషులగు గ్రామప్రజలను అనవసరంగా దోచుకో వటం రఘుపతికి ఎంతమాత్రం ఇష్టంలేదు. అందుకు అతడు పూర్తిగా వ్యతిరేకి దీనిని ఆపటానికి అతడెన్నోవిధాల ప్రయ త్నించాడు. నక్షత్రరాయల అనుమతిని పొందిన తరువాత

సైనికులు రఘుపతిని ఎగతాళిచేశారు. చివరికి రఘుపతి నక్షత్ర రాయలవద్దకు వెళ్ళి "నిస్సహాయులగు గ్రామప్రజలను హింసించటం ఎందుకు?" అని అడిగాడు.

"పూజారిగారూ, ఈ విషయాలు మీకు అర్థంకావు యుద్ధసమయంలో సైనికుల్ని దోపిడీలు చేయనివ్వకుండా శాసించి వారిని నిరుత్సాహపరచకూడదు."

నక్షత్రరాయల మాటవిని రఘుపతికి చాలా విస్మయం కలిగింది. అకస్మాత్తుగా తాను అధికుడననే అభిమానం అతనిలో కలగటం చూచి రఘుపతి లోలోపల నవ్వుకున్నాడు.

'ఇప్పుడు గ్రామాలను దోచుకోటానికి అనుమ సే తరువాత వీళ్ళను అదుపులో పెట్టటం కష్టమవుతుంది వీళ్ళు త్రిపురను కూడా దోచుకుంటారు" అని అన్నాడు రఘుపతి.

"అందువల్ల నష్టమేముంది? మేము కోరుతున్నదికూడా అదే. నక్షత్రరాయల్ని బహిష్కరించినందుకు ఫలితంఏమిటో త్రిపురకూడా తెలుసుకుంటుంది. పూజారిగారూ, ఈ విషయాలు మీకు అర్థంకావు మీరు ఎప్పుడూ యుద్ధంచేసి ఎరుగరు!"

రఘుపతి మనసులో చాలా సంతోషించాడు ఎదురు జవాబు చెప్పకుండా అతడు అక్కడనుంచి వెళ్ళిపోయాడు. నక్షత్రరాయలు తన చేతి కీలుబొమ్మ కాకుండా స్వయంశక్తి గల మనిషి కావాలనే అతని అభిలాష.

## 32

త్రిపురలో ఎలుకలవల్ల పంటలకు ప్రమాదం ఏర్పడింది శ్రావణమాసంలో. అప్పటికి మొక్కజొన్నమాత్రం కంకులు

వేసింది. మిగిలిన పొలాలలోనూ, పర్వత ప్రాంతపు భూమి లోనూ పైరు ఈనవెూఫులోఉంది మూడు మాసాలు ఏదోవిధంగా గడచిపోయాయి మార్గశిరమాసంలో పర్వత ప్రాంతపు భూములు కోతకు వచ్చేసరికి ప్రజలలో సంతోషం వ్యాపించింది స్త్రీలు, పురుషులు, యువకులు, వృద్ధులు ఆబాలగోపాలం కొడవళ్ళు పట్టుకొని పొలాలకు బయలు దేరారు. 'ఏయ్! ఓహోయ్!' అంటూ ఒకరినొకరు కేకలు వేస్తూ పిలుస్తున్నారు. రైతు స్త్రీల పాటలు ఆ చుట్టుపట్ల మైదాన ప్రాంతంలో ప్రతిధ్వనిస్తున్నాయి మహారాజుగారియం దున్న అసంతృప్తి తొలగిపోయింది రాజ్యంలో ప్రశాంతత నెలకొంది అదేసమయాన నక్షత్రరాయలు రాజ్యాన్ని ఆక్ర మించుకొనుటకు సైన్యసమేతంగా దండెత్తి వచ్చాడనీ, సరి హద్దు గ్రామాలలో నిస్సహాయులగు ప్రజలను దోచుకుంటూ గ్రామాలను తగులబెడుతున్నట్లు వార్తలు చేరాయి. ఈ వార్త వినగానే ప్రజలందరూ భయపడసాగారు.

ఈ వార్త మహారాజుగారి హృదయంలో శూలము వలె నాటింది రోజంతా ఈ విషయం వారిని బాధిస్తూ ఉంది. నక్షత్రరాయలు తనమీద దండెత్తి వచ్చాడనే విషయం మాటిమాటికి వారికి కొత్తగా కన్పించసాగింది. నక్షత్రరాయల అందమైన ముఖాన్ని వారు ప్రేమదృష్టితో తమ కళ్ళ ఎదుట చూడసాగారు. "నక్షత్రరాయలు ఎంతో సైన్యాన్ని సమకూర్చుకొని, తానూ కత్తిబట్టి దండెత్తి వచ్చాడు. ఒక్క సైనికుడు లేకుండా నేను ఒంటరిగా యుద్ధ

రంగానికి వెళ్ళి నక్షత్రరాయల సైనికుల కత్తులను తన వక్షస్థలంమీద భరించాలి" అని వారు ఆలోచించేవారు

వారు ధ్రువుని ఎత్తుకొని "నువ్వుకూడా ఈ కిరీటం కోసం నాతో యుద్ధం చేయగలవా!" అని ప్రశ్నిస్తూ కిరీటాన్ని తీసి దూరంగా విసరి వేశారు. దానిలోనుంచి ఒక ముత్యం వూడిరాలిపోయింది

ధ్రువుడు తత్పరతతో "నేను తీసుకుంటాను" అన్నాడు చేతులుచాస్తూ.

మహారాజుగారు కిరీటాన్ని ధ్రువుని శిరముమీద ఉంచి "ఇదుగో, నువ్వేతీసుకో నేనెవరితోనూ పోట్లాడను" అని అతనినిగట్టిగా తమ హృదయానికి హత్తుకున్నారు.

తరువాత రోజటతా "ఇది నా పాపానికి ప్రతిఫలం" అనుకొని మనసులోతర్కించుకోసాగారు. లేకపోతే సోదరుడు సోదరుని మీద దండెత్తలేడు. ఇది నిజంగా పాపఫలమే ఇలాంటి ఆలోచనతో వారికి కొంతతృప్తి కలిగింది ఇది పరమేశ్వరుని నిర్ణయం. పరమేశ్వరుని ఆదేశం వచ్చింది. క్షుద్ర నక్షత్రరాయలు మానవరూపంలో భగవంతుని ఆదేశానికి ప్రతిరూపమే. దానిని ఉల్లంఘించలేము అని ఆలోచించి గోవిందమాణిక్యునికి శాంతి లభించింది. పాప ఫలాన్ని అనుభవించటానికి వారు సిద్ధంగా ఉన్నారు. దానివల్ల నక్షత్ర రాయల పాపభారం కొంతతగ్గిపోతుందని వారి ఉద్దేశ్యం.

ఇంతలో బిల్వాణుడు ప్రవేశించి "మహారాజా, ఇది ఆకాశంవంక చూస్తూ ఆలోచించ వలసిన సమయం కాదు." అని అన్నాడు.

"పూజారిగారూ, ఇదంతా మా పాపఫలితమే."

"తమ మాటలు వింటూవుంటే నాకు చాలా ఆశ్చర్యం కలుగుతూ ఉంది. దుఃఖము పాప ఫలితమని ఎవరంటారు? ఇది పుణ్యఫలితం కూడా కావచ్చును ఎందరో మహాత్ములు తమ జీవితమంతా అనేకకష్టాలు అనుభవించ లేదా?"

మహారాజుగారు ఏమీ జవాబు చెప్ప లేకపోయారు.

"ఇదంతా జరగటానికి మహారాజుగారు చేసిన పాపం ఏమిటి?" అని అన్నాడు బిల్వణుడు.

"మా సోదరుడు నక్షత్రరాయల్ని దేశంనుంచి బహిష్కరించాను" అని అన్నారు మహారాజుగారు.

"మీరు బహిష్కరించినది మీ సోదరునికాదు, ఒక అపరాధిని బహిష్కరించారు."

"అపరాధి అయినప్పటికీ సోదరునిని బహిష్కరించటం పాపమే. ఆ పాపంనుంచి విముక్తిలేదు. కౌరవులు దుర్మార్గులైనప్పటికీ పాండవులు వారిని సంహరించి రాజ్యసుఖాలను అనుభవించ లేకపోయారు. వారు యజ్ఞంచేసి పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకున్నారు కౌరవుల్నిచంపి పాండవులు రాజ్యాన్ని తీసుకోగలిగినమాట నిజమే, కానీ కౌరవులు మరణించికూడా పాండవుల రాజ్యాన్ని లాక్కున్నారు. నేను నక్షత్రరాయల్ని బహిష్కరించాను, ఇప్పుడు నక్షత్రరాయలు నన్ను బహిష్కరించటానికి వచ్చాడు."

"పాండవులు అపరాధానికి శిక్ష విధించే దృష్టితో కౌరవులతో యుద్ధం చేయలేదు. రాజ్యకాంక్షతో మాత్రమే వారు యుద్ధం చేశారు. కాని మహారాజుగారు అపరాధానికి

తగిన దండన విధించటం కోసమే తమ సుఖదుఃఖాలనుకూడా లెక్క చేయకుండా న్యాయానుసారం నడుచుకున్నారు ఇందులో నాకేమీ పాపం కన్పించటములేదు. అయినప్పటికీ దానికి ప్రాయశ్చిత్తమార్గం చెప్పటానికి నాకెలాంటి అభ్యంతరమూ లేదు నేను బ్రాహ్మణుడను మీ సమక్షంలోనే ఉన్నానుకదా! నన్ను సంతృప్తి పర్చటమే దీనికి ప్రాయశ్చిత్తమవుతుంది."

మహారాజుగారు చిరునవ్వునవ్వి మౌనం వహించారు

"ఏది ఏమైనప్పటికీ మీరు యుద్ధానికి ఏర్పాట్లు చేయండి ఇంక ఏమాత్రం జాగుచేయకండి" అని బిల్వాణుడు చెప్పాడు

"నేను యుద్ధం చేయను" అన్నారు మహారాజుగారు.

"అదెలా కుదురుతుంది ? మీరు ఇంతలో ఆలోచించుకోండి, నేనీలోపల సైన్యాన్ని సిద్ధపర్చే ప్రయత్నం చేస్తాను. ఇది పంటలుకోసే తరుణం, అందరూ పొలాలలో ఉన్నారు. తగినంత సైన్యాన్ని సమకూర్చటం కష్టమే."

ఈమాట అని బిల్వాణుడు రాజుగారి జవాబుకోసం ఎదురు చూడకుండానే వెళ్ళిపోయాడు.

ధ్రువుడు ఏమి ఆలోచించాడో ఏమో అకస్మాత్తుగా మహారాజుగారివద్దకువచ్చి వారిముఖంలోకి చూస్తూ "పెదనాన్న ఏడి ?" అని అడిగాడు. ధ్రువుడు నక్షత్రరాయల్ని 'పెదనాన్న' అని పిలిచేవాడు

"నాయనా, పెదనాన్న వచ్చారు !" అన్నారు మహారాజుగారు అశ్రునయనాలతో.

# 33

పూజారి బిల్వాణునిమీద ఇప్పుడు చాలా బాధ్యత పడింది. అతడు చట్టగ్రామపు పర్వతప్రదేశాలకు అనేక కానుకలనిచ్చి దూతను పంపారు కుకిసేనల సహాయాన్ని అర్థిస్తూ కుకిగ్రామ నాయకుని వద్దకు వర్తమానం పంపాడు. యుద్ధం పేరు వినగానే వారు ఆనందంతో గంతులు వేయసాగారు. కుకిజాతి నాయకుడు ఎర్రరంగు వస్త్రంలో కత్తిని చుట్టి దూతద్వారా అన్ని గ్రామాలకు యుద్ధసూచనపంపాడు. తమ నాయకుని సూచన అందగానే కుకిసైనికులు ప్రవాహం వలె చట్టగ్రామ పర్వతాలు దాటి త్రిపురలోని పర్వతాల మీదికి చేరుకున్నారు. వారిని నియమబద్ధంగా ఆపి ఉంచటం చాలా కష్టమైనపని.

బిల్వాణుడు తాను స్వయంగా బయలుదేరి గ్రామ గ్రామానికి వెళ్ళి రైతుయువకుల్ని యుద్ధానికి సన్నద్ధం చేస్తున్నాడు. తామే ముందుకు వెళ్ళి ముగలు సైన్యాన్ని ఎదిరించటం బిల్వాణునికి యుక్తియుక్తంగా కన్పించలేదు. శత్రువులు సమతల ప్రదేశాన్ని దాటి దుర్గమ పర్వత ప్రదేశానికి చేరుకోగానే అకస్మాత్తుగా అడవులలోనుంచి పర్వతాలలోని రహస్య ప్రదేశాలనుంచి శత్రువులమీద దాడి చేయాలని బిల్వాణుడు నిశ్చయించాడు. పెద్దపెద్ద రాళ్ళను తెచ్చి గోమతినదీప్రవాహాన్ని ఆపివేశారు. శత్రువును ఎదిరించటం కష్టమని తోచినప్పుడు ఆ రాళ్ళను తొలగించి

ముగలు సైన్యాన్ని ప్రవాహంలో ముంచెత్త వచ్చునని అతని ఆలోచన

ఇటు నక్షత్రరాయలు గ్రామాలను దోచుకుంటూ త్రిపుర సమీపంలోని పర్వత ప్రాంతానికి చేరుకున్నాడు. అప్పటికి కోతపనులు ముగిశాయి రైతులుకూడా కాగడాల తోనూ, విల్లనంబులతోనూ యుద్ధానికి సిద్ధమయ్యారు. పొంగులెత్తుతూ వేగంగా ప్రవహించే నదీ ప్రవాహంలాంటి కుకీ సైనికుల్ని ఆపి ఉంచటం చాలా కష్టంగా ఉంది

"నేను యుద్ధం చేయను" అన్నారు గోవింద మాణిక్య ప్రభువు.

"అది వ్యర్థ నిర్ణయం" అన్నాడు బిల్వాణుడు

"నేను రాజ్యపాలనకు తగను. అందుకు అనేక నిదర్శ నాలు కన్పించాయి. అందుకే ప్రజలకుకూడా మాయందు విశ్వాసం తగ్గిపోయింది. క్షామము, ఇప్పుడు సంభవించిన ఈ యుద్ధమూ అదే తెలియజేస్తున్నాయి. నన్ను రాజ్యము వదలి వెళ్ళిపొమ్మనుటకు ఇది భగవంతుని ఆదేశము."

"ఇది ఎంతమాత్రం భగవంతుని ఆదేశం కాదు భగ వంతుడు మీకు రాజ్యభారాన్ని అప్పగించాడు. నిర్విఘ్నంగా సాగినంతకాలం మీరు సునాయాసంగా ఆ కర్తవ్యాన్ని పాలించారు. రాజ్యపాలన కఠినంగా కన్పించేసరికి మీరు దానిని వదిలించుకొని స్వేచ్ఛపొందాలని చూస్తున్నారు, భగవంతుని ఆదేశమనే పేరుతో మిమ్మల్ని మీరు మోస గించుకొని సుఖపడాలనుకొంటున్నారు."

బిల్వాణుడు అన్న ఈమాట గోవిందమాణిక్య ప్రభు వుకు శూలమువలె గుచ్చుకుంది. అందుకేమీ జవాబు చెప్ప లేక కాస్సేపు వారుమౌనంగా కూర్చున్నారు. చివరికి మహారాజుగారు భయపడుతూ "పూజారిగారూ, నేను ఓడి పోయి నక్షత్రరాయలు నన్ను చంపి మహారాజు అగ్యాడని అనుకోండి" అని అన్నాడు

"నిజంగా అలాంటిదే గనుక జరిగితే నేను మహారాజు గారిని గురించి విచారపడను. కానీ మహారాజుగారు తమ కర్తవ్యాన్ని మరచి పారిపోయినప్పుడే నాకు చాల బాధ కలుగుతుంది" అని అన్నాడు పూజారి బిల్వాణుడు.

"నా సోదరునితో నేను యుద్ధం చేయాలంటారా?"

"కర్తవ్యపాలనలో అన్నదమ్ములనీ, బంధుమిత్రులనీ వివక్ష లేదు. కురుక్షేత్ర యుద్ధంలో శ్రీకృష్ణభగవానుడు అర్జు నునికి చెప్పిన ఉపదేశాలను ఒకసారి గుర్తు తెచ్చుకోండి,"

"పూజారిగారూ, నేనీ చేతితో కత్తిపట్టి నక్షత్ర రాయల్ని సంహరించాలనే మీరు చెపుతున్నారా?"

"అవును"

అకస్మాత్తుగా ధ్రువుడు అక్కడికివచ్చి అత్యంత గంభీ రంగా "ఛీ! అలాంటిమాట అనకూడదు" అని అన్నాడు.

ధ్రువుడు ఆటఆడుకొంటూ ఉన్నాడు. వారిద్దరి సంభా షణవిని అతడు వాళ్ళుపోట్లాడుకుంటున్నారేమోనని అభిప్రాయ పడ్డాడు అందుకని సమయానుసారంగా ఇద్దరినీ మందలించటం మంచిదని ఆలోచించి అకస్మాత్తుగా తల ఆడిస్తూ "ఛీ! అలా మాట్లాడకూడదు" అని అన్నాడు.

పూజారికి చాలా ఆనందం కలిగింది. అతడు నవ్వుతూ ధ్రువుని ఎత్తుకొని ముద్దాడసాగారు కానీ మహారాజుగారు నవ్వలేదు. బాలుని నోటినుంచి తాను దైవవాణి విన్నానని మహారాజుగారు ఆలోచించారు

"పూజారిగారూ, నేనీ రక్తపాతం జరగనివ్వను నేను యుద్ధం చేయను" అని దృఢనిశ్చయంతో అన్నారు మహారాజుగారు

పూజారి బిల్వాణుడు కొద్దిక్షణాలవరకు ఏమీ మాట్లాడ లేదు. చివరికి అతడు మహారాజగారితో "మహారాజా, యుద్ధం చేయుట తమకు సమ్మతం కానట్లయితే మరొకపని చేయండి తమరు నక్షత్రరాయల్ని కలుసుకొని వారిని యుద్ధం చేయకుండా ఆపండి" అని చెప్పాడు

"ఆ పని మాకు సమ్మతమే"

"ఈ విధంగా తమ నిర్ణయాన్ని వ్రాసి నక్షత్రరాయల వద్దకువర్తమానం పంపాలి."

చివరికి ఆ విధంగా చేయుటానికే నిశ్చయించారు.

# 34

నక్షత్రరాయలు తన సైన్యంతో ముందుకుసాగాడు. ఎక్కడా కొంచెముకూడా ఇబ్బంది కలుగలేదు. అతడు ప్రవేశించిన గ్రామాలలోని ప్రజలు అతనిని మహారాజుగా అంగీకరించసాగారు. అడుగడుగునా అతనికి రాజత్వపుఘనత లభించసాగింది. అతని భ్రమ మరింత హెచ్చింది- 'చుట్టూఉన్న ఈ విశాలమైన భూమి, గ్రామాలు, పర్వతశ్రేణులు, ఈ నదులు

అన్నీ తనవేననే' భావం హెచ్చుటయేగాక అహంకారముకూడా పెరిగింది ముగలు సైనికులు ఏదికోరినా వెంటనే వారికది లభించేది- మహారాజు హోదాలో దానపత్రం వ్రాసి ఇచ్చేవాడు. 'ఇదంతానాదే, వీళ్ళు నా దేశంలోకి వచ్చారు. వీళ్ళకు సర్వసుఖాలు లభించాలి. ఎవరికీ ఏమీ ఇబ్బందికలుగ కూడదు. వాళ్ళు తమ దేశానికి తిరిగి వెళ్ళిన తరువాత తనను ప్రశంశిస్తారు. త్రిపుర మహారాజుగారు చాలా గొప్పవారు అని చెప్పుకుంటారు.' ఈ విధంగా ఆలోచించి ముగలు సైనికుల ప్రశంసలు పొందటానికని అతడు వాళ్ళ కోర్కెలు తీర్చటానికి సిద్ధంగా ఉండేవాడు. వాళ్ళకోర్కెల్ని నిరాకరిస్తే తరువాత తనను గురించి ఎక్కడ నిందాపూర్వకంగా మాట్లాడతారోనని ఎప్పుడూ భయపడుతూ ఉండేవాడు.

రఘుపతి అతని వద్దకువచ్చి "యుద్ధపు ఏర్పాట్లేమీ కన్పించటంలేదే?" అని అన్నాడు.

"లేదు పూజారిగారూ! భయపడిపోయారు" అని నక్షత్రరాయలు బిగ్గరగా నవ్వసాగాడు.

నవ్వటానికి తగినంత కారణం లేకపోయినప్పటికీ రఘుపతికూడా నవ్వాడు.

"నక్షత్రరాయలంటే సామాన్య మనుకున్నారా, నవాబుగారి సైన్యాన్ని వెంటబెట్టుకొని వచ్చాడు" అని నక్షత్రరాయలు రఘుపతితో అన్నాడు.

"ఈసారి ఎవరిని ఎవరు బహిష్కరిస్తారో చూడాలి! ఏమంటారు? అన్నాడు రఘుపతి.

"నేను నా ఇష్టప్రకారం శిక్షవిధించవచ్చు, దేశంనుంచి బహిష్కరించవచ్చు, కారాగృహంలో బంధించవచ్చు, లేదా మరణదండన కూడా విధించగలను. ఏమి శిక్ష విధించాలో ఇప్పుడేమీ నిర్ణయించుకోలేకపోతున్నాను"

ఈమాట అని నక్షత్రరాయలు అనేక విధాల ఆలోచించసాగాడు

"ఇప్పుడు ఆ విషయాన్ని గురించి ఆలోచించటం ఎందుకు, మహారాజా! ఆలోచించే సమయం ముందుంది. గోవిందమాణిక్యుడు యుద్ధం చేయకుండానే మిమ్మల్ని ఓడిస్తాడని నా భయం" అన్నాడు రఘుపతి

"అదెలా సాధ్యపడుతుంది?" అని అడిగాడు నక్షత్రరాయలు.

"గోవిందమాణిక్యుడు సైన్యాన్ని దాచివేసి ఎంతో భ్రాతృప్రేమను నటిస్తాడు. ఒకసారి మిమ్మల్ని కౌగలించుకొని 'నా ముద్దుల తమ్ముడూ, ఇంటికి వెళదాం, రా! పాలు అన్నం తింటావా!' అని నాలుగు మాయమాటలు మాట్లాడేసరికి మీరు కంటనీరు పెట్టుకొని 'చిత్తం! వెంటనే బయలుదేరి వస్తాను, ఆలస్యం చేయను' అంటూ అన్నగారి వెనుక తలవంచుకొని పెంపుడు గుర్రంమాదిరి వెళ్ళిపోతారు. మొగలు చక్రవర్తిగారి సైనికులు ఈ తమాషా చూచి నవ్వుకుంటూ తిరిగి వెళ్ళిపోతారు"

రఘుపతి మాటల్లోని తీవ్రమైన వ్యంగ్యాన్ని విని నక్షత్రరాయలు చలించాడు. నవ్వటానికి వృధా ప్రయాసపడుతూ "నన్ను మరీ పాలుత్రాగే పసిబాలుడనుకొంటు

న్నారా ? వారేదో బుజ్జగి_స్తే వెళ్ళటానికి నేను అమాయకు డను కాదు. అలాంటిపని జరుగదు, పూజారిగారూ! మీరే చూస్తారు" అని అన్నాడు.

ఆరోజునే గోవిందమాణిక్యుని వద్దనుంచి జాబువచ్చింది. రఘుపతి ఆ జాబును తెరిచి చదివాడు. గోవిందమాణిక్యుడు తమ్మునియందు ప్రేమ కనబరుస్తూ ఒకసారి కలుసుకోవాలని కోరాడు అతడు జాబును నక్షత్రరాయలుకు చూపించలేదు. అతడు జాబు తెచ్చిన దూతతో ఈ విధంగా చెప్పిపంపాడు—

"గోవిందమాణిక్యుడు శ్రమపడి ఇంతదూరం రానవ సరం లేదు. నక్షత్రరాయ మహారాజుగారు సైన్యసమేతంగా యుద్ధరంగంలోనే వారిని కలుసుకుంటారు. తమ్ముని ఎడబాటు వల్ల గోవిందమాణిక్యుడు ఇంకెంతో కాలం దుఃఖపడనవసరం లేదు. ఎనిమిది సంవత్సరాలు దేశబహిష్కరణ శిక్షననుభ వి_స్తే దీర్ఘకాలపు ఎడబాటు అసలే భరించలేరు."

తరువాత రఘుపతి నక్షత్రరాయలవద్దకు వెళ్ళి "దేశం నుంచి వెళ్ళగొట్టిన తనతమ్మునియందు అత్యంత ప్రేమాను రాగాలు వ్యక్తంచేస్తూ గోవిందమాణిక్యుడు ఒక జాబు వ్రాశాడు" అని చెప్పాడు

నక్షత్రరాయలు చాలా నిర్లక్ష్యంగానవ్వి "నిజంగానా? ఏదీ ఆ ఉత్తరం, చూద్దాం, ఇలా ఇవ్వండి" అని చెయ్యి చాచాడు.

"ఆ జాబును మహారాజుగారికి చూపించటం అనవసర మని భావించి అప్పుడే చించి పారేశాను. యుద్ధం తప్ప మేము చెప్పే మరొక సమాధానం లేదని చెప్పిపంపాను."

నక్షత్రరాయలు నవ్వుతూ "మంచిపని చేశారు, పూజారిగారూ! యుద్ధం తప్ప మేము చెప్పేదేమీ లేదని మీరు మంచి సమాధానమే చెప్పిపంపారు" అని అన్నాడు.

"గోవిందమాణిక్యుడు ఈ సమాధానం విన్న తరువాత దేశంనుంచి బహిష్కరిస్తూ నేను శిక్షవిధించినప్పుడు మా తమ్ముడు సునాయాసంగా వెళ్ళిపోయాడు, కానీ ఆ తమ్ముడే తిరిగివస్తూ చాలా అలజడి కలిగించాడు అని ఆలోచిస్తాడు."

"తమ ఇష్టం వచ్చినప్పుడు బహిష్కరించటానికి మళ్ళీ తాము కోరినప్పుడు పిలిపించటానికి నక్షత్రరాయలు సామాన్యమైన మనిషికాదని తెలుసుకుంటారు ఇలాంటి నాటకాలు ఇకసాగవు" అని అన్నాడు నక్షత్రాలు

ఈ మాట అని నక్షత్రరాయలు అమితానందంతో మళ్ళీ నవ్వసాగాడు.

# 35

నక్షత్రరాయలు చెప్పిపంపిన సమాధానంవిని గోవింద మాణిక్యుని హృదయం తీవ్రంగా గాయపడింది. ఈసారి మహారాజుగారు యుద్ధం చేయటానికి అభ్యంతరం చెప్పరని బిల్వణుడు మనస్సులో అనుకున్నాడు. కానీ గోవిందమాణిక్యుడు "నక్షత్రరాయలు ఇలాంటి జవాబు ఎప్పుడూ చెప్పడు. ఇదంతా ఆ పూజారి చెప్పి పంపినదే. నక్షత్రరాయలు నోటినుంచి ఇలాంటి జవాబు వస్తుందంటే నేను నమ్మలేను" అని అన్నారు.

"మహారాజా, ఇప్పుడు మీరేమి ఆలోచించారు!" అని అడిగాడు బిల్వణుడు.

"ఏవిధంగానైనాసరే నేను ఒకసారి నక్షత్రరాయల్ని కలుసుకోగలిగితే అన్నీ చక్కబడతాయి."

"కలుసుకోవటం సాధ్యంకాకపోతే?"

"సాధ్యంకానప్పుడు నేను రాజ్యంవదలి వెళ్ళిపోతాను."

"అయితే, నేను కూడా ఒకసారి ప్రయత్నించి చూస్తాను."

నక్షత్రరాయల డేరా పర్వతంమీద ఉంది దట్టమైన అడవి- చిక్కని వెదురు పొదలతో నిండి ఉంది అడవి ఏనుగులు వెళ్ళేమార్గంగుండా సైనికులు పర్వతంమీదికి వెళ్ళారు. సూర్యుడు పడమటి కొండలచాటున దాక్కుంటున్నాడు తూర్పువైపున అంధకారం వ్యాపించింది. దట్టమైన చెట్ల నీడ వల్ల సూర్యుడు అస్తమించక పూర్వమే అక్కడ సాయంత్రమయినట్టుంది శీతాకాలపు సాయంత్రం భూమిలోనుంచి పొగమంచువంటి ఆవిరి వస్తూవుంది. కీచురాళ్ళధ్వని నిశ్శబ్దంగా ఉన్న అడవిలో ప్రతిధ్వనిస్తూ ఉంది.

బిల్వణుడు నక్షత్రరాయల డేరావద్దకు చేరుకొనేసరికి సూర్యుడు అస్తమించాడు కానీ పశ్చిమాకాశంలో బంగారు రంగు కాంతి ఇంకా కనపడుతూనే వుంది. పడమటి దిక్కున సమతల ముసుగుమీద బంగారు కాంతిపడి మెరిసిపోయే దట్టమైన అరణ్యం ప్రశాంతంగాఉన్న పచ్చని సముద్రంవలె కన్పిస్తూ ఉంది. సైన్యం రేపు దండయాత్రకు బయలుదేరుతుంది. రఘుపతి కొద్ది సైన్యాన్ని, సైన్యాధిపతిని వెంటబెట్టుకొని మార్గం చూచి వచ్చుటకు బయలుదేరి వెళ్ళాడు. ఇంతవరకు ఇంకా అతడు తిరిగి రాలేదు. రఘుపతి లేని సమయాల్లో

నక్షత్రరాయల వద్దకు ఎవరూ వెళ్ళకూడదని ఆజ్ఞాపించినప్పటికీ సన్యాసి వేషంలో ఉన్న బిల్వణుని ఎవరూ ఆటంకపర్చలేదు.

బిల్వణుడు నక్షత్రరాయల వద్దకు వెళ్ళి "గోవింద మాణిక్య మహారాజుగారు తమకు ఈ జాబు పంపారు" అని చెప్పాడు.

ఈ మాట అని బిల్వణుడు ఉత్తరమును నక్షత్రరాయల చేతికిచ్చాడు. నక్షత్రరాయలు వణుకుతున్న చేతులతో ఉత్తరాన్ని అందుకున్నాడు. దానిని తెరిచి చూడటానికి అతనికి సిగ్గుగానూ, భయంగానూ ఉంది. గోవిందమాణిక్యునికి అతనికి మధ్య రఘుపతి అడ్డుగా నిలబడి ఉన్నంతవరకు నక్షత్రరాయలు చాలా నిశ్చింతగా ఉండేవాడు గోవిందమాణిక్యుని చూడటం తనకు ఇష్టంలేదన్నట్లే అతడు వ్యవహరించేవాడు. గోవిందమాణిక్యుని దూత అకస్మాత్తుగా వచ్చి తన ఎదుట నిలబడేసరికి అతడు చాలా సంధిగ్ధావస్థలోపడిపోయాడు. అతని మనస్సులో కొంత అసంతృప్తికూడా కలిగింది. రఘుపతిఉంటే ఈదూతను తన వద్దకు రానిచ్చేవాడుకాదని కూడా అతడుఆలోచించాడు. మనస్సులో చాలా సంకోచపడుతూనే అతడు ఉత్తరాని తెరిచాడు ఆఉత్తరములోఎలాంటి తిరస్కారభావమూలేదు గోవిందమాణిక్యుడు అతనిని నిందిస్తూ ఉత్తరంలో ఒక్క మాట కూడా వ్రాయలేదు. వారు తనతమ్ముని ఎదుట కొంచెము కూడా గర్వాన్ని ప్రదర్శించలేదు. నక్షత్రరాయలు సైన్యసమేతుడై తన మీద దండెత్తివచ్చిన విషయాన్ని కూడా వారు ఉత్తరంలో ప్రస్తావించలేదు. పూర్వం అన్నదమ్ముల మధ్య

ఎలాంటి ప్రేమభావం ఉండేదో ఇప్పుడు కూడా వారు ఆ భావాన్నే వ్యక్తపరిచారు. అయినప్పటికీ ఉత్తరములో గంభీరమగు స్నేహవాత్సల్యము, విషాదభావము మిళితమై ఉన్నాయి దానిలో ఏ విషయమూ స్పష్టంగా వ్యక్తం కానందువల్ల నక్షత్రరాయల హృదయంలో చాలా బాధ కలిగింది.

ఉత్తరం చదువుతూ చదువుతూ క్రమంగా అతని ముఖభావాలు మారసాగాయి. అతని హృదయంమీద పడి వున్న శిలా ఆవరణ క్షణకాలంలో తొలగిపోయింది. ఉత్తరము అతని కంపిత హస్తాలలో వణక సాగింది. అతడు ఆ జాబును చాలా సేపటివరకు తన ముఖం మీద ఉంచుకున్నాడు. ఆ జాబులోని అన్నగారి ఆశీర్వాదం చల్లని సెల యేటి ప్రవాహంవలె అతని జ్వలిత హృదయంలో ప్రవహించ సాగింది. చాలా సేపటికి అతడు స్థిమితపడి పడమటి దిక్కున దూరంగా అరుణ కాంతిపడి మెరిసే పచ్చని అడవిని రెప్పవేయకుండా చూస్తూ కూర్చున్నాడు. నల్దిశల నిస్తబ్ద సంధ్య ఆకాశాన్నంటుతూ, నిశ్శబ్దమగు ప్రశాంత సముద్రంవలె ఉంది. క్రమంగా అతని నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి. అకస్మాత్తుగా సిగ్గుతోనూ, పశ్చాత్తాపంతోనూ నక్షత్రరాయలు రెండు చేతులతో ముఖాన్ని కప్పుకొన్నాడు.

అతడు ఏడుస్తూ "అన్నా, నాకు రాజ్యం అవసరం లేదు నా అపరాధాలన్నీ క్షమించి నన్ను మీ వద్దనేఉండ నివ్వండి మరెప్పుడూ మీ నుంచి వేరుచేయవద్దు" అని అన్నాడు.

బిల్వాణుడు ఏమీ మాట్లాడలేదు. మెదలకుండా చూస్తూ కూర్చున్నాడు. చివరికి నక్షత్రరాయలు స్థిమితపడగానే "యువరాజా! గోవిందమాణిక్య ప్రభువు మీ కొరకు ఎదురుచూస్తూ కూర్చున్నారు. మీరిక ఆలస్యం చేయవద్దు" అని అన్నాడు బిల్వాణుడు అతనితో.

"వారునన్ను క్షమిస్తారా?" అని అడిగాడు నక్షత్రరాయలు.

"యువరాజుయందు వారికి ఎలాంటి కోపమూలేదు పొద్దుపోతే దారిలో చాలా ఇబ్బంది పడాలి. త్వరగా మీరు గుర్రాన్నెక్కి బయలుదేరండి. పర్వతం క్రింద మహారాజుగారి అనుచరులు నిరీక్షిస్తున్నారు."

"నేను రహస్యంగా బయలుదేరి వస్తాను. సైనికులతో చెప్పనవసరంలేదు. ఇక ఒక్క క్షణంకూడా ఆలస్యం చేయటం మంచిదికాదు. ఎంతత్వరగా ఇక్కడినుంచి వెళ్ళగలిగితే అంత మంచిది" అని అన్నాడు నక్షత్రరాయలు.

"యువరాజుగారు చెప్పినది నిజమే!"

"ఈ సన్యాసివెంట మూడుశిఖరాల కొండమీదికి పూజకు వెళుతున్నాను" అని నక్షత్ర రాయలు గుర్రాన్నెక్కి బిల్వాణునివెంట బయలుదేరాడు. సేవకులు వెంటబయలుదేరారు కానీ అతడు వారిని తనవెంట రావద్దని చెప్పాడు.

వాళ్ళిద్దరూ ఇటు బయటకు వచ్చేసరికి గుర్రాలు వస్తున్న చప్పుడు, సైనికుల కోలాహలం వినిపించాయి. నక్షత్రరాయలు చాలా కలవరపడ్డాడు. కొద్ది క్షణాలలో రఘుపతి సైన్యసమేతంగా తిరిగివచ్చాడు ఆశ్చర్యపడుతూ

నక్షత్రరాయల్ని చూచి "మహారాజా, ఎక్కడికి వెళు తున్నారు?" అని అడిగాడు. నక్షత్రరాయలు ఏమీ జవాబు చెప్పలేక పోయాడు.

నక్షత్రరాయలు మెదలకుండా ఉండటంచూచి "యువ రాజుగారు గోవిందమాణిక్య ప్రభువును కలుసుకొనుటకు వెళుతున్నారు" అని బిల్వాణుడు జవాబు చెప్పాడు.

రఘుపతి బిల్వాణునిని ఒకసారి నఖశిఖ పర్యంతం చూచాడు. ముఖం చిట్లించి, తనను తాను నిగ్రహించుకొని రఘుపతి ఇలా అన్నాడు—"ఇవాళ ఈ సమయంలో మేము మహారాజుగారిని మీ వెంట పంపలేము ఇందులో గాబరా పడాల్సిందేమీ లేదు. రేపు ఉదయం ఎలాగో బయలుదేరాలి ఏమంటారు, మహారాజా?"

నక్షత్రరాయలు నెమ్మదిగా "రేపు ఉదయమే వెళ తాను ఇవాళ చీకటిపడిందిగదా!" అని అన్నాడు.

బిల్వాణుడు నిరాశచెంది ఆరాత్రికి అక్కడే గడిపాడు. మర్నాడు ఉదయం అతడు నక్షత్రరాయల వద్దకు వెళ్ళటానికి ప్రయత్నించాడు కానీ సైనికులు అతనిని వెళ్ళకుండా ఆపి వేశారు. నలువైపులా కాపలాఉంది నక్షత్రరాయల్ని కలుసు కునే అవకాశం లభించనేలేదు చివరికి బిల్వాణుడు రఘుపతి వద్దకు వెళ్ళి "బయలుదేరటానికి సమయమయింది. యువ రాజుగారికి తెలియజేయండి" అని చెప్పాడు.

"మహారాజుగారు బయలుదేరవద్దని నిశ్చయించు కున్నారు" అని చెప్పాడు రఘుపతి.

"నేనోకసారి యువరాజుగారిని కలుసుకోవాలను కొంటున్నాను."

"వీలుపడదు-అనే వారు చెప్పారు."

"గోవిందమాణిక్య మహారాజుగారి ఉత్తరానికి జవాబు కావాలి."

"ఉత్తరానికి ఇంతకుముందు ఒకసారి సమాధానం చెప్పారు"

"నేను వారిద్వారా ఆ జవాబు వినాలి."

"అందుకు ఏమీ అవకాశం లేదు."

ప్రయత్నించటం నిరర్థకమని బిల్వాణుడు గ్రహించాడు. అనవసర ప్రయాసతప్ప ఏమీ ప్రయోజనం ఉండదు. వెళ్ళే ముందు అతడు రఘుపతితో "బ్రాహ్మణ మహాశయా! మీరెందుకు ఇలా! సర్వనాశనానికి ప్రయత్నిస్తున్నారు? ఇది బ్రాహ్మణుడు చేయతగిన పనిగాదు!" అని అన్నాడు.

## 36

బిల్వాణుడు తిరిగి వచ్చేలోపల మహారాజుగారు కొందరు సైనికుల్ని పంపివేశారు. వాళ్ళు రాజ్యంలో దుండగాలు ప్రారంభించారు. మహారాజుగారు సైనికుల్ని తమ ఇష్టానికి వదలివేశారు, యుద్ధప్రయత్నాలన్నీ ఇంచుమించు విరమించు కున్నారు. బిల్వాణుడు తిరిగివచ్చి జరిగినదంతా మహారాజు గారితో చెప్పాడు.

"అలా అయితే, నేను శలవుతీసుకుంటాను. పూజారి గారూ! నక్షత్రరాయలకే ఈ రాజ్యాన్ని, ధనసంపదలు వదలి నేను వెళ్ళిపోతున్నాను" అన్నారు మహారాజుగారు.

"నిస్సహాయులగు ప్రజల్ని పరులకు అప్పగించి తమరు పారిపోతారా—ఈ విషయంలో నేను మనస్సాక్షిగా తమకు నేను అనుమతి నివ్వలేను. మహారాజా, తల్లి తన సంతాన భారాన్ని తగ్గించుకొనుటకు తన బిడ్డలను సవతి తల్లికి అప్ప గించి సంతోషిస్తుందని ఆలోచిస్తున్నారా?"

"పూజారిగారూ, మీ మాటలు శూలములవలె నా హృదయంలో గుచ్చుకొంటున్నాయి. కానీ ఈసారికి మమ్మల్ని క్షమించండి నన్ను మీరిక ఏమీ అనవద్దు నా నిర్ణయాన్ని మార్చటానికి ప్రయత్నించకండి. ఇక జీవితంలో మరెప్పుడూ రక్తపాతం చేయనని మనస్సులో సంకల్పించు కున్నాను. ఆ సంకల్పాన్ని వదులుకోలేను"

"అయితే, ఇప్పుడు మహారాజుగారు ఏమిచేయాలని నిర్ణయించుకున్నారు?"

"నేను చేయదలచిందేమిటో చెప్తాను, వినండి. ధ్రువుని వెంటతీసుకొని నేను అడవికి వెళతాను. పూజారి గారూ! నా జీవితం అసంపూర్తిగా మిగిలిపోయింది. ఆలో చించినదేమీ చేయలేక పోయాను. గడచిపోయిన జీవిత భాగాన్ని తిరిగి నూతన్న పద్ధతిలో నిర్మించుకోలేను. పూజారి గారూ! ఎవరో అదృశ్యవ్యక్తి నన్ను బాణంవలె ఎక్కుపెట్టి వదులుతున్నట్లుంది. ఏమాత్రము గురితప్పినా తరువాత లక్ష్య ప్రయత్నించినా లక్ష్యాన్ని చేరుకోలేనట్లే కన్పిస్తుంది. జీవిత ప్రారంభంలోనే నేను లక్ష్యాన్ని తప్పాను. శేషజీవితంలో ఆ లక్ష్యాన్ని చేరుకోలేక పోతున్నాను. ఆలోచించినది జరగటం లేదు. మేల్కొని ఆత్మరక్షణ చేసుకోవలసిన సమ

యంలో మేల్కొనలేక పోయాను అంతా మునిగిన తరువాత మెలకువ వచ్చింది. అగాధ సముద్రంలో మునిగే మనిషికి కర్రముక్క సహాయం లభించినట్లే నేను బాలుడు ధ్రువునిని ఆసరగా పట్టుకున్నాను. నేను ధ్రువునిలోనే సంతృప్తిచెంది ధ్రువుని రూపంలోనే పునర్జన్మ పొందుతాను నేను ప్రారంభం నుంచే ధ్రువునిని మనిషిగా తయారుచేస్తాను ధ్రువునితో పాటు నేనుకూడా కొంచెము కొంచెముగా వృద్ధిచెందుతాను. ఈ విధంగా నేను నా మానవజీవితాన్ని పరిపూర్ణం చేసుకుంటాను పూజారిగారూ! నేను సంపూర్ణమైన మనిషినే కానప్పుడు మహారాజుగా ఏం చేస్తాను?''

మిగిలిన మాటలు మహారాజుగారు చాలా ఆవేశంతో మాట్లాడారు వారి మాటలువిని ధ్రువుడు తలను వారి మోకాళ్ళకు రుద్దుతూ "నేనే రాజును!" అని అన్నాడు.

బిల్వాణుడు నవ్వి అతనిని ఎత్తుకున్నాడు చాలా సేపటివరకు ఆ బాలుని ముఖంలోకి చూస్తూ ఉండి చివరికి మహారాజుగారితో "అడవిలోకూడా మనుష్యుల్ని తయారు చేయవచ్చునా? అడవిలో చెట్టుచేమ మొదలగునవి మాత్రమే పుడుతూ వుంటాయి. మనిషి, మానవ సమాజంలోనే పుట్టి పెరుగుతాడు'' అని అన్నాడు.

"నేను పూర్తిగా వనవాసిగా ఉండను మానవ సమాజానికి కొంతదూరంగా ఉంటాను. అయినా అటు నాసమాజం నుంచి సంబంధాలు త్రెంచుకోను అదీ కొంతకాలం వరకు మాత్రమే'' అని మహారాజుగారు జవాబు చెప్పారు.

ఇటు నక్షత్రరాయలు సైన్యసమేతంగా రాజధాని చేరుకున్నాడు. ప్రజల ధనధాన్యాలు దోచుకోసాగారు ప్రజలు గోవిందమాణిక్య ప్రభువునే నిందించసాగారు. ఇదంతా మహా రాజుగారు చేసిన పాప ఫలితమేనని ప్రజలు చెప్పుకోసాగారు.

మహారాజుగారు ఒకసారి రఘుపతిని కలుసుకో గోరు తున్నారు. రఘుపతి రాగానే వారు అతనితో "ఇంకా ఎందుకు ప్రజల్ని హింసిస్తున్నారు? నేను నక్షత్రరాయలకు రాజ్యాన్నిచ్చివేసి వెళ్ళిపోతున్నాను. ముగలు సైన్యాన్ని తిరిగి పంపివేయండి" అని చెప్పారు

"చిత్తం, అలాగే! తమరు వెళ్ళిపోగానే ముగలు సైన్యాన్ని పంపివేస్తాను సైనికులు త్రిపురను దోచుకోవటం నాకు కూడా ఇష్టంలేదు" అన్నాడు రఘుపతి.

మహారాజుగారు ఆరోజునే రాజ్యాన్ని వదలివెళ్ళటానికి సిద్ధమయ్యారు. తమ రాజవేషాన్ని తీసివేశారు, కాషాయ వస్త్రాలు ధరించారు నక్షత్రరాయలుకు రాజు కర్తవ్యాలను గురించి తెలియజేస్తూ, అతనిని ఆశీర్వదిస్తూ ఒక ఉత్తరం వ్రాశారు.

చివరికి మహారాజుగారు ధ్రువునిని ఎత్తుకొని "ధ్రువా, నా వెంట అడవికి వస్తావా?" అని అడిగారు.

ధ్రువుడు మహారాజుగారి మెడను కౌగలించుకొని "వస్తాను" అన్నాడు.

బాలుని తనవెంట తీసుకొని వెళ్ళుటకు అతని పినతండ్రి కేదారేశ్వరుని అనుమతి కావాలనే విషయం అకస్మాత్తుగా వారికి గుర్తొచ్చింది. కేదారేశ్వరునిని పిలిపించి మహారాజు

గారు అతనితో "కేదారేశ్వరా, నీ అనుమతి పొంది నేను ధ్రువునిని నా వెంట తీసుకు వెళతాను" అని అన్నారు

ధ్రువుడు రాత్రింబవళ్ళు ఎప్పుడూ మహారాజుగారివద్దనే ఉండేవాడు అందువల్ల బాలునికిపినతండ్రితో ఎక్కువసంబంధం లేదు. ధ్రువుణ్ణి తమ వెంట తీసుకు వెళ్ళటానికి కేదారేశ్వరుడు అభ్యంతర పెడతాడని మహారాజ గారు ఆలోచించనే లేదు.

మహారాజుగారి మాటలు విని "అందుకు నేను అంగీక రించలేను, మహారాజా!" అన్నాడు అతడు.

ఆమాటవిని రాజుగారికి చాలా ఆశ్చర్యం కలిగింది. అకస్మాత్తుగా వారిమీద పిడుగుపడినట్లయింది. వారు కొద్ది క్షణాలు మౌనంగా ఉండి "కేదారేశ్వరా, నువ్వుకూడా మా వెంట రా" అని అన్నారు.

"లేదు, మహారాజా! నేను అడవులకురాను" అని చెప్పాడు కేదారేశ్వరుడు.

మహారాజుగారు ప్రాధేయపూర్వకంగా "నేను అడవులకు వెళ్ళను. నేను సేవకులు, ధనసంపదలతో పట్టణంలోనే నివసిస్తాను" అని అన్నారు

"నేను దేశాన్నివదలి రాలేను" అన్నాడు కేదారేశ్వరుడు.

మహారాజుగారు ఏమీ మాట్లాడకుండా దీర్ఘంగా నిట్టూర్చారు వారి ఆశలన్నీ కూలిపోయాయి క్షణకాలంలో ఈ ప్రపంచ స్వరూపమే మారిపోయినట్లుంది. ధ్రువుడు ఒక్కడే ఆసుకొంటున్నాడు. మహారాజుగారు చాలాసేపటివరకు అతనిని చూస్తూ అలాగే నిలబడ్డారు కానీ వారి అశ్రునయ

నాలు అతనిని స్పష్టంగా చూడలేకపోయాయి ధ్రువుడు వారి ధోవతిని పట్టిలాగుతూ "ఆడుకుందాం, రా" అని అన్నాడు.

మహారాజుగారి హృదయం పూర్తిగా ద్రవించి కన్నుల్లోకి నీరు వచ్చేసింది అతికష్టంమీద వారు కన్నీటిని ఆపుకున్నారు ముఖం అటు త్రిప్పుకొని "ధ్రువుడు ఇక్కడే ఉంటాడు. నేను ఒక్కడినే వెళతాను" అని తన హృదయంతో అన్నారు మహారాజుగారు శేషజీవితం అనంతమగు ఇసుక ఎడారివలె కన్పించింది క్షణంలో మెరుపు మెరిసి తనవెలుగులో వారికి ఈ విషయాన్ని తెలియజేసినట్లుంది

ధ్రువుని ఆటను పాడుచేస్తూ కేదారేశ్వరుడు "వెళదాం రా!" అంటూ చెయ్యిపట్టుకొని లాగాడు

ధ్రువుడు ఏడుస్తూ "నేను రాను" అన్నాడు.

మహారాజుగారు ఆశ్చర్యపడుతూ ధ్రువుని వైపు తిరిగి చూచారు. ధ్రువుడు పరుగునవచ్చి మహారాజుగారిని గట్టిగా కౌగలించుకొని వారి మోకాళ్ళమధ్య ముఖందాచుకున్నాడు. మహారాజుగారు అతనిని ఎత్తుకొని ద్రవ్యులవుతున్న తన హృదయానికి గట్టిగా హత్తుకున్నారు అతనిని అలాగే కౌగలించుకొని మహారాజుగారు గదిలో పచార్లు చేయసాగారు. ధ్రువుడు వారి భుజం మీద తలపెట్టుకొని ఎంతో ప్రశాంతంగా పడుకున్నాడు.

బయలుదేరాల్సిన సమయమయింది ధ్రువుడు మహారాజుగారి భుజంమీద పడుకొని నిద్రపోయాడు నిద్రపోతున్న ధ్రువుని నెమ్మదిగా కేదారేశ్వరునికి అప్పగించి మహారాజుగారు బయలుదేరారు.

# 37

తూర్పువైపు ద్వారంలో నుంచి సైన్య సమేతుడై నక్షత్రరాయలు రాజధానిలో ప్రవేశించాడు. కొంతధనాన్ని అనేకమంది సేవకుల్ని వెంటతీసుకొని గోవిందమాణిక్యుడు ఇటు పడమటి ద్వారంవైపు బయలుదేరారు నగరప్రజలు మంగళ వాయిద్యాలతో, జయజయ ధ్వానాలతో నక్షత్ర రాయలకు స్వాగతం చెప్పారు. గోవిందమాణిక్యుడు వెళుతున్న మార్గంలో ప్రజలెవ్వరూ వారిని గౌరవించలేదు. మార్గానికి ఇరుపైపులవున్న ఇళ్ళలోని స్త్రీలు మహారాజుగారికి విన్పించేట్లు బిగ్గరగా నిందించసాగారు. ఆకలితో పిల్లలు ఏడుస్తూ ఉంటే ఆ కోపాన్ని కూడా స్త్రీలు మహారాజుగారి మీదనే చూపిస్తున్నారు క్షామము వ్యాపించిన రోజుల్లో మహారాజుగారు స్వహస్తాలతో అన్న వస్త్రాలనిచ్చి ధైర్యం చెప్పిన వృద్ధస్త్రీలు తమ కంపితహస్తాలనెత్తి మహారాజుగారిని శపిస్తున్నారు చిన్నపిల్లలు తమ తల్లులు నేర్పిన ప్రకారము వెక్కిరిస్తూ మహారాజుగారి వెంటపడ్డారు.

ఎటూ తలెత్తి చూడకుండా మహారాజుగారు నెమ్మదిగాముందుకు సాగిపోతున్నారు. అప్పుడేఒకరైతు పొలంనుంచి ఇంటికి తిరిగి వస్తున్నాడు. అతడు మహారాజుగారిని చూచి భక్తిభావంతో వారికి నమస్కరించాడు. మహారాజుగారి హృదయం ద్రవించింది. వారు అతనివద్ద స్నేహపూర్వక కంఠ స్వరంతో శలవు తీసుకున్నారు. వారి ప్రజలందరిలోనూ ఈ రైతు ఒక్కడు మాత్రమే రాజ్యాధికారము పోయిన మహారాజుగారిని భక్తిభావంతో, దుఃఖిత హృదయంతో వీడ్కోలు

చెప్పాడు. మహారాజుగారి వెనుక అల్లరిచేయుపిల్లలను అతడు కసురుకొన్నాడు కానీ మహారాజుగారు అతనిని వారించారు.

చివరికి వారు కేదారేశ్వరుని ఇంటి సమీపానికి వచ్చారు. అప్పుడు వారొకసారి దక్షిణపువైపుకు తిరిగి చూచారు అది శరత్కాలపు ఉదయం. పొగమంచునుచీల్చు కొని అప్పుడప్పుడు సూర్యకిరణాలు దర్శనమిస్తున్నాయి. కేదారేశ్వరుని ఇంటిని చూడగానే మహారాజుగారికి గడచిన ఆషాఢమాసపు ప్రాతఃకాలంగుర్తొచ్చింది. అప్పుడు మబ్బులు దట్టంగాపట్టి వర్షం కురుస్తూఉంది, విదియనాటి క్షీణచంద్రుని వలె బాలిక 'హాసి' స్పృహలేకుండా మంచంమీద ఒత్తిగిలి పడుకొని ఉంది చిన్న 'తాత' ఇదేమీ అర్థంకాక అక్క కొంగును నోట్లోపెట్టుకొని ఆమె ముఖంలోకి చూస్తూకూర్చు న్నాడు మధ్యమధ్య తన సుకుమార హస్తాలతో నెమ్మదిగా అక్కముఖంమీద జోకొడుతున్నాడు. ఈ స్మృతులన్నీ ఒక క్షణకాలం మహారాజుగారి మనస్సులో మెదిలాయి

అకస్మాత్తుగా చిన్నపిల్లల గోల, ఆ గోలలో ఒక మృదుమధుర కంఠస్వరం విన్పించింది. మహారాజుగారు ఆ కంఠస్వరం విన్పించినవైపు చూచారు ధ్రువుడు తపతప అడు గులువేస్తూ నవ్వుతూ మహారాజుగారివేపు చేతులుచాచి పరు గెత్తుకొని వస్తున్నాడు కేదారేశ్వరుడు కొత్త మహారాజు గారికి స్వాగతం చెప్పటానికి వెళ్ళాడు. ఇంటిలో ఒక దాసి ధ్రువుడు మాత్రమే ఉన్నారు. గోవిందమాణిక్యుడు గుర్రాన్ని అపి క్రిందికి దిగారు. ధ్రువుడు కిలకిల నవ్వుతూ మహారాజు గారి మీదికి దూకాడు. అతడు ధోవతిపట్టి లాగి వారి

మోకాళ్ళ మధ్య ముఖాన్ని దాచుకొని ఒక క్షణకాలం ఆ విధంగా ఆనందించిన తరువాత గంభీరంగా "నేను చల్‌చల్ ఎక్కుతాను" అన్నాడు.

మహారాజుగారు అతనిని కూర్చోబెట్టారు గుర్రంమీద కూర్చొని అతడు గట్టిగా మహారాజుగారి మెడను కౌగలించుకొని తన కోమలమగు తన చెక్కిళ్ళను వారి చెక్కిళ్ళకు అదుముకున్నాడు ధృవుని యొక్క చిన్నబుద్ధికి మహారాజుగారిలో ఏదో పరివర్తన కన్పించింది. గాఢనిద్రనుంచి మేల్కొల్పుటకు రకరకాలుగా ప్రయత్నించినట్లుగా ధ్రువుడు వారిని లాగి, కౌగలించుకొని, ముద్దుపెట్టించుకొని మహారాజుగారిని పూర్వపు స్థితికి తేవాలని రకరకాలుగా ప్రయత్నించసాగాడు. చివరకు సఫలత పొందలేక నోట్లో వేలువేసుకొని కూర్చున్నాడు మహారాజుగారు ధ్రువుని అభిప్రాయాన్ని గ్రహించి మాటిమాటికి అతనిని ముద్దుపెట్టుకోసాగారు చివరికి వారు ధ్రువునితో "ధ్రువా, నేనిక వెళతాను" అని చెప్పారు

ధ్రువుడు మహారాజుగారి ముఖంలోకిచూస్తూ "నేనూ వెళతాను" అన్నాడు.

"నువ్వెక్కడికి వెళతావు, నువ్వు బాబాయివద్దఉండు" అన్నారు మహారాజుగారు.

"వద్దు, నేనూ వెళతాను."

అదే సమయాన ఇంటిలోనుంచి ఒక వృద్ధదాసి చిరచిరలాడుతూ, ఏదో గొణుగుతూ అక్కడికి వచ్చింది గట్టిగా ధ్రువుని చెయ్యిపట్టుకొని లాగుతూ "వెళదాం, రా" అని అంది.

ధ్రువుడు భయపడుతూ రెండుచేతులతో మరింత గట్టిగా మహారాజుగారిని కౌగలించుకొని వారి వక్షస్థలంమీద ముఖందాచుకున్నాడు. 'వక్షస్థలంలోని రక్తనాళాలనైనా బయటకులాగి త్రెంచగలను గాని ఈ రెండు సుకుమార హస్తాలను వేరుచేయగలనా?' అని మహారాజుగారు ఆలోచించారు. కానీ వేరుచేయక తప్పదు నెమ్మదిగా ధ్రువుని చేతులను తీసి బలవంతముగా అతనిని ఆ దాసికి అప్పగించారు. ధ్రువుడు బిగ్గరగా ఏడుస్తూ చేతులుచాచి "బాబా, నేనూ వస్తాను" అన్నాడు. మహారాజుగారు వెనుతిరిగి చూడకుండా గబగబ గుర్రానెక్కి ముందుకు సాగారు వారు ఎంత దూరం వెళ్ళినా ధ్రువుని వ్యాకుల ఆక్రందన విన్పిస్తూనేఉంది ధ్రువుడు తన రెండు చేతులు చాచి "బాబా, నేనూ వస్తాను" అని అంటూనే ఉన్నాడు. రాజుగారి ప్రశాంత నయనాలు అశ్రుపూరితాలయ్యాయి. వారికి ముందుదారిగానీ పర్వతాలుగానీ ఏవీకన్పించటంలేదు వారి అశ్రువులచాటున సూర్యునికాంతి. ఈ ప్రపంచము అంతా అదృశ్యమయినట్లుంది. గుర్రము తన ఇష్టప్రకారం పరుగెత్తుతూఉంది.

దారిలో ఒకచోట ముగలు సైనికదళం ఒకటి ఎదురయ్యింది. ముగలు సైనికులు మహారాజుగారిని చూచి నవ్వసాగారు. వారి సేవకులను కవ్వించుతూ మొరటుగా వ్యవహరించసాగారు గుర్రంమీద ఎక్కడికో వెళుతున్న మహారాజుగారి సభాసదుడు ఒకడు ఇది చూచి పరుగు పరుగున అక్కడికి వచ్చి మహారాజుగారితో ఇలా అన్నాడు—

"మహారాజా, ఈ అవమానాన్ని ఇక సహించలేము. మహారాజుగారి ఈ వేషాన్ని చూచి వీరిలా పెచ్చరిలిపోయారు ఇదుగో, ఈ ఖడ్గము తీసుకోండి. మహారాజుగారు కొద్దిక్షణాలు ఆగితే నేను వెళ్ళి నా మనుష్యుల్ని తీసుకువచ్చి ఈ దుర్మార్గులను శిక్షిస్తాను"

అందుకు మహారాజుగారు అతనితో ఇలా అన్నారు- "వద్దు నయనరాయా! నాకు ఖడ్గమువద్దు వీళ్ళు నన్నేమి చేస్తారు. నేను ఇప్పుడు వీరికంటె ఎక్కువ అవమానాన్ని భరించగలను కత్తిపట్టి నేనిప్పుడు ఈ ప్రపంచంలో ప్రజల గౌరవ మర్యాదలు పొందాలనుకోవటం లేదు. ఈ ప్రపంచంలో సామాన్య ప్రజలు మానావమానాలను, సుఖదుఃఖాలను సమ భావంతో భరించినట్లే నేనుకూడా ఆ పరమేశ్వరుని ధ్యానిస్తూ అన్నీ భరిస్తాను.

బంధువులు వ్యతిరేకులయ్యారు. ఆశ్రితజనులు కృతఘ్నులయ్యారు. శరణాగతులు దురుసుగా వ్యవహరిస్తున్నారు. ఒకప్పుడు నాకు ఇవన్నీ దుస్సహంగా ఉండేవే. కానీ ఇప్పుడు వీటిని భరించటమే నాకు ఆనందంగా కన్పిస్తుంది. నాబంధు జనులెవరో నాకు తెలుసు నయన్‌రాయ్, మీరిక వెళ్ళండి నక్షత్రరాయలను ఆదరాభిమానాలతో చూచుకోండి. నన్ను గౌరవించినట్లే నక్షత్రరాయలను కూడా గౌరవించండి."

ఈమాట అని మహారాజుగారు తమ సభాసదుని కౌగలించుకొని అతనివద్దశెలవుతీసుకున్నారు సభాసదుడుమహారాజుగారికి నమస్కరించి కన్నీరు తుడుచుకొంటూ వెళ్ళిపోయాడు.

మహారాజుగారు గోమతినదీ తీరానఉన్న ఎత్తయిన ప్రదేశానికి చేరుకునేసరికి పూజారి బిల్వాణుడు అడవిలోనుంచి వారి ఎదుటకు వచ్చి "మహారాజుగారికి జయమగుగాక!" అని చేతులెత్తి ఆశీర్వదించాడు.

మహారాజుగారు గుర్రంమీదినుంచి దిగి అతనికి నమస్కరించారు

"నేను తమ వద్ద శలవు తీసుకోటానికి వచ్చాను" అన్నాడు బిల్వాణుడు మహారాజుగారితో.

"పూజారిగారూ! మీరు నక్షత్రరాయలవద్దనే ఉండి అతనికి తగిన సలహాలు చెపుతూ రాజ్యపాలన సక్రమమార్గాన నడిపించండి" అని చెప్పారు మహారాజుగారు.

"లేదు, మహారాజా! తమరు మహారాజుగా లేనిచోట నేను చేయకలిగిన పనేమీ ఉండదు. ఇక్కడ ఉంటే నేనేమీ చేయలేను."

"ఎక్కడికి వెళతారు, పూజారిగారూ! మీరు నాయందు దయచూపండి, మీరుదగ్గరఉంటే నా దుర్బల హృదయానికి ఎంతో బలం చేకూరుతుంది."

"నా పని ఎక్కడో, ఆ అన్వేషణలోనే బయలుదేరాను. నేను తమకు దగ్గరగా ఉన్నా, దూరంగావున్నా తమయందు నాకున్న ప్రేమాభిమానము స్థిరంగా ఉంటుందని మాత్రం మర్చిపోకండి."

"అయితే నాకు శలవు ఇప్పించండి" అని మహారాజుగారు బిల్వాణునికి మళ్ళీ నమస్కరించారు.

తరువాత బిల్వాణుడు ఒకవైపుకు, మహారాజుగారు ఒక వైపుకు వెళ్ళిపోయారు.

## 38

నక్షత్రరాయలు ఛత్రమాణిక్యుడనే పేరుతో మహా వైభవంగా రాజసింహాసనాన్ని అధిష్ఠించాడు. ఖజానాలో ధనము చాలా తక్కువగా ఉంది. ప్రజలను దోచుకొని అనుకున్న ప్రకారము మొగలు సైనికులకు డబ్బు ఇచ్చి తిరిగి పంపి వేయవలసి వచ్చింది. ఛత్రమాణిక్యుడు భయంకర క్షామం లోనూ, ఘోర దారిద్ర్యంలోనూ రాజ్యపాలనచేయసాగాడు ఎటుచూచినా శాపనార్థాలే, ఎక్కడ చూచినా అశ్రువర్షమే

గోవింద మాణిక్యుడు కూర్చునే సింహాసనమూ, వారు శయనించినపాన్పు, గోవిందమాణిక్యుని ముఖ్యానుచరులు అనుక్షణంచాటున ఛత్రమాణిక్యుని నిందిస్తున్నట్లేఉంది. క్రమంగా ఛత్రమాణిక్యునికి ఇవన్నీ దుస్సహంగా కన్పించసాగాయి. అతడు తనకెళ్ళఎదుటకన్పించకుండా గోవిందమాణిక్యునిచిహ్నాలన్నీ ఒక్కటొక్కటిగా తుడిచివేయసాగాడు. గోవిందమాణిక్యుడు ఉపయోగించిన వస్తువులను నాశనం చేయటమేగాక వారి అనుచరులను కూడా తొలగించి వేశాడు. అతడుగోవింద మాణిక్యుని పేరు వాసన కూడా సహించలేకుండా ఉన్నాడు. గోవిందమాణిక్యుని గురించి ఏదైనా సంభాషణ వస్తేచాలు వారు తన నుద్దేశించి మాట్లాడుతున్నారని అతడు ఆలోచించేవాడు అందరూ తనను 'మహారాజా' అంటూ తగినంత గౌరవించటంలేదనే అతడు ఎప్పుడూ ఆలోచించేవాడు. అందువల్ల

అతడు కారణంలేకుండానే అకస్మాత్తుగా మండిపడుతూ ఉంటాడు. సభాసదులకు ఇది చాల ఇబ్బందిగా ఉండేది.

అతనికి రాజ్యవ్యవహారాలు ఏమీ తెలియవు. కానీ ఎవరైనా ఆ విషయాలను గురించి సలహా చెప్పినప్పుడు కోప గించుకొని "ఆ మాత్రం మాకు తెలియదా? మమ్మల్ని ఏమీ తెలియని మూర్ఖుడనుకొంటున్నావా?" అనేవాడు.

అతని అనుచరులు, ప్రజలు చాలా అసంతృప్తిగా ఉన్నారు. దీనితో ఛత్రమాణిక్యుడు మరింత కోపోద్రిక్తు డయ్యాడు ప్రజలలోని అసంతృప్తిని మహారాజును అవమా నించటమని అతడు ఆలోచించాడు. దౌర్జన్యంగా భయ పెట్టి ప్రజలనోళ్ళు మూయించాడు దీనితో వారిలో మరింత అసంతృప్తి పెరిగింది రాజ్యమంతా ప్రశాంతంగా నిద్రించుచున్న అర్ధరాత్రివలె మౌనంగాఉంది శాంతమూర్తి యగు నక్షత్రరాయలు ఛత్రమాణిక్యుడవగానే ఇలా వ్యవహ రించటమా—ఇందులో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. దుర్బల హృదయుడగు వ్యక్తి అధికారం లభించినప్పుడు ఈ విధంగా నిర్దయగా, విచ్చలవిడిగా వ్యవహరించటం జరుగు తుంది.

రఘుపతి చేయవలసినపని ముగిసింది ఇంతకు పూర్వం అతని హృదయంలో బలంగా పాతుకొనిపోయి ఉన్న ప్రతీ కార భావం ఇప్పుడులేదు. రానురాను అతని హృదయంలో ప్రతీకారభావం తగ్గిపోయింది. తాను ప్రారంభించిన పనిని పూర్తిచేయటమే అతని ఏకైక లక్ష్యముగా ఉండేది. అనేక విధాల నేర్పుతో అవరోధాలను, ఆపదలను అధిగమించి

రాత్రింబవళ్ళు తన లక్ష్యము చేరుకొనుటలో లీనమై ఒక మాదిరి మత్తులాంటి తృప్తిపొందేవాడు. చివరికి అతడు లక్ష్య సిద్ధి పొందాడు కానీ అతనికి ఎక్కడ సుఖం లభించలేదు

రఘుపతి ఆలయంలోకి వెళ్ళిచూచాడు అక్కడ జను లెవ్వరూ కన్పించలేదు ఆలయం నిర్మానుష్యంగా ఉంది. అక్కడ జయసింహుడు లేడనే విషయం అతనికి తెలుసు కానీ ఆలయంలోనికి వెళ్ళిన తరువాత అక్కడ జయసింహుడు లేడని మరొకసారి అనుకున్నాడు. జయసింహుడు ఉన్నాడని ఒకసారి, అతడు లేడని ఒకసారి రఘుపతి ఆలోచించాడు. ఇంతలో అకస్మాత్తుగా గాలికి తలుపు తెరుచుకొంది అతడు త్రుళ్ళిపడి తలవంచి లోనికి చూచాడు జయసింహుడు లేడు. జయసింహుడు పూర్వం నివసించిన గదిలోనే ఇప్పుడుకూడా ఉన్నాడేమో అనిపించిదతనికి. కానీ, అతడు చాలాసేపటి వరకు ఆ గదిలోకి వెళ్ళలేక పోయాడు. వెళ్ళిచూస్తే జయ సింహుడు ఉండడేమో అని భయపడుతున్నాడు

చివరికి సూర్యుడు అస్తమించే సమయంలో అతడు గదిలోకి వెళ్ళాడు—శూన్యంగా, నిర్జనంగా ఉన్నగది సమాధి భవనంవలె నిశ్చలంగాఉంది. గదిలో ఒకమూల కొయ్యపెట్టె ఒకటిఉంది. ప్రక్కనే జయసింహుని పావుకోళ్ళు మట్టికొట్టు కొని ఉన్నాయి. గోడమీద జయసింహుడు చిత్రించిన కాళీ మాత చిత్రంఉంది. తూర్పువైపు మూల దీపస్తంభం ఉంది. గత సంవత్సరంనుంచి ఆ దీపాన్నెవరూ వెలిగించలేదు. దాని చుట్టూ సాలిగూళ్ళు అల్లుకొని ఉన్నాయి ప్రక్కనే గోడ మీద దీపపు మసి గుర్తు అలాగేఉంది. పైన చెప్పిన వస్తు

వులు తప్ప గదిలో మరేమీలేవు. రఘుపతి గంభీరంగా నిట్టూర్చాడు. శూన్యంగా ఉన్న ఆ గదిలో అతని నిట్టూర్పు ప్రతిధ్వనించింది. రానురాను చీకట్లో మరేమీ కన్పించటం లేదు. మధ్యలో ఒక బల్లి టక్ టక్ మని శబ్దం చేస్తూఉంది. రఘుపతి పెట్టెమీద కూర్చొని కంపించ సాగాడు

ఈ విధంగా అతడు ఈ నిర్జన ప్రదేశంలో ఒక నెల రోజులు గడిపాడు. కానీ రానురాను అలా గడపటం దుర్భర మనిపించింది తన పూజారి వృత్తిని వదులుకోవలసి వచ్చింది. అతడు రాజసభకు వెళ్ళాడు. రాజ్యపాలనలో అతడు జోక్యం కల్పించుకున్నాడు. దురాలోచనలు, దౌర్జన్యము, అరాజకము ఛత్రమాణిక్యుని రూపంలో రాజ్యాన్ని పాలించటం రఘుపతి గమనించాడు. రాజ్యంలో శాంతిని నెలకొల్పాలని అతడు ప్రయత్నించాడు. అతడు ఆ విషయంలో ఛత్రమాణిక్యునికి సలహా చెప్పాడు.

ఛత్రమాణిక్యుడు అతనిమాటలువిని,కోపగించుకొంటూ "పూజారిగారూ! పరిపాలన వ్యవహారాలు మీ కేం తెలుసు? మీకు ఇవేమీ అర్థంకావు" అని అన్నాడు.

నక్షత్రరాయల ప్రతాపాన్నిచూచి రఘుపతి నిశ్చేష్టుడై పోయాడు ఇప్పుడితడు పూర్వపు నక్షత్రరాయలు కాదని గ్రహించాడు. అప్పటినుంచి రఘుపతియందు నక్షత్రరాయలకు ద్వేషభావం ఏర్పడింది. "తానే నన్ను మహారాజునుచేశానని ఈ పూజారి అభిప్రాయం" అని ఆలోచించి ఛత్రమాణిక్యుడు చివరికి అతనిని చూడటానికి కూడా అసహ్యించుకో సాగాడు.

ఆ విషయమే ఒకనాడు ఛత్రమాణిక్యుడు అతనితో చెప్పాడు—"పూజారిగారూ! మీరు వెళ్ళి ఆలయంలో పూజ చేయండి రాజసభలో మీ అవసరం ఏమీ లేదు"

రఘుపతి ఛత్రమాణిక్యుని వైపు మిరిమిరి చూశాడు. ఛత్రమాణిక్యుడు క్షణకాలం నివ్వెరపొంది వెంటనే ముఖం అటు త్రిప్పుకున్నాడు

# 39

నక్షత్రరాయలు నగరంలో ప్రవేశించిన రోజునే కేదారేశ్వరుడు అతనిని కలుసుకొనుటకు వెళ్ళాడు కానీ అతడు ఎంత ప్రయత్నించి నప్పటికీ దర్శనం లభించలేదు. సైనికులు' కాపలా వాళ్ళు అతనిని కసురుకొని దూరంగా నెట్టేశారు' మీదపడి కొట్టబోయారు. చివరికి దెబ్బలు తప్పించుకొని పారిపోయాడు. గోవిందమాణిక్యుని కాలంలో అతడు రాజభోగాల ననుభవిస్తూ రాజభవనంలోనే ఉన్నాడు యువరాజు నక్షత్రరాయల యందు మొదటినుంచి అతనికి చాలా ప్రేమ కొంత కాలానికి రాజభవనం నుంచి బయటకు వచ్చాడు. ఆనాటి నుంచి జీవితము గడవటమే కష్టంగాఉంది. గోవిందమాణిక్య మహారాజుగారి దయ ఉన్నంతకాలం భయపడి అందరూ అతనిని గౌరవించేవారు. కానీ ఇప్పుడెవరూ అతనిని కన్నెత్తి కూడా చూడటంలేదు రాజసభలో ఏదైనా పనివున్నప్పుడు అనేకమంది ఇతని వద్దకువచ్చి కాళ్ళావేళ్లాపడి బ్రతిమాలే వాళ్లు ఇప్పుడు అతడు దారినే వెళుతుంటే ఒకమాట కూడా మాట్లాడటంలేదు అంతేగాక రాను రాను తిండికి కూడా

ఇబ్బంది పడసాగాడు. ఇలాంటి పరిస్థితిలో ఒకసారి రాజదర్శనానికి వెళితే కొంత ప్రయోజనం ఉండవచ్చునని ఆశించాడు. ఒకనాడు ఏవో కొన్ని కానుకలు తీసుకొని ఛత్రమాణిక్యుని దగ్గరానికి వెళ్ళాడు అమిత సంతోషాన్ని వ్యక్తంచేస్తూ అత్యంత స్వామి భక్తితో వినయంగా ఛత్రమాణిక్యుని ఎదుటకు వెళ్ళి నిలబడ్డాడు

"నువ్వు చెప్పదలచిందేమిటో త్వరగా చెప్పి వెళ్ళిపో" అన్నాడు ఛత్రమాణిక్యుడు అతనితో.

తాను ఏమి చెప్పదలచాడో కేదారేశ్వరుడు మర్చిపోయాడు. అతడు ఎంతో శ్రమపడి నక్షత్రమాణిక్యునితో చెప్పటానికి మననం చేసుకుంటూ వచ్చిన చిన్న ఉపన్యాసం కాస్తా లోపలే ఉండి పోయింది.

చివరికి నక్షత్రరాయలు అతనితో "నువ్వు చెప్పదలచిందేమీ లేకపోతే వెళ్ళు" అని అన్నాడు. ఏదో ఒకటి మాట్లాడటం చాలా అవసరమని కేదారేశ్వరుడు ఆలోచించాడు.

అతడు తన ముఖంలోనూ, కళ్ళలోనూ, కంఠస్వరంలోనూ తగుపరిమాణంలో కరుణ రసాన్ని తెచ్చిపెట్టుకొని "మహారాజా! తమరు ధ్రువునిని మర్చిపోయారా?" అని అన్నాడు.

ఛత్రమాణిక్యుడు మిక్కిలి క్రుద్ధుడైచురచురచూచాడు. మూర్ఖుడగు కేదారేశ్వరుడు ఇదేమీ గ్రహించలేదు. "మహారాజా, అతడు తమరిని గురించి 'పెదనాన్న,' 'పెదనాన్న' అంటూ కలవరిస్తూ ఏడుస్తున్నాడు" అని అన్నాడు కేదారేశ్వరుడు.

"నీకు అహంకారం తలకెక్కినట్లుందే? నీ అన్న కుమారుడు నన్ను పెదనాన్న అంటున్నాడా? నువ్వు వాడికి అలా అనమని నేర్పావా?" అన్నాడు ఛత్రమాణిక్యుడు.

కేదారేశ్వరుడు భయపడుతూ చేతులు జోడించి "మహారాజా!" అన్నాడు.

ఛత్రమాణిక్యుడు వెంటనే "ఎవరక్కడ? వీడిని ఈ బాలుడిని తక్షణం దేశంనుండి బహిష్కరించ అని చెప్పాడు

ఆయిదారుగురు భటుల చేతులువచ్చి క్షణంలో కేదారేశ్వరుని భుజాలమీద పడ్డాయి. వెంటనే కేదారేశ్వరుడు బాణంవలె బయటికి దూసుకుపోయాడు భటులు అతని చేతిలోని బుట్టను లాక్కొని దానిలోని పండ్లను అందరూ పంచుకున్నారు. కేదారేశ్వరుడు ధ్రువునిని తీసుకొని ఆ రోజునే త్రిపుర వదలి వెళ్ళిపోయాడు.

# 40

రఘుపతి తిరిగి ఆలయానికి వెళ్ళాడు. అక్కడ అతని కోసం భక్తి ప్రేమలతో ఎదురుచూచే వారెవరూ లేరు. శిలానిర్మితమగు ఆలయం నిశ్చలంగా నిలబడి ఉంది దానిలో హృదయం కొంచెంకూడా లేదు. అతడు మెదలకుండా వెళ్ళి గోమతినదీతీరపు తెల్లని రాతిమెట్లమీద కూర్చున్నాడు. మెట్లప్రక్కనే జయసింహుడు వేసిన పారిజాతపు చెట్టు వికసించిన పుష్పాలతో నిండి ఉంది. ఆ పుష్పాలను చూచి అతనికి జయసింహుని అందమైన ముఖము, అతని నిర్మల హృద

యము, అతని సాశీమగు జీవితము, అతని విశుద్ధమగు ఉన్నత భావాలు స్పష్టంగా రఘుపతి కన్నుల యెదుట మెదల సాగాయి సింహసమానంగా బలము, లేడిపిల్లవలె సుకుమారుడు అగు జయసింహుడు రఘుపతి హృదయంలో ప్రత్యక్షమై అతని హృదయాన్ని వశపర్చుకున్నాడు

ఒకప్పుడు జయసింహునికంటె తాను చాలా గొప్ప వాడినని రఘుపతి అనుకొనేవాడు. కానీ ఈనాడు తనకంటె జయసింహుడే చాలా గొప్పవాడుగా కన్పించసాగాడు. జయసింహునికి తనయందుండిన నిర్మలమగు భక్తిభావముగుర్తొచ్చి రఘుపతి హృదయంలో జయసింహునియందు భక్తిభావమూ, తనపట్ల తిరస్కారభావమూ కలిగాయి. అతనికి తాను చేసిన అన్యాయాలు, అతనిని తాను తిరస్కరించటమూ గుర్తుచేసుకొని రఘుపతి హృదయము ద్రవ్యాలయింది. జయసింహుడ్ని తిరస్కరించు అధికారము తనకు లేదనీ, ఒక క్షణకాలము జయసింహుడు తనకు ప్రత్యక్షము కాగలిగినచో అతని ఎదుట తన హీనతను అంగీకరించి తనను క్షమించవలసిందిగా కోరుకో వచ్చుననిరఘుపతిఆలోచించాడు జయసింహుడు తానుచెప్పిన ప్రకారము ఆచరించాడు. జయసింహుని సంపూర్ణ జీవితం అతని మనస్సులో సాక్షాత్కారించింది. ఈ విధంగా అతని ఆత్మ ఒక మహత్తరమగు జీవిత చరిత్రలో లీనమై విద్వేషమునూ, విరోధభావాన్ని మర్చిపోయాడు.

రఘుపతి వ్యాకులతతో తోటలో పచార్లు చేయసాగాడు ఆలయంలోపల ఉన్న చైతన్యరహితమగు, అకర్మణ్యమగు, కలహ కారణమగు విగ్రహాలయందు అతని మన

స్సులో ద్వేషభావం కలిగింది అతని హృదయం ఆవేశపడు తున్న కొద్దీ, అకర్మణ్యా, చైతన్యరహితమగు ఆ విగ్రహాల సమక్షంలో తాను అకర్మణ్యుడుగా, చైతన్యరహితుడుగాజీవిం చటం అతనికి తుచ్ఛంగా కన్పించసాగింది.

రాత్రి రెండు జాములు ప్రొద్దుపోయిన తరువాత రఘుపతి చెకుముకితో నిప్పుచేసి దీపం వెలిగించాడు అతడు దీపాన్ని చేత్తోపట్టుకొని, పదునాలుగు దేవతా విగ్రహాలున్న ఆలయం లోకి వెళ్లాడు పదునాలుగు దేవతా విగ్రహాలు ఒకేవిధంగా నిలచి ఉన్నాయి గత సంవత్సరము ఆషాఢంలో ఒకనాటి కాళరాత్రి, దీపాల వెలుగులో తన భక్తుని మృత శరీరము ఎదుట, రక్తపుమడుగులో బుద్ధిహీనంగా, హృదయహీనులై నిలచిఉన్నట్లే ఇవాళకూడా ఒకేవిధంగా నిలచివున్నాయి. రఘుపతి గొంతెత్తి ఇలా అరిచాడు- "అబద్ధం! అంతా అబద్ధం! అయ్యో, వత్సా జయసింహా! అమూల్యమగు నీ హృదయరక్తాన్ని ఎవరికి అర్పించావు నాయనా? ఇక్కడ దేవతలు లేరు, దేవతలులేరు. పిశాచియగు రఘుపతే ఆ రక్తాన్ని పానం చేశాడు."

ఈ మాట అని రఘుపతి కాళీ విగ్రహాన్ని రెండు చేతులతో గట్టిగా పట్టుకొని దూరంగా బయటకు విసరివేశాడు. చీకట్లో నదిమెట్లమీదపడిన ఆ విగ్రహము బడబడ దొర్లుతూ గోమతినదిలోకి వెళ్ళిపడిపోయింది. అజ్ఞాన రూపిణియగు రాక్షసి రాతిరూపంలో ఇంతకాలం రక్తపానంచేస్తూ, ఇవాళ గోమతినదీ గర్భంలో అనేకవేల రాళ్ల మధ్య అదృశ్యమై పోయింది. కానీ మనుష్యుని కఠోరహృదయం. మాత్రం

ఏమీ త్యజించలేదు రఘుపతి దీపాన్ని ఆర్పివేసి బయటకు వచ్చాడు. అతడు అదేరోజు రాత్రి రాజధానిని వదలి వెళ్ళి పోయాడు.

# 41

పూజారి బిల్వాణుడు కొద్దిరోజులనుండి నవాకళిలోని నిజామత్ పురంలో ఉంటున్నాడు. అక్కడ భయంకర మహ మ్మారి వ్యాపించి ఉంది.

ఫాల్గుణ మాసాంతాన రోజంతా మబ్బులుపట్టే ఉండేవి అప్పుడప్పుడు కొద్దిగా వర్షం పడుతూ ఉండేది చివ రికి సాయంకాలమగుసరికి గాలి తీవ్రంగా వీచేది. మొదట తూర్పుగాలివీచి రాత్రి రెండు జాములయ్యేసరికి ఉత్తరపుగాలి వీస్తూ, తీవ్రమగు తుఫాను రూపం ధరించింది. చివరికి కుంభ వృష్టి ప్రారంభమయ్యేసరికి గాలి తీవ్రత తగ్గిపోయింది. ఇంతలో 'వరద, వరద' అని కేకలు వినిపించాయి. కొందరు ఇళ్లపై కెక్కారు, మరికొందరు పుష్కరిణి గట్టుకు చేరు కున్నారు, కొందరు చెట్లమీది కెక్కితే మరికొందరు ఆలయ శిఖరాన ఆశ్రయం పొందారు చీకటిరాత్రి, ఎడతెగనివర్షము. వరదయొక్క భీకరగర్జన రానురాను దగ్గరగా విన్పించసాగింది. భయంవల్ల గ్రామప్రజలకు దిక్కూ దరీ తోచటం లేదు. ఇంతలో వరదప్రవాహం దగ్గరకు రానేవచ్చింది. ఒకదాని తరువాత ఒకటి రెండు అలలు త్రోసుకొచ్చాయి. రెండవ అల వచ్చేసరికి గ్రామంలో ఎనిమిది అడుగుల నీరు నిండింది.

మర్నాడు సూర్యోదయ మయ్యేసరికి వరద కొంచెం తగ్గింది. కానీ గ్రామంలోని ఇళ్ళు చాలావరకు కూలిపోయాయి. మిగిలిన ఇళ్ళల్లో కూడా మనుషులెవరూ లేరు. ఎగువ గ్రామాల నుంచి ఆవులు, గేదెలు, మేకలు, కుక్కలు, నక్కలు మనుష్యుల మృతశరీరాలు వరదనీటిలో కొట్టుకొని వచ్చాయి పోక చెట్లు సమూలంగా కూలి కొట్టుకొని పోయాయి. పెద్ద పెద్ద మామిడిచెట్లు, పనస చెట్లు కూకటివ్రేళ్ళతోసహా పెకలించుకొని నేలగూలి ఉన్నాయి. పై గ్రామాల నుంచి కొట్టుకొని వచ్చిన ఇళ్ళకప్పులు గోడలు లేవనే విచారంతో నేల గూలి ఉన్నాయి పాత్రలనేకం చెల్లాచెదురుగాపడివున్నాయి. అనేక ఇళ్ళు పెద్దపెద్ద మామిడిచెట్ల క్రింద పనసచెట్ల క్రింద అణగిపోయాయి. అందువల్ల కొందరు మనుష్యులు ప్రవాహపు వేగానికి కొట్టుకు పోకుండా చెట్లకొమ్మలలో చిక్కుకొని రాత్రంతా ప్రవాహవేగానికి వెనక్కి ముందుకూ వూగిపోతూ ఉన్నారు. మరికొందరు ముళ్ళపొదలలో చిక్కుకొని శరీరంనిండా గాయాలతో మిగిలారు, కొందరు చెట్లతోపాటు కొట్టుకుపోయారు.

వరద తగ్గగానే బ్రతికి ఉన్నవారు క్రిందికి దిగివచ్చారు తమతమ బంధుమిత్రుల కొరకు మృతశరీరాల గుట్టల్ని వెతకసాగారు ఇతర గ్రామాలనుంచి కొట్టుకువచ్చిన గుర్తుతెలియని మృత శరీరాలే అధికంగా ఉన్నాయి వాటికి ఎవరూ దహన సంస్కారము గావించలేదు. కుక్కల, నక్కల హడావుడి కూడా ఏమీలేదు. ఈ వరదకు అవి కూడా అన్నీ చని పోయాయి.

గ్రామములో పఠానులవి పన్నెండుఇళ్ళు ఉన్నాయి. అవి చాలా ఎత్తున ఉండటంవల్ల వరదవల్ల వాటికి ఏమీ హాని కలుగ లేదు. బ్రతికిబయటపడ్డవాళ్ళు పడిపోకుండాఉన్నఇళ్ళల్లో ఆశ్రయంపొందారు ఎక్కడా ఆశ్రయం లభించనివాళ్ళు ఇతర చోట్లకు వెళ్ళిపోయారు ఇతర చోట్ల ఉన్నవాళ్లు తమ తమ గ్రామాలకు తిరిగివచ్చి కొత్త ఇళ్లు కట్టుకోసాగారు. క్రమంగా మరల ప్రజలు తమ తమ గృహాలలో నివసించసాగారు. వరదలో కొట్టుకొని వచ్చిన మృత శరీరాలవల్ల పుష్కరిణి నీరు కలుషితమయ్యింది. ఇంకా అనేక ఇతర కారణములవల్ల గ్రామంలో మహమ్మారి వ్యాపించింది.

మహమ్మారి మొట్టమొదట పఠానుల ఇళ్ళల్లో ప్రారంభమయింది. శవాలను సమాధిచేయుటకుగానీ, వారికి సహాయము చేయుటకుగానీ ఎవరికీ అవకాశం లభించలేదు. మహమ్మదీయులు గోహత్య చేస్తారు కనుక వారు ఆ పాప ఫలితాన్ని అనుభవిస్తున్నారని హిందువులు అన్నారు. మత విద్వేషము, జాతిభ్రష్టులమవుతామనే భయంవల్ల హిందువులు వారికి మంచినీళ్ళు కూడా ఇవ్వలేదు. ఎలాంటి సహాయమూ చేయలేదు.

పూజారి బిల్వాణుడు ఆ గ్రామంలోనికి వచ్చినప్పుడు గ్రామపరిస్థితి కడుశోచనీయంగా ఉంది బిల్వాణునికి అనేక మంది శిష్యులు లభించారు. వాళ్ళందరూ మహమ్మారికి భయపడి పారిపోయే ప్రయత్నంలో ఉన్నారు. బిల్వాణుడు కనుగొని వాళ్ళను వెళ్ళకుండా ఆపిఉంచాడు. వాళ్లు పఠానులకు సహాయపడ సాగారు. వారికి పథ్యపానాలు, మందులు

ఇవ్వటమే గాక చనిపోయినవారి శవాలనుకూడా వారే సమాధి చేయసాగారు ఒక హిందూసన్యాసి చేయు ఆచార విరుద్ధమగు పనులను చూచి హిందువులకు చాలా ఆశ్చర్యం కలిగించి.

వారితో బిల్వాణుడు ఇలా చెప్పేవాడు- "నేను సన్యాసిని. నాకు ఒక జాతి అనేది లేదు. నాది మానవజాతి మనిషి చావు బ్రతుకులలో ఉన్నప్పుడు జాతి ఏమిటి? భగవంతుడు సృష్టించిన మనిషి, మనిషియొక్క ప్రేమ సహకారాలు కోరు నప్పుడు జాతి అనేదేముంటుంది?"

బిల్వాణుడు నిస్వార్థ బుద్ధితో ఇతరులకు సహాయపడటం చూచి హిందువులు అతనిని ద్వేషించటానికి గాని నిందించ టానికిగానీ సాహసించలేకపోయారు బిల్వాణుని పని మంచిదో, చెడ్డదో వారు నిర్ణయించుకోలేకపోయారు వారి సంపూర్ణ శాస్త్రజ్ఞానం "ఇది అనుచితమే" అని సంధిగ్ధభావంతో జవాబు చెప్పింది. కానీ వారి హృదయంలో దాగిఉన్న మానవత్వం మాత్రం "మంచిదే" అని చెప్పింది. ఏది ఏమైనప్పటికీ ఒకరు మంచిదని అంటారనో లేక చెడ్డదని అంటారనో చూడకుండా బిల్వాణుడు తనకు ఉచితమని తోచినపని చేయసాగాడు మృత ప్రాయులగు పఠానులు అతనిని దేవతగా భావించారు. మహమ్మారికి దూరంగా ఉంచుటకు అతడు పఠానుల పిల్లలను హిందువుల ఇళ్ళకు తీసుకు వెళ్లాడు హిందువులు ధర్మసంకటంలో పడిపోయారు. ఎవరూ ఆ పిల్లలకు ఆశ్రయమివ్వలేదు. అప్పుడు బిల్వాణుడు ఒక పాడుపడిన ఆలయంలో తాను నివసిస్తూ ఆ పిల్లలను కూడా అక్కడే ఉంచాడు.

ఉదయమే లేచి బిల్వాణుకు ఆ పిల్లల నిమిత్తము భిక్షా టనకు బయలుదేరేవాడు కానీ భిక్షంఎవరువేస్తారు? దేశంలో కరువుకూడా వ్యాపించి, అనేకమంది అన్నములేక చావ సిద్ధముగా ఉన్నారు గ్రామములోని మహమ్మదీయ జమీందారులు గ్రామానికి చాలా దూరంగా ఉండేవారు. బిల్వాణుడు వారి వద్దకు కూడా వెళ్ళాడు. అతికష్టంమీద వారిని ఒప్పించి అతడు ఢాకానుంచి బియ్యం తెప్పించే ఏర్పాటు చేశాడు అతడు రోగులకు సేవచేయుటయేగాక బియ్యము కూడా పంచుతూ ఉండేవాడు మధ్య మధ్య బిల్వాణుడు వీలు కల్పించుకొని పిల్లలవద్దకు వెళ్ళి ఆటలాడుకునేవాడు. పిల్లలు అతనిని చూచి చాలా అల్లరి చేస్తూఉండేవారు.

చివరికి మహామారి మహమ్మదీయుల పేటను వదలి హిందువుల ఇళ్ళల్లో వ్యాపించింది. గ్రామంలో ఒకవిధంగా అరాజక పరిస్థితులు వ్యాపించాయి. దొంగతనాలకు, దోపిడీలకు అంతులేకుండా పోయింది ఏది దొరికినా దోచుకు పోతున్నారు. మహమ్మదీయులు ఒక ముఠాగాచేరి దోపిడీలు ప్రారంభించారు. వాళ్ళురోగులను మంచాలమీదనుంచి లాగివేసి మంచాలు, కంచాలు, పరుపులు ఒకటేమిటి కన్పించిన ప్రతి వస్తువును దోచుకుపోతున్నారు. బిల్వాణుడు వారిని ఆపటానికి తన శక్తివంచన లేకుండా ప్రయత్నించాడు. మహమ్మదీయులు బిల్వాణునిని చాలా గౌరవించేవారు అతని మాటలనుకాదని వాళ్లు వ్యతిరేకించటానికి సాహసించలేకపోయారు. ఈ విధంగా బిల్వాణుడు తన శక్తివంచన లేకుండా కృషిచేసి గ్రామంలో శాంతిని నెలకొల్పాడు.

ఒకనాడు ఒక శిష్యుడు బిల్వాణుని వద్దకు వచ్చి "పర దేశీయుడెవరో గ్రామంలోని రావిచెట్టు క్రిందపడి ఉన్నాడు. అతనికి కలరా తగిలింది. జీవిస్తాడని కూడా ఆశలేదు" అని చెప్పాడు. బిల్వాణుడు వెంటనే అక్కడకు వెళ్ళి చూచాడు_

కేదారేశ్వరుడు నేలమీద పడివున్నాడు. అతని ప్రక్కనే ధ్రువుడు దుమ్ములోపడి నిద్రపోతున్నాడు కేదా రేశ్వరుడు చావుబ్రతుకుల్లో ఉన్నాడు దూరప్రయాణము చేయుటవల్లనూ, తినటానికి తిండిలేనందువల్లనూ చాలా నీర సించిపోయాడు. దానితో రోగము అతనిని మరింత క్రుంగ దీసింది. మందులేవీ పనిచేయలేదు. అతడు ఆ చెట్టుక్రిందే చని పోయాడు. ఆకలి బాధ భరించలేక చాలాసేపు ఏడ్చి ఏడ్చి నిద్రపోయినట్లున్నాడు ధ్రువుడు. బిల్వాణుడు అతనిని జాగ్ర త్తగా ఎత్తుకొని తన నివాసానికి తీసుకు వెళ్ళాడు

# 42

ఆ కాలంలో చట్టగ్రామం అరాకాన్ అధీనంలో ఉండేది. గోవిందమాణిక్య ప్రభువు తమ దేశంనుండి బహి ష్కరింపబడి ప్రస్తుతము చట్టగ్రామానికి వచ్చి ఉన్నారని వినగానే అరాకాన్ మహారాజు మర్యాదగా వారి వద్దకు తమ దూతను పంపారు వారు తిరిగి రాజ్యాధికారాన్ని పొందదలచి నట్లయితే అరాకాన్ మహారాజు సహాయం వారికి లభించ గలదని కూడా ఆ దూత ద్వారా వర్తమానం పంపారు.

"వద్దు, మాకు రాజ్యాధికారం అవసరంలేదు" అని గోవిందమాణిక్యుడు జవాబు చెప్పారు.

"అయితే తమరు అరాకాన్ మహారాజుగారి భవనంలో పూజనీయులగు అతిధిగా కొంతకాలం ఉండవలెనని మా కోర్కె" అని దూత మాణిక్య ప్రభువుతో చెప్పాడు.

"రాజసభలోగానీ, రాజభవనంలోగానీ ఉండటం మాకు ఇష్టంలేదు. మీ రాజ్యములో ఏదో ఒక మూల ఉండటానికిచోటు లభిస్తే మీ రాజ్యానికి ఎంతో ఋణపడి వుంటాను" అని గోవిందమాణిక్యుడు జవాబుచెప్పారు.

"మహారాజా, మా రాజ్యంలో తమకు ఇష్టమైనచోట ఎక్కడైనా ఉండవచ్చును దీనిని తమ రాజ్యముగానే భావించుకోనండి" అన్నాడు దూత

అరాకాన్ మహారాజుగారి సేవకులచేకమంది గోవింద మాణిక్య ప్రభువువద్ద ఉండిపోయారు. వారు అందుకు అభ్యంతరం చెప్పారు అరాకాన్ మహారాజు తనను సందేహించి కొందరు సేవకుల్ని ఇక్కడ నియమించి ఉండవచ్చునని వారు ఆలోచించారు.

మయూనీ నదీతీరాన మహారాజుగారు ఒక కుటీరాన్ని నిర్మించుకున్నారు. నిర్మల జలభరితయగు ఆ చిన్న నది చిన్న పెద్ద రాళ్ళమీదుగా వేగముగా ప్రవహించేది. నదికి రెండు వైపుల నల్లని పర్వతాలున్నాయి. నల్లని రాళ్ళమీద విచిత్రమైన రంగుగల నీటిపాచి వేలాడుతూ ఉంది మధ్య మధ్య చిన్న చిన్న గుహలున్నాయి వాటిలో పక్షులు నివసించేవి. ఒక్కొక్కచోట పర్వతాలు చాలా ఎత్తుగా ఉన్నందువల్ల ఎప్పుడోఒకసారి సూర్యకిరణాలు నదినీటిమీద పడేవి. పెద్దపెద్ద మొక్కలు రకరకాల ఆకులతో గుబురుగా పెరిగి పర్వతపు

దేహం మీద తన్మయంతో తలలు ఆడిస్తున్నాయి మధ్య మధ్య నదీ తీరాన చాలా దూరం వరకు దట్టంగా చెట్లు వ్యాపించి వున్నాయి కొమ్మలులేని ఒక పెద్ద వృక్షము పర్వతము మీద వంగి ఉంది నదిలోని చంచలమగు నీలవర్ణపు నీటిలో ఆ వృక్షపు ప్రతిబింబము నాట్యము చేస్తూ ఉంది అనేక లతలు ఆ చెట్టును అల్లుకొని వున్నాయి దట్టమైనఅడవి మధ్య అక్కడక్కడ అరటివనాలు ఉన్నాయి మధ్య మధ్య ఇరువైపుల నదీతీరములను కోసుకొని చిన్నచిన్న ప్రవాహాలు అల్లరి పిల్లలవలె కిలకిల నవ్వుతూ ఎంతో వ్యాకులతతో చేతులు చాచి నదిలోకివచ్చి పడుతున్నాయి. నది కొంత దూరం వరకు మిట్టపల్లాల రాళ్ళమార్గాన పోయి నురగలు క్రక్కుతూ క్రిందికి పడుతూ ఉంది. ఆ నది గలగల ధ్వని నిశ్శబ్దంగా ఉన్న పర్వతాల మధ్య ప్రతిధ్వనిస్తూ ఉంటుంది

చల్లని నీడలో నిర్మల జలంతో గలగల ధ్వనుల మధ్య నిశ్చలమగు పర్వత లోయలో గోవిందమా శిష్యుడు నివసించు చుండెను. విశాల హృదయము పొంది మనశ్శాంతిని సంపాదించుకో సాగారు. నిర్జన ప్రకృతిలోని గంభీరప్రేమ అనేకానేక దిశలనుంచివచ్చి వేలప్రవాహాలుగా అతని హృదయంలో ప్రవహించసాగింది. వారు తమ హృదయ గహ్వరములోనికి ప్రవేశించి అక్కడ పేరుకొనిఉన్న క్షుద్రమగు అహంకారమును పూర్తిగా ప్రక్షాళనముచేసి శుభ్రపర్చుకోసాగారు-తమ హృదయ ద్వారాన్ని తెరిచి దానిలోనికి నిర్మల కాంతిని గాలిని గ్రహించసాగారు. 'వారికి ఎవరు దుఃఖం కలిగించారో వారిని ఎవరు కష్టపెట్టారు, వారి ప్రేమను పొంది వారిని

ప్రేమించని వారెవరు, వారివల్ల ఉపకారం పొంది అపకారం చేసినవారెవరు, వారివల్ల గౌరవింపబడి వారిని అవమానించిన వారెవరు,'- ఇలాంటి విషయాలన్నీ వారు పూర్తిగా మర్చిపోయారు వారు మారంవరకు విశాల ప్రపంచంలో తమ నిస్వార్థ స్నేహాన్ని వ్యాపింపచేసినట్లుంది- కోర్కెలన్నింటినీ త్యజించి ఇలా అన్నారు- "పరమేశ్వరా! పతనోన్ముఖమగు ఐశ్వర్యశిఖరంనుంచి నీ ఒడిలో ఆశ్రయాన్నిచ్చి నాయాత్రను పరిరక్షించావు. మరణించుటకు సిద్ధముగా ఉన్న నేను బ్రతికిపోయాను నేను మహారాజు నైనప్పుడు నాలో నీ శ్రేష్ఠతను తెలుసుకో లేకపోయాను. ఇవాళ సమస్తజగత్తులో నిండిఉన్న నాలోని శ్రేష్ఠతను గ్రహిస్తున్నాను"

చివరికి వారి నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి. వారు మళ్ళీ ఇలా అన్నారు—"మహారాజా! నువ్వు నా ధ్రువుణ్ణి నానుంచి లాక్కొన్నావు ఆ బాధ హృదయంలోనుంచి ఇప్పటివరకు తొలగిపోలేదు నువ్వుచేసినపని మంచిదేనని ఇప్పుడు అర్థం చేసుకొంటున్నాను. నేను ఆ బాలునియందు అత్యంత స్వార్థంతో కూడిన ప్రేమతో నా కర్తవ్యాన్ని, జీవితాన్ని త్యజిస్తున్నాను. ఆ ఆపదనుంచి నువ్వు నన్ను కాపాడావు నేను ధ్రువుణ్ణి నా పుణ్యాలకు బహుమానంగా భావించి స్వీకరించాను. కానీ వేరుచేసి 'పుణ్యానికి బహుమానం పుణ్యమే'నని నాకు గుణపాఠం నేర్పావు. అందువల్ల ఇవాళ ఆ ధ్రువుని పవిత్ర విరహ దుఃఖాన్ని సుఖంగా భావించి—అది నీ ప్రసాదంగా గ్రహిస్తున్నాను. నేను జీతముపొందే సేవకుని

వలె పనిచేయను, ప్రభూ! నేను నీ ప్రేమకు వశ్యుడనై నీ సేవచేస్తాను."

ఏకాంతములో ధ్యాన నిమగ్నమైఉన్న ప్రకృతి స్నేహ ధారలు సమకూర్చుకొని వాటిని నగరములలో నదులరూపంలో ప్రవహింపజేస్తు గోవిందమాణిక్యునికి కన్పించింది. దానిని స్వీకరించిన వారి తృష్ణ తీరుతుంది. దానిని స్వీకరించని వారిని కూడా అది కరుణిస్తుంది.

"ఈ ఏకాంత ప్రదేశంలో నేను సంపాదించుకున్న ప్రేమనుకూడా ప్రజల మధ్యకు వెళ్ళి వారికి పంచిపెడతాను" గోవిందమాణిక్యుడు ఆలోచించారు. తరువాత వారు తమ కుటీరాన్ని వదలి బయటకు బయలుదేరారు.

అకస్మాత్తుగా విరక్తిచెంది రాజ్యాధికారాన్ని త్యజించుట వ్రాయుటకు తేలికగా కన్పించవచ్చును కానీ వాస్తవమునకది అంత తేలికయైన పనికాదు. రాజదుస్తులు వదలి కాషాయ వస్త్రములు ధరించుట మామూలు విషయముకాదు. రాజ్యమును త్యజించుట తేలికకావచ్చు కానీ పుట్టుకతో మనలో ఉంటూ వచ్చిన స్వల్పమగు అలవాట్లను సునాయాసముగా వదలలేము. అవి మితిమీరిన దాహము ఆకలితో మన నరనరాన జీర్ణించి ఉంటాయి. వాటికి నియమిత ఆహారాన్ని సమకూర్చనప్పుడు అవి మన రక్తమునే పీల్చివేస్తూ ఉంటాయి. గోవిందమాణిక్యుడు ఏకాంత కుటీరంలో ఉన్నంత కాలము వారు నిశ్చల చిత్తముతో ఒక స్తంభమువలె స్థిరంగా ఉన్నారని అనుకోవద్దు, వారు అనుక్షణం. అడుగడుగున తమ చిన్నచిన్న అలవాట్లతో యుద్ధంచేస్తూనే ఉన్నారు. ఒక్కొ-

క్లిష్టమును ఏదైనా లోపము జరిగినప్పుడు వారి హృదయం బాధపడితే అందుకు వారు తమ హృదయాన్ని చీవాట్లువేసే వారు వారు తమ హృదయంలోని వెయ్యి నాలుకలుగల ఆకలికి ఆహారమేమీ ఇవ్వకుండా దానిని చంపివేయసాగారు అడుగడుగున ఇలాంటి వందల కోర్కెలను జయించి వారు సుఖానుభూతి పొందసాగారు. మాటవినని పెంకి గుర్రాన్ని పూర్తిగా అలసి పోయేవరకు వేగంగా పరుగెత్తించి దానిని వశం చేసుకున్నట్లుగా వారు తీరని కోర్కెలతో వ్యాకులపడు తమ హృదయాన్ని ఇచ్ఛారహితమగు ఎడారిలో పరుగెత్తించి వశపరుచుకున్నారు చాలా కాలంవరకు వారికి ఒక క్షణంకూడా విశ్రాంతి లభించలేదు

పర్వత ప్రదేశాన్ని వదలి గోవిందమాణిక్యుడు దక్షిణంగా సముద్రంవైపు బయలుదేరారు కోర్కెలతో నిండిన వస్తువుల నన్నింటినీ త్యజించి వారు తమ హృదయంలో ఆశ్చర్యకరమగు స్వేచ్ఛను అనుభవించసాగారు వారిని ఇక ఎవ్వరూ బంధించి ఉంచలేరు ముందుకు సాగుటకు వారికి ఎవరూ విఘ్నములు కలిగించలేరు. వారు ప్రకృతిని అత్యంత విశాల రూపంలో చూడగలిగారు వారు తమనుకూడా దాని మాదిరిగానే భావించుకోసాగారు వారు వృక్షముల లతలలో ఒక క్రొత్తరకపు పచ్చదనమును, సూర్యకిరణములలో ఒక నూత్న కాంతిని, ప్రకృతిలో ఒక నవీన శోభను చూడసాగారు గ్రామాలకు వెళ్ళినప్పుడు వారు మానవుడు చేయు ప్రతిపనిలోనూ ఒక నూత్న సౌందర్యాన్ని చూడసాగారు. మానవుని నవ్వులో, మాటలలో, అతడు కూర్చున్నా నిల

బడినా, నడిచినా, తిరిగినా ప్రతిదానిలోనూ ఒక అపూర్వ నృత్య గీతాలమాధుర్యాన్ని పొందసాగారు.

కన్పించిన ప్రతివారినీ దగ్గరకుపిలిచి వారితో మాట్లాడి సుఖానుభూతిని పొందేవారు వారిని తిరస్కరించిన వారి యందుకూడా వారు ప్రేమచూపేవారు దుర్బలులకు సహాయం చేయాలనీ, దుఃఖితులకు ధైర్యం చెప్పాలనేవారు ఎప్పుడూ ప్రయత్నించేవారు 'నేను నా బలాన్నీ సుఖాన్నీ ఇతరులకోసం త్యాగం చేశాను. ఎందుకనగా నాకు దేనివల్లనూ ప్రయోజనంలేదు. నాలో ఏమీ స్వార్థంలేదు' అని వారు మనసులో అనుకునేవారు ఇతరులకు కన్పించని అతి సామాన్య మగు దృశ్యములుకూడా వారి కొత్త ఆకారము ధరించి కన్పిస్తూ ఉండేవి ఇద్దరు బాలురు దారిలో కూర్చొని ఆడు కొంటూ ఉండగా చూచినప్పుడు—ఇద్దరు సోదరులు కావచ్చు, తండ్రికొడుకులుగానీ, తల్లికొమారులుగానీ ఒక చోట ఉండగా చూచినప్పుడు—వారు మాసిన దుస్తులు ధరించినవారే కావచ్చు, దరిద్రులు కావచ్చు, లేదా అంద విహీనులే కావచ్చు—వారిలో దూరదూరాలకు వ్యాపించిన మానవ హృదయ సముద్రములోని అత్యంత గంభీరప్రేమను చూడగలిగేవారు బాలునిఎత్తుకొని ఉన్న తల్లినిచూచినప్పుడు వారు ఆమెలో భూత భవిష్యత్కాలములలో సమస్త మానవ జాతిని కన్న మాతృరూపాన్ని దర్శించేవారు ప్రపంచంలోని దుఃఖము, శోకము, దారిద్ర్యము, విరోధము, విద్వేషము మొదలగు వాటిని చూచినప్పుడు కూడా వారికి నిరాశ కలిగేది కాదు వారిలోని కళ్యాణప్రదమగు ఆశ అనేక పక్షాలనుంచి

వారిని ముందుకు నడిపిస్తూఉంది. దుఃఖములతో నిండిఉన్న ఈ ప్రపంచాన్ని అప్పుడే జన్మించిన సుకుమార శిశువుగా భావించి ఒక అపూర్వ సౌందర్యమయమగు, శుభప్రదమగు ప్రేమమూర్తి ఒడిలో ఉన్నట్లు దర్శించగలిగారు. వారు సమస్త సుఖాలను జయించారు. వారిని నాలుగు గోడలమధ్య ఎవరూ బంధించి ఉంచలేరు. ఏదో ఒకనాడు అపూర్వమగు మురళీరవం విన్పిస్తుంది. అపురూపమగు వసంతం వస్తుంది. ప్రపంచం చిరయౌవనపు ఆనందంతో నిండిపోతుంది నూత్న వియుక్తిలోని ఆనందంలో విశాల హృదయుడగు గోవిందమాణిక్యునికి జీవితంలో అలాంటి సుదినం సంప్రాప్తించింది.

చట్టగ్రామానికి దక్షిణంగా రామూనగరం ఇంకా పది కోసుల దూరం ఉంది. సూర్యుడు అస్తమించకముందే గోవిందమాణిక్యుడు ఆలంఖాల్ అను ఒకచిన్న గ్రామానికి చేరుకున్నాడు, గ్రామానికి చివరఉన్న ఒక కుటీరంలోనుంచి గోవిందమాణిక్యునికి ఒక బాలుని ఏడ్పు విన్పించింది. గోవింద మాణిక్యుని హృదయం అకస్మాత్తుగా చలించింది వారు వెంటనే ఆ కుటీరములోనికి వెళ్ళి చూచారు. ఒక యువకుడు బక్కగాఉన్న ఒక బాలుణ్ణి ఎత్తుకొని కుటీరంలో అటూఇటూ తిరుగుతున్నాడు. బాలుడు గడగడ వణుకుతున్నాడు ఉండి ఉండి నెమ్మదిగా ఏడుస్తున్నాడు ఆ యువకుడు అతనిని తన హృదయానికి హత్తుకొని నిద్రబుచ్చుటకు ప్రయత్నించ సాగాడు.

సన్యాసివేషంలో ఉన్న గోవిందమాణిక్యాని చూచి అతడు "స్వామీ, ఇతనిని ఆశీర్వదించండి!" అని దీనంగా వేడుకున్నాడు గోవింద మాణిక్యులు తమ కంబళి తీసి ఆ బాలునికి కప్పారు బలహీనంగా ఉన్న ఆ బాలుడు ఒకసారి తలపైకెత్తి గోవిందమాణిక్యునివంక చూచాడు అతని-కళ్ళ క్రింద నల్లని చారలుకన్పించాయి. అతని కృశించినముఖ లో రెండు నేత్రాలు తప్ప మరేమీ లేనట్లే ఉంది. ఒకసారి గోవిందమాణిక్యునివైపు చూడగానే అతడు పెదాలుకదిలించి అస్పష్టంగా ఏదో అన్నాడు తిరిగి తన తండ్రి భుజంమీద తల ఆనించి మెదలకుండా పడుకున్నాడు అతని తండ్రి అత నిని కంబళితోసహా క్రింద పడుకోబెట్టి గోవిందమాణిక్యునికి నమస్కరించాడు. వారి పాద ధూళిని తీసి బాలుని నుదుట ఉంచాడు,

మహారాజగారు బాలుణ్ణి ఎత్తుకొని "ఈ బాలుని తండ్రి పేరేమిటి?" అని ప్రశ్నించారు.

ఆ యువకుడు "నేనే ఇతని తండ్రిని. నా పేరు యాద వుడు. భగవంతుడు నా ఇంటిలోని వారి నందరినీ ఒకొక్క రినే తీసుకు వెళ్ళాడు ఇక ఇతడు ఒక్కడే మిగిలాడు" అని ఆ యువకుడు దీర్ఘంగా నిట్టూర్చాడు

మహారాజుగారు ఆ యువకునితో "ఇవాళరాత్రి నేను నీకు అతిథిగా ఉంటాను నేనేమీ ఆహారం తీసుకోను, కనుక నన్నుగురించి మీరేమీ ప్రయత్నంచేయవద్దు" అని అన్నారు.

మహారాజుగారు ఆ రాత్రి అక్కడే ఉండిపోయారు. వారి అనుచరులు గ్రామంలోని ఒక ధనిక కాయస్థుని ఇంట్లో

ఆతిథ్యం పొందారు. సమీపమందు ఒక చెరువు వుంది. దాని లోని నీరు ముఱికిగా ఉంది. దానిలోనుంచి ఆవిరి వస్తూ ఉంది ఎదురుగా ఉన్న రక్కస పొదలలో కీచురాళ్ళు కర్కశంగా రొదచేస్తున్నాయి గాలి స్తంభించిపోయింది చెట్టు ఆకుకూడా కదలటం లేదు. బాలునికి కంబళి కప్పి గోవిందమాణిక్యుడు అతని మంచము వద్దనే కూర్చుని ఏవేవో కథలు చెప్ప సాగారు. దూరాన నక్కలు అరుస్తున్నాయి. బాలుడు కథలు వింటూ రోగబాధను మరిచి నిద్రపోయాడు మహారాజుగారు కూడా ప్రక్కగదిలో పడుకున్నారు రాత్రంతా వారికి నిద్ర పట్టలేదు రాత్రంతా వారికి ధ్రువుడు గుర్తొస్తూనే ఉన్నాడు. "ధ్రువుని ఎడబాటువల్ల బాలురందరూ ధ్రువునివలెనే కన్పి స్తున్నారు" అని వారు మనస్సులో అనుకున్నారు

రాత్రిప్రొద్దుపోయిన తరువాత ప్రక్కగదిలో బాలుడు నిద్రమేల్కొని "నాన్నా! ఆ విన్పించే దేమిటి!" అని అడుగు తున్నాడు.

"అది మురళి "

"మురళి ఎందుకు మ్రోగుతుంది?"

"రేపు పూజగదూ, అందుకని బాబూ!"

"రేపుపూజ, పూజరోజున నాకేమీ ఇవ్వవా?"

"ఏంకావాలి నాయనా?"

"నాకు ఒక ఎర్రశాలువా ఇస్తావా?"

"నేను శాలువా ఎక్కడినుంచి తేగలను! నావద్దఏమీ లేదు బాబూ!"

"నాన్నా, నీ వద్ద ఏమీ లేదా?"

"ఏమీ లేదు బాబూ! నువ్వే వున్నావు."

భగ్నహృదయుడగు ఆ తండ్రి నిట్టూర్పు ప్రక్కగది లోకి వినిపించింది

బాలుడు మరేమీ మాట్లాడ లేదు. తండ్రిని కౌగలించుకొని నిద్రపోయినట్లుంది.

తెల్లవారకముందే గోవింద మాణిక్యుడు లేచి ఇంటి యజమానితో చెప్పకుండానే గుర్రంమీద రామానగరం వైపు బయలుదేరి వెళ్ళాడు. ఎండతీవ్రంగా ఉంది. వారు రామానగరం చేరుకున్నారు విశ్రాంతి లేదు, ఆహారము కూడా తీసుకోలేదు వెంటనే తిరిగి ప్రయాణమయ్యారు. సూర్యుడు అస్తమించక పూర్వమే వారు తిరిగి యాదవుని ఇంటికి చేరుకున్నారు. యాదవుణ్ణి వారు చాటుకు తీసుకు వెళ్ళారు. తన జోలెలోనుంచి ఎర్రని శాలువా తీసి అతనిచేతి కిస్తూ "ఇవాళ పూజరోజు, ఈ శాలువా అబ్బాయికి ఇవ్వు" అని చెప్పారు.

యాదవుడు ఏడుస్తూ గోవిందమాణిక్యుని పాదాలపై బడి "స్వామీ, మీరే తెచ్చారు, మీరే ఇవ్వండి" అని అన్నాడు

"కాదు, నే నివ్వను, నువ్వేఇవ్వాలి. నేనిచ్చినందువల్ల ఏమీ లాభం ఉండదు. నాపేరుకూడా చెప్పవద్దు. నీ కుమారుని ముఖంలో సంతోషాన్ని చూచి నేను వెళ్ళిపోతాను" అన్నారు మహారాజుగారు

జబ్బుపడి పీక్కుపోయిన బాలుని ముఖంలో సంతోషాన్ని చూచి మహారాజుగారు వెళ్ళిపోయారు. మహారాజు

గారు మనస్సులో దుఃఖపడుతూ ఇలా అనుకున్నారు— "నేనేమీ పనిచేయలేక పోతున్నాను. నేను కొన్ని సంవత్సరాలు రాజ్యాన్ని పరిపాలించాను, ఏమీ నేర్చుకోలేదు. ఏంచేస్తే ఒక బాలుని రోగం తగ్గుతుందో కూడా నాకు తెలియను. నేను నిస్సహాయుడను, ఏమీచేయలేక ఏడుస్తూ కూర్చోవటం మాత్రమే నాకు తెలుసు. పూజారి బిల్వాణుడైతే కొంత ఉపకారం జరిగేది. నేనుకూడా వారిమాదిరి కాగలిగితే ఎంత బాగుంటుంది!"

"నేనిక అటూ ఇటూ తిరగను రామూనగరంలోనే ఉండి పనిచేయటం నేర్చుకుంటాను" అని మహారాజుగారు నిశ్చయించుకున్నారు.

రామూనగరానికి దక్షిణాన రాజకుల సమీపంలో మిగుల ప్రాచీన దుర్గము ఒకటిఉంది అరాకాన్ మహారాజు అనుమతిపొంది వారు అందులో నివసించసాగారు.

గ్రామంలోని పిల్లలందరూ దుర్గములో నివసించే గోవిందమాణిక్యునివద్ద చేరుతూ ఉండేవారు. గోవింద మాణిక్యుడు వారితో ఒక పాఠశాలను ప్రారంభించారు. వారు వాళ్ళకు చదువునేర్పుతూ, వారితో కలిసి ఆడుకుంటూ ఉండేవారు వాళ్ళవెంట వాళ్ళ ఇళ్ళకు వెళ్ళేవారు, ఎవరికైనా జబ్బుచేస్తే వాళ్ళను చూడడానికి వెళ్ళేవారు. ఈ విధంగా మహారాజుగారు అనేక వందలమంది భ్రువుల మధ్య కాలం గడప సాగారు.

# 43

ఇట్లు షుజా చక్రవర్తిని అతని సోదరుడు ఔరంగజేబు సైన్యం తరిమివేసింది. అలహాబాదు సమీపాన అతడు ఓడి పోయి పారిపోయాడు. పరాజితుడై ఆపదలో ఉన్న షుజా తన పక్షమువారిని కూడా విశ్వసించలేక పోయాడు. అతడు అవమానింపబడి, భయపడి, మామూలు మనిషివలె వేషము మార్చుకొని తాను ఒంటరిగా పారిపోసాగాడు. శత్రు సైన్యాలు అతని వెంటబడి తరుముకొస్తూనే ఉన్నాయి చివ రికి పాట్నా చేరిన తరువాత అతడు తిరిగి నవాబు వేషంలో తన పరివారమునకు, ప్రజలకు తనరాకను తెలియజేశాడు అతడు పాట్నా చేరిన కొద్దిసేపటికే ఇటు ఔరంగజేబు కుమారుడు ముహమ్మద్ సైన్యసమేతుడై పాట్నా నగరద్వారం వద్దకు చేరుకున్నాడు. షుజా పాట్నా వదలి ముంగేరువైపు పారి పోయాడు.

చెదిరిపోయిన అతని సైన్యాలు కొద్దికొద్దిగా ముంగే రుకు వచ్చి షుజాను కలుసుకున్నాయి. అతడు తిరిగి కొత్త సైన్యాన్ని సమకూర్చుకొన్నాడు. తేలియాగడి, షికలీగలి దుర్గములను పునరుద్ధరించి నదీతీరము వెంట పర్వతము మీదుగా ప్రహరీ గోడ కట్టించి అతడు స్థిరంగా ఉండ సాగాడు.

ఇటు ఔరంగజేబు తన సైన్యాధిపతులలో మిక్కిలి సమర్థుడగు మీర్ జుమలాను రాకుమారుడు ముహమ్మద్‌కు సహాయంగా పంపాడు. రాకుమారుడు ముహమ్మద్ బహి

రంగముగా ముంగేరు కోట సమీపానికి వచ్చి డేరాలు వేసు కున్నారు. మీర్ జుమలా వేరొక మార్గాన రహస్యంగా ముంగేరువైపు బయలుదేరాడు. షుజా రాకుమారుడు ముహమ్మద్‌తో చిన్న చిన్న యుద్ధాలు చేస్తున్న సమయంలో మీర్ జుమలా పెద్దసైన్యముతో వసంతపురానికి చేరుకున్నాడనే వార్త అకస్మాత్తుగా తెలియ వచ్చింది. షుజా గాబరాపడి సైన్యసమేతంగా తక్షణం తన రాజధాని రాజమహాలుకు పారి పోయాడు. అతని పరివారమంతా అక్కడే వుంటుంది. చక్రవర్తి సైన్యాలు అతనిని తరుముతూ అక్కడికి కూడా చేరు కున్నాయి. షుజా ఆరురోజులవరకు చాలా పట్టుదలగా యుద్ధం చేసి శత్రుసైన్యాలను ముందుకు సాగకుండా నిరోధించ గలి గాడు. కానీ ఎంతో కాలం శత్రువులను ఎదిరించటం కష్టమని తెలియగానే అతడు ఒక తుఫాను నాటిరాత్రి తన పరివా రాన్ని వెంటబెట్టుకొని తీసుకు వెళ్ళగలిగినంత డబ్బు తీసుకొని నదినిదాటి తొండాకు పారిపోయాడు. త్వరితగతిని అక్కడి కోటను పునరుద్ధరించే కార్యక్రమంలో మునిగిపోయాడు.

అదే సమయంలో బాగా వర్షాలు కురిశాయి. తొండాకు చేరుకునేమార్గం పూర్తిగా చెడిపోయింది. అందు వల్ల చక్రవర్తి సైన్యాలు ముందుకు అడుగుకూడా సాగలేక పోయాయి.

ఈ యుద్ధానికిపూర్వమే రాకుమారుడు ముహమ్మద్‌కు షుజా కుమార్తెతో వివాహ సంబంధం నిశ్చయమయింది. కానీ యుద్ధభీభత్సంలో ఇరుపక్షాలవారు ఆ విషయాన్ని మర్చిపోయారు.

వర్షాలవల్ల యుద్ధం పూర్తిగా ఆగిపోయింది మీార్ జుమలా తన సైన్యాన్ని రాజమహాలు నుంచి కొద్దిదూరం వెనక్కి తరలించి అక్కడ డేరాలు వేసుకున్నారు. షుజా సైనికుడు ఒకడు తోండానుంచి రహస్యంగా ఇక్కడకు వచ్చి రాకుమారుడు ముహమ్మద్‌కు ఒక జాబు నిచ్చాడు రాకుమారుడు జాబును తెరిచి చూచాడు షుజా కుమార్తె వ్రాసిన ఉత్తరం అది. దానిలో ఆమె ఇలా వ్రాసింది- "రాకుమారా ఇక నా అదృష్టము ఇంతేనా? మనస్సులో నిన్నే పతిగా భావించి నా హృదయాన్ని నీకు అర్పించాను. ఉంగరములు కూడా మార్చి నన్ను స్వీకరించగలనని మీారు ప్రతిజ్ఞ చేసి కూడా ఆ విషయము మర్చి కరకుకత్తిని చేబూని నా తండ్రి గారి ప్రాణాలు తీయుటకు వచ్చారా? ఈ ఘోరాన్ని నేను చూడవలసిందేనా? రాకుమారా! మన వివాహ మహోత్సవం ఇదేనా? ఇవాళ మన రాజమహాలు రక్తరంజితంకావలసిందేనా? రాకుమారుడు ఢిల్లీ నుండి ఇనుపగొలుసులు తెచ్చినది ఇందుకేనా? ఇవేనా ప్రేమ శృంఖలములు?"

ఈ లేఖను చదివి అకస్మాత్తుగా తీవ్రమగు భూకంపము సంభవించినట్లు రాకుమారుని హృదయం చెదిరిపోయింది. అతడు ఒక క్షణకాలము కూడా నిశ్చలంగా ఉండలేకపోయాడు ఆ క్షణంనుంచి మహాసామ్రాజ్య కాంక్ష, చక్రవర్తిగారి అనుగ్రహము మొదలగునవి అతనికి తుచ్ఛముగా కన్పించసాగాయి ప్రజ్వలించుచున్న తొలి యౌవనపు అగ్నిలోబడి అతడు లాభనష్టముల ఆలోచనే మర్చిపోయాడు. తన తండ్రి చేయు పనులన్నియు అతనికి ఘోర అన్యాయంగానూ, అత్యంత

నిర్దాక్షిణ్యంగాను కన్పించసాగాయి. ఇంతకుముందు కూడా అతడు అప్పుడప్పుడు తన తండ్రియొక్క కుట్రలకు, కుతంత్రాలకు వ్యతిరేకంగా అతని సమక్షములోనే మాట్లాడి అతని కోపానికి కూడా గురి అవుతూ ఉండేవాడు ఇవాళ అతడు తనసైన్యములో ముఖ్యులగు కొందరు సైన్యాధిపతులను సమావేశపర్చి తనతండ్రి యొక్క దుష్టస్వభావమును, అతని దుర్మార్గములను, కుతంత్రములను గురించిచెప్పి వారితో ఇలా అన్నాడు—"నేను మా పినతండ్రి సహాయానికి తోండాకు బయలుదేరి వెళతాను మీలో నన్నుకోరేవాళ్ళు నా వెంట రండి."

సైన్యాధిపతులు రాకుమారునికి సలాముచేసి వినమ్రులై ఇలా అన్నారు—"రాకుమారులు చెప్పినది యదార్థమే. రేపే మన సైన్యాలన్నీ తోండాలో రాకుమారులను కలుసుకుంటాయి" ముహమ్మద్ అదే రోజున నదినిదాటి షుజా వద్దకు చేరుకున్నాడు

తోండా శిబిరంలో సంతోషం వ్యాపించింది యుద్ధ విషయాలనే అందరూ మర్చిపోయారు ఇంత కాలం పురుషులు మాత్రమే తీరిక లేకుండా పనుల్లో మునిగిఉన్నారు ఇప్పుడు షుజా పరివారంలోని స్త్రీలకు కూడా చేతినిండా పనికగిలింది షుజా అత్యంత స్నేహపూర్వకంగా, సంతోషంతో ముహమ్మద్‌ను ఆహ్వానించాడు నృత్యగానాలతో, మంగళవాయిద్యాలతో వివాహకార్యములు చురుకుగా జరుగుతున్నాయి. నృత్యగానాలు ముగియకముందే చక్రవర్తి సైన్యాలు సమీపానికి చేరుకున్నాయనే వార్త అందింది

ఇటు రాకుమారుడు ముహమ్మద్ షుజా శిబిరానికి వెళ్ళగానే సైనికులు మీర్‌జుమలాకు వర్తమానం పంపారు. "రాకుమారుడు తెలిసి ఆపదలో చిక్కుకొంటున్నాడు వారు అక్కడికి వెళ్ళటం పిచ్చితనమే" అని సైనికులు అనుకున్నారు

చక్రవర్తి సైన్యములో ఎక్కువభాగము యుద్ధరంగంలో ముహమ్మద్‌కు సహాయపడుతుందనే షుజా, ముహమ్మద్‌లు ఆశించారు. ఇదే ఆశతో తన జండాను ఎగరవేసి ముహమ్మద్ యుద్ధరంగానికి వెళ్ళాడు. చక్రవర్తి సైన్యములో ఒక భాగము ముహమ్మద్ వైపు బయలుదేరింది. ముహమ్మద్ సైన్యము మీద ఫిరంగులు పేల్చసాగారు. అప్పుడు ముహమ్మద్‌కు పరిస్థితులన్నీ అర్థమయ్యాయి కానీ ఇప్పుడిక ఏమిచేయుటకు అవకాశంలేదు. సైన్యము పారిపోసాగింది షుజా పెద్దకుమారుడు యుద్ధములో చనిపోయాడు

అదేరోజు రాత్రి దురదృష్టవంతుడగు షుజా అతని అల్లుడు పరివారంతోసహా వేగముగాపోవు నావలో ఢాకావైపు బయలుదేరారు. మీర్‌జుమలా ఢాకావరకు షుజాను తరుముకు వెళ్ళటము ఉచితమని భావించలేదు అతడు జయించిన దేశాలన్నింటితో సంబంధాలు ఏర్పరచుకో సాగాడు

కష్టకాలంలో, ఆపదలో ఉన్నప్పుడు విరక్తి కలుగసాగింది. ఇంతకుముందు ముహమ్మద్ ధన సంపదలు, ప్రాణమానములు తుచ్ఛముగా భావించి షుజాపక్షము వహించాడు షుజా ముహమ్మద్‌ను తన ప్రాణాలకంటె అధికంగా ప్రేమిస్తున్నాడు.

అదే సమయాన ఢాకాలో ఔరంగజేబు యొక్క ఒక గూఢచారి పట్టుబడ్డాడు. అతనివద్ద షుజాకు ఒక జాబుదొరికింది. అది ఔరంగజేబు ముహమ్మద్‌కు వ్రాసినజాబు. దానిలో ఇలా ఉంది-"ప్రాణ ప్రియపుత్రుడు ముహమ్మద్‌కు మోస ముతో కూడిన స్త్రీల దరహాసములకు ముగ్ధుడవై నీ కర్తవ్య మును మరచి నీ వంశానికి కళంకము తెస్తున్నావు భవిష్య త్తులో ఈ విశాల ముగలు సామ్రాజ్యానికి అధినేతవు కావల సిన నువ్వు ఒకస్త్రీకి బానిసవై పోయావా? పరమ దయామయు డగు భగవంతుని సాక్షిగా ప్రతిజ్ఞచేసి నువ్వు పశ్చాత్తాపము వ్యక్తము చేశావు గనుక నిన్ను మేము క్షమించాము, కానీ నువ్వు వెళ్ళిన కార్యమును నెరవేర్చుకొని వచ్చినట్లయితే మా అభిమాన పాత్రుడవు కాగలవు"

ఈ జాబు చదివి షుజాకు పిడుగుపడి నట్లనిపించింది. అతని ఆశలన్నీ నిరాశలయ్యాయి.

"నేను పారిముందు ఎలాంటి పశ్చాత్తాపమూ వ్యక్తం చేయలేదు ఇదంతా మా తండ్రియొక్క కుట్ర" అని ముహా మ్మద్ అనేక విధాల షుజాకు నచ్చచెప్పాలని ప్రయత్నిం చాడు. కానీ షుజా అనుమానం తీరలేదు. షుజా మూడు రోజులవరకు ఇదే విషయాన్ని గురించి ఆలోచించాడు. చివ రికి అతడు ముహామ్మద్‌ను పిలిచి ఇలా చెప్పాడు-"నాయనా! మా నమ్మకము చెదిరిపోయింది. కనుక నువ్వు నీ భార్యను తీసుకొని ఇక్కడినుంచి వెళ్ళిపోవలసిందిగా కోరుతున్నాను. లేనిచో నాకు మనశ్శాంతి ఉండదు. ఖజానానుంచి మామగా

రిచ్చు కట్నము కానుకల రూపంలో నీకు కావలసినంత ధనము, రత్నములు తీసుకువెళ్ళు"

ముహమ్మద్ కంట తడిపెట్టుకొని మామగారివద్ద శలవు తీసుకున్నాడు అతని భార్యకూడా వెంట బయలు దేరింది.

"నేనిక యుద్ధం చేయను చట్టగ్రామానికి వెళ్ళి ఆ రేవునుంచి ఓడలో మక్కాకు వెళ్ళిపోతాను" అని చెప్పి షుజా మారువేషములో ఢాకాను వదలివెళ్ళాడు.

# 44

వర్షాకాలంలో ఒకనాటి మధ్యాహ్నము తరువాత గోవిందమాణిక్యుడు నివసించుచున్న దుర్గము ప్రక్కనేఉన్న మార్గాన ఒక ఫకీరు, ముగ్గురు బాలురు, ఒక మధ్యవయస్కుడు మూట ముల్లె మోసుకొని పోతున్నారు. ముగ్గురు బాలురు బాగా అలసిపోయినట్లు కన్పిస్తున్నారు గాలి తీవ్రంగావీస్తూ ఉంది. వర్షంకూడా ఎడ తెగకుండా కురుస్తూనేఉంది. ముగ్గురిలో చిన్నవాని వయస్సు పదునాలుగేండ్లకు మించి ఉండదు. అతడు చలికి వణుకుతూ "నాన్నగారూ, నేనిక నడవలేను" అని జంకుతూ చెప్పి మరుక్షణమే ఏడ్వసాగాడు.

ఫకీరు ఒకసారి నిట్టూర్చటంతప్ప ఏమీమాట్లాడ లేదు. ఆ బాలుణ్ని తన దగ్గరకు లాక్కున్నాడు.

పెద్ద బాలుడు చిన్నవానిని నిందిస్తూ "దారిలో ఇలా ఏడ్చినందువల్ల లాభం ఏమిటి ? ఏడ్వకు, అనవసరంగా నాన్న గారికి కష్టం కలిగించకు" అని అన్నాడు.

చిన్నబాలుడు ఏడుపును దిగమింగి వెక్కి వెక్కి నెమ్మదిగా ఏడ్వసాగాడు.

"నాన్నగారూ, మనం ఎక్కడికి వెళుతున్నాము?" అని అడిగాడు రెండో బాలుడు

"అదుగో, అక్కడొక దుర్గశిఖరం కన్పిస్తుంది చూశావా, మనం అక్కడికే వెళుతున్నాం" అని చెప్పాడు ఫకీరు

"అక్కడ ఎవరున్నారు, నాన్నగారూ?"

"ఎవరో ఒక మహారాజు సన్యాసియై అక్కడ ఉంటున్నారట!"

"మహారాజు సన్యాసి ఎందుకవుతారు!"

"తెలియదు, నాయనా! వారి సోదరుడు సైన్య సమేతుడై వచ్చి వారిని గ్రామంలోని కుక్కను తరిమివేసినట్లు దేశంనుంచి వెళ్ళగొట్టాకని వింటున్నాము-రాజ్యము, సుఖ సంపదలు అతని తమ్ముని వశమయ్యాయి. క్షుద్రమగు దారిద్ర్యపు అంధకారము, సన్యాసుల కాషాయ వస్త్రములే, ఈ ప్రపంచంలో దాగిఉండుటకు ఏకైక సాధనాలేమో! సోదరుని విషదంతాలనుండి, అతని శత్రుత్వాన్నుంచి ఎక్కడా రక్షణ ఉండదు."

ఈమాట అన్నతరువాత ఫకీరు గట్టిగా పెదవులను నొక్కకొని హృదయావేగాన్ని ఆపుకున్నాడు.

"నాన్నగారూ, ఈ సన్యాసి ఏదేశపు మహారాజు?" అని అడిగాడు పెద్దకుమారుడు.

"తెలియదు నాయనా?"

"వారు మనకు ఆశ్రయం ఇవ్వకపోతే ఎలా?"

"మనం చెట్టుక్రిందనే నిద్రపోదాం అంతకంటె వేరే ఆశ్రయం ఎక్కడ లభిస్తుంది?"

సూర్యాస్తమయానికి కొంచెం ముందు దుర్గములో సన్యాసి, ఫకీరు కలుసుకున్నారు. ఒకరినొకరు చూచుకొని ఇద్దరూ చకితులయ్యారు.

గోవిందమాణిక్యుడు పరిశీలనగా ఫకీరు ముఖంలోకి చూచాడు. అతనిని ఫకీరు అనటం వారికి సబబుగా కన్పించ లేదు. అత్యంత స్వల్పమగు స్వార్థముతో కూడిన కోర్కెలను సైతం త్యజించి ఏకైక ఉన్నదార్శమును కలిగి ఉన్నప్పుడు, అలాంటి వారి ముఖములో ఒకవిధమైన నిర్మలకాంతి ప్రకాశిస్తూ ఉంటుంది. అలాంటి కాంతి ఆ ఫకీరు ముఖంలో వారికి కన్పించలేదు. ఫకీరు అనుక్షణం ఏదో భయపడుతున్నాడు. ప్రతి విషయానికి ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తున్నాడు. అతని హృదయంలోని దాహముగొన్న కోర్కెలన్నీ మండుచున్న అతని నేత్రాలనుంచి నిప్పులు కురిపిస్తున్నట్లు ఉన్నాయి. అతనిలో ఆరాటపడుతున్న హింసాప్రవృత్తి గట్టిగా మూసుకొని ఉన్న పెదవులమధ్య విధిలేక ఆగిపోయినట్లుంది. కానీ హృదయ గహ్వరములో ప్రవేశించి తనమీద తానే ఆగ్రహపడుచున్నట్లుగా ఉంది.

వెంట ముగ్గురు బాలురు! ముగ్గురూ అత్యంత సుకుమారులు, ఎంతో అందంగా ఉన్నారు, అలసిపోయిన వారి శరీరాలను, అభిమాన పూర్వకమగు వారి సంకోచమును చూచినచో వారి జీవితాలు అమిత సుఖాలతో, అత్యంత

గౌరవనీయంగా గడచి ఉంటాయనే అర్థమవుతుంది. వారు ఇంతకుముందు ఎప్పుడూ కాలినడకన నడచి ఎరుగరని కూడా గ్రహించవచ్చును. 'నడిస్తే కాళ్ళకు దుమ్ముకొట్టుకుంటుంది' అనే విషయం వారికి ఇంతకుముందు తెలియనట్లుంది. భూమి మీదఉన్న ఈ దుమ్మును, దారిద్ర్యమును చూచి అసూగడున వారుఈ భూమిని అసహ్యించుకో సాగారు మెత్తనిపట్టుపరుపులకుమట్టికి ఉన్న తేడాను చూచి అసూగడుగున వారు ఈ భూమాతను నిందించేవారు. ఈ భూమిని ప్రత్యేకంగా తమ యందు కక్షతో తమ సుఖ సంపదలను దోచుకున్నట్లు వారు భావించసాగిరి. వారికి అందరూ అపరాధం చేస్తున్నట్లే కన్పించేవారు. దరిద్రులు భిక్షకోసము మలినమగు దుస్తులతో వారి చెంతకు వెళ్ళుటకు సాహసించినప్పుడు అది వారి అహంకారమనే తలచేవారు. అసహ్యంగా ఉన్న కుక్క దగ్గరకువస్తుందని భయపడి ముందుగానే పట్టెడు ఎంగిలి దాని ముందు వేస్తారు. వీరుకూడా అదేవిధంగా దరిద్రులను, భిక్షకులను చూచి వాళ్ళను చూడటమే పాపమన్నట్లు ముఖం త్రిప్పుకొని గుప్పెడు డబ్బులు విసరి వేయగలరు. ప్రపంచములోని ఈదారిద్ర్యము వారి దృష్టిలో తమపట్ల అమర్యాదగానే కన్పించేది. తాము సుఖంగా లేకపోవుటకు, గౌరవమర్యాదలు పొందకపోవుటకూ ఈ ప్రపంచానిదే దోషమని తలచుచుండేవారు.

గోవిందమాణిక్యుడు ఇంతదూరం ఆలోచించటం అనవసరమే తరువాత వ్యక్తమయిన లక్షణాలనుబట్టి ఫకీరు తన కోర్కెలను త్యజించి, స్వతంత్రుడై, స్థితప్రజ్ఞుడై లోకకళ్యాణానికి బయలుదేరలేదు. తన కోర్కెలు తీరనందువల్ల ద్వేష

భావంతో మాత్రమే అతనికి ప్రపంచమంటే విరక్తి కలిగింది. ప్రపంచం ఇచ్చినా ఇవ్వకపోయినా తానుకోరేది తనకు లభిం చాలనేదే ఫకీరు నమ్మకం. అతని నమ్మకానికి వ్యతిరేకంగా జరిగినందువల్లనే అతడు ప్రపంచంతో సంబంధాలు తెగ త్రెంచుకొని ఇలా బయలుదేరి వచ్చాడు.

గోవిందమాణిక్యుని చూచి ఫకీరు వారిని 'మహారాజా, అని పిలవాలనుకున్నాడు సన్యాసి అని అనటం కూడా అతనికి సబబుగా కన్పించలేదు.

పెద్దతలపాగా చుట్టి బాగా బలిసిన ఒకలంబోదరుడుగా గానీ, లేదా మాసిన దుస్తులు ధరించిన ఒక దరిద్ర సన్యాసి శరీరంనిండా విభూతి పులుముకొని, నేలమీదనే పడుకొంటూ మిక్కిలి అహంకారిగాగానీ, గోవిందమాణిక్యుడు ఉంటాడని ఫకీరుఆలోచించాడు. కానీ గోవిందమాణిక్యుడు ఫకీరుఆలోచిం చినట్లులేరు. వారిలో అతడు ఆలోచించినవేమీకన్పించలేదు. గోవిందమాణిక్యుని చూచినప్పుడు వారు సర్వమూ త్యజించి నప్పటికీ సమస్తమూ వారివేనన్నట్లు అనిపిస్తుంది వారికి కోర్కెలనేవేలేవు. అందుకనే వారికి సర్వమూ లభిం చాయి. వారు ఏ విధంగా ఆత్మసమర్పణ గావించారో అదే విధంగా ప్రపంచమంతా తనకుతానై వారి దగ్గరకు వచ్చింది. ఎలాంటి ఆడంబరమూ లేదు అందుకే వారు మహారాజు ప్రపంచమంతా వారికి అత్యంత సమీపాన ఉందిగనుక వారు సన్యాసి. ఈ కారణం వల్లనే వారు ఇటు మహారాజుగానీ అటు సన్యాసిగానీ కానవసరం లేకపోయింది.

మహారాజుగారు తమ అతిథులకు చక్కగా సేవ చేశారు. కానీ వారు మహారాజుగారి సేవను తృణీకార భావంతోనే స్వీకరించారు మహారాజుగారి సేవలు పొందుటకు తమకు పూర్తి అధికారం ఉన్నట్లు వ్యవహరించారు తమ విశ్రాంతికి కావలసిన వస్తువులేమిటో వారు మహారాజుగారితో చెప్పారు.

మహారాజుగారు స్నేహపూర్వకంగా పెద్దబాలుని ఉద్దేశించి "ప్రయాణంవల్ల బాగా అలసిపోయారా?" అని అడిగారు.

అతడు మహారాజుగారికి జవాబు చెప్పకుండా ఫకీరుకు దగ్గరగా జరిగి కూర్చున్నాడు మహారాజుగారు ఆ బాలుర వైపు చూచి చిరునవ్వు నవ్వుతూ "మీరు సుకుమారులు దూరప్రయాణం చేయలేరు. మీరు ఇక్కడే ఉండండి, ఇక్కడ మీకు ఏమీలోపం జరుగకుండా చూస్తాను" అని అన్నారు

మహారాజుగారి మాటకు జవాబు చెప్పాలో లేదో, అసలు బయటి మనుష్యులతో ఎలా వ్యవహరించాలో ఆ బాలురు ఆలోచించలేదు వారు ముగ్గురూ ఫకీరుకు మరింత దగ్గరగా జరిగికూర్చున్నారు

"అలాగే, మేము కొద్దిరోజులు ఇక్కడ ఉండగలము" అని మహారాజుగారియందు ఏదో దయతలచినట్లు అన్నాడు ఫకీరు.

"మేము ఎవరో తెలిస్తే ఇక్కడ ఉన్నందుకు నువ్వే ఎంతో సంతోషిస్తావు" అని ఫకీరు తన మనస్సులో అనుకున్నాడు.

మహారాజుగారు ఆ ముగ్గురు బాలుర్నీ ఏ విధం గానూ తమవైపు ఆకర్షించుకోలేకపోయారు. ఫకీరు కూడా పూర్తిగా నిర్లిప్తంగా ఉన్నాడు.

"మీరు ఒకప్పుడు రాజులని విన్నాం. ఏ దేశానికి రాజు!" అని ప్రశ్నించాడు ఫకీరు

"త్రిపుర కు" అనిగోవిందమాణిక్యుడు జవాబుచెప్పారు.

అది విని ఆ బాలురు వారు చాలా చిన్న రాజు అని అనుకున్నారు అంతకుముందెప్పుడూ వారు ఆ పేరే విన లేదు కానీ ఫకీరు కొద్దిగా చలించాడు. "రాజ్యాన్ని ఎలా పోగొట్టుకున్నారు?" అని ప్రశ్నించాడు ఫకీరు

గోవిందమాణిక్యుడు కొద్దిక్షణాలు మౌనం వహించి తరువాత "బెంగాలు నవాబు షుజా చక్రవర్తి నన్ను దేశం నుండి బహిష్కరించారు" అని జవాబు చెప్పారు. కానీ నక్షత్రరాయల సంగతి మాత్రం ఏమీ చెప్పలేదు.

ఈ మాట విని ముగ్గురు బాలురు త్రుళ్ళిపడి ఫకీరు ముఖంలోకి చూచారు ఫకీరు ముఖం వెల వెల బోయింది అతడు వెంటనే అందుకొని "అర్థమయింది! ఇదంతా మీ తమ్ముని పని మీ తమ్ముడు నిన్ను రాజ్యము నుండి బహిష్క రించి సన్యాసిగా చేశాడన్నమాట!" అని అన్నాడు.

మహారాజుగారికి చాలా ఆశ్చర్యం కలిగింది. "ఈ సంగతి తమకెలా తెలిసింది?" అని అడిగారు. ఇందులో ఆశ్చర్య పడాల్సిదేమీ లేదు. ఎవరో చెప్పి ఉంటారు అనే తరువాత ఆలోచించారు.

"నాకేమీ తెలియదు ఆ విధంగా నేను అనుమా నించాను" అన్నాడు ఫకీరు

ఆ రాత్రి అందరూ నిద్రపోయారు కానీ ఫకీరుకు మాత్రం రాత్రంతా నిద్రపట్టలేదు జాగృతావస్థలోనే అతనికి పీడకలలు రాసాగాయి చిన్న చప్పుడైతేచాలు త్రుళ్ళిపడి లేచేవాడు.

మర్నాడు ఫకీరు గోవిందమాణిక్యునితో "ముఖ్యమైన పని ఉన్నందువల్ల ఇక్కడ ఆగుటకు వీలుపడదు. మేము ఇవాళే బయలుదేరి వెళతాం" అని చెప్పాడు.

"ప్రయాణం వల్ల బాగా అలసిపోయినట్లున్నారు. కొద్ది రోజులు విశ్రాంతి తీసుకుంటే మంచిది" అని అన్నారు మహా రాజుగారు

ఆమాట విని బాలురకు కొంతవిరక్తి కలిగింది. వారిలో పెద్దవాడు ఫకీరువైపుచూచి "అవసరమైతే మేము కష్టాలను భరించగలం, మరీ అంత చిన్నపిల్లలంకాదు" అని అన్నాడు. గోవిందమాణిక్యుని స్నేహదానం అతనికి ఇష్టంలేదు. అదివిని మహారాజుగారు ఏమీ మాట్లాడలేదు.

ఫకీరు వెళ్ళుటకు సిద్ధమవుతూ ఉన్న సమయంలోనే దుర్గములోనికి మరొక అతిథివచ్చాడు. అతనిని చూచి మహా రాజుగారు, ఫకీరు ఇద్దరూ నిశ్చేష్టులై పోయారు. ఏం చేయాలో ఫకీరు ఏమీ ఆలోచించలేకపోయాడు. మహారాజు గారు ఆ అతిథికి నమస్కరించారు. ఆ అతిథి మరెనరోకాదు అతడు రఘుపతి రఘుపతి మహారాజుగారి నమస్కారాన్ని స్వీకరిస్తూ "జయం కలుగుగాక!" అన్నాడు.

మహారాజుగారు ఆనర్దాగా "నక్షత్రునివద్దనుంచే వస్తున్నారా, పూజారిగారూ? అందరూ క్షేమమేనా?" అని అడిగారు

రఘుపతి ఇలా జవాబు చెప్పాడు—"నక్షత్రరాయలు క్షేమమే తమరు అతనిని గురించి ఆలోచించవద్దు" అని అతడు చేతితో ఆకాశంవైపు చూపిస్తూ "నన్ను జయసింహుడు మీావద్దకు పంపాడు అతడు జీవించిలేడు. కానీ నేను అతని కోర్కెను పూర్తిచేస్తాను. లేనిచో నాకు శాంతిలభించదు. మీావద్దఉండి, మీాకు స్నేహితునిగా, మీారుచేయు పనులన్నింటిలో మీాకు సహాయంగా ఉంటాను" అని అన్నాడు.

మొదట రఘుపతి మాటలు మహారాజుగారికి అర్థం కాలేదు. 'రఘుపతి పిచ్చివాడయ్యాడు' అని వారు మనస్సులో అనుకున్నారు

రఘుపతిమళ్ళీ ఇలా చెప్పాడు-"నేను అన్నీ చూచాను, ఎక్కడా సుఖంలేదు-హింసలోనూ సుఖంలేదు, రాజ్యాధికారంలోనూ సుఖంలేదు. మీారు అనుసరించిన మార్గంలోనే నిజమైన సుఖంఉంది. నేను మీాతో శత్రుత్వం వహించాను, మిమ్మల్ని ద్వేషించాను. నా కళ్ళఎదుట మిమ్మల్ని బలివ్వాలనుకున్నాను, ఇవాళ నేనే నా సర్వస్వమూ త్యజించుటకు మీా వద్దకు వచ్చాను."

"పూజారిగారూ! మీారు నాకు చాలా ఉపకారం చేశారు. నా శత్రువు నీడవలె నన్ను అనుసరించిఉండేవాడు. అతని చేతుల్లోనుంచి మీారు నాకు విముక్తి కలిగించారు" అని అన్నారు మహారాజుగారు.

రఘుపతి వారి మాటలు విన్పించుకోలేదు తిరిగి ఇలా అన్నాడు-"మహారాజా, అనేక ప్రాణుల రక్తంతో ఒకప్పుడు నేను ఏ రాక్షసిని ఆరాధించానో చివరికి ఆ రాక్షసి నా హృదయంలోని రక్తానంతా పీల్చివేసింది రక్తపిపాసగల ఆ అజ్ఞానమునూ, మూర్ఖత్వమునూ త్యజించి వచ్చాను. ఇప్పుడా రాక్షసి మహారాజుగారి రాజ్యములోని ఆలయంలో లేదు ఇప్పుడామె రాజసభలోకి ప్రవేశించి సింహాసనాన్ని అధిష్టించిఉంది."

"ఆమె దేవాలయం నుంచి గనుక వెళ్ళిపోయినట్లయితే ప్రజల హృదయాలనుంచి కూడా తొలగిపోతుంది" అని అన్నారు మహారాజుగారు.

వెనుకనుంచి ఒక కంఠస్వరం విన్పించింది—"లేదు మహారాజా, మానవ హృదయమే ఆమెకు ప్రకృతి సిద్ధమగు ఆలయం అక్కడే కత్తికి పదునెక్కుతుంది. అక్కడే నరబలి జరుగుతుంది ఆలయంలో దాని నాటకం మాత్రమే జరుగుతూ ఉంటుంది."

మహారాజుగారు త్రుళ్ళిపడి అటుచూచారు, ప్రసన్న వదనుడు, దయామూర్తి బిల్వణుడు కన్పించాడు. మహారాజుగారు అతనికి నమస్కరించి "ఇవాళ ఎంతసుదినం!" అన్నారు.

"మహారాజా, మిమ్మల్ని మీరు జయించి అందరి మీదా విజయం పొందారు అందుకనే ఇవ్వాళ మిత్రులు, శత్రువులు అందరూ మీ ద్వారం ముందుకు చేరుకున్నారు" అన్నాడు బిల్వణుడు

ఫకీరు ముందుకువచ్చి "మహారాజా, నేనుకూడా మీ శత్రువునే. నేనుకూడా ఆత్మసమర్పణ గావిస్తున్నాను"

అన్నాడు తరువాత రఘుపతివైపు వ్రేలెత్తి చూపిస్తూ ఇలా అన్నాడు–"ఈ పూజారిగారు నన్నెరుగుదురు నేనే షుజాను బెంగాలు చక్రవర్తిని. నిరపరాధియగు మిమ్మల్ని దేశంనుంచి బహిష్కరించినది నేనే. నేను చేసిన పాపానికి తగిన శిక్షను కూడా పొందాను. మా అన్నగారి క్రూరస్వభావము ఇవాళ ప్రతిమార్గంలోనూ నన్ను వెంటబడి తరుముతూనేఉంది. నా రాజ్యంలో ఇప్పుడు నాకు నిలబడటానికి కూడా చోటులేదు మారువేషంలో నేనిక ఉండలేను మీా ఎదుట ఆత్మసమర్పణ గావించి నేను విముక్తి చెందాను"

మహారాజుగారు, నవాబు కౌగలించుకున్నారు. "ఇదంతా నా అదృష్టం!" అని మాత్రమే అన్నారు మహారాజుగారు.

"మహారాజా! శత్రుత్వం వహించటంలో కూడా లాభం ఉంది. మీాతో శత్రుత్వం వహించినందువల్లనే ఇవాళ మీాకు దగ్గరగా రాగలిగాను. లేనిచో మిమ్మల్ని అర్థం చేసుకోగలిగేవాడినే కాదు" అని అన్నాడు రఘుపతి.

బిల్వాణుడు నవ్వి "వలలో చిక్కుకున్న తరువాత దాని నుంచి తప్పించుకోవాలని ప్రయత్నించి మరింత చిక్కుకుంటాం" అని అన్నాడు

"ఇప్పుడిక నా కెలాంటి కష్టమూ, దుఃఖమూ లేవు, నాకు శాంతి లభించింది" అన్నాడు రఘుపతి.

"సుఖము, శాంతి అనేవి మనలోపలే ఉంటాయి కానీ మనం తెలుసుకోలేము భగవంతుడు చేసిన ఈ మట్టిపాత్రలో అమృతం ఉంది. కానీ 'ఈపాత్రలో అమృతం ఉంది' అని

చెపితే ఎవరూ నమ్మరు. దెబ్బతగిలి పాత్ర పగిలిపోయినప్పుడు మాత్రమే ఆఅమృతంయొక్క రుచి తెలుస్తుంది అయ్యయ్యో, ఇలాంటి వస్తువు పాత్రలో వుంటుందా!''

అదేసమయ లో దిక్కులుపిక్కటిల్లునట్లు 'హాఁ!హాఁ!' అని కేకలువేస్తూ అనేకమంది శాలువు కోటలోనికి వచ్చారు.

మహారాజుగారు బిల్హణునితో "పూజారిగారూ, ఇదుగో నా ధ్రువుడు!'' అంటూ ఆ బాలుడను చూపించారు.

"ఎవని దయవల్ల మీారీ పిల్లల్ని పొందగలిగారో అతడు కూడా మిమ్మల్ని మర్చిపోలేదు'' అన్నాడు బిల్హణుడు.

ఈమాట అని బిల్హణుడు బయటకు వెళ్ళిపోయాడు. కొద్దిసేపట్లో ధ్రువుణ్ణి ఎత్తుకొనివచ్చి మహారాజుగారికి అప్ప గించాడు.

"ధ్రువా!'' అంటూ మహారాజుగారు అతనిని హృద యానికి హత్తుకున్నాడు.

ధ్రువుడు ఏమిా మాట్లాడలేదు. గంభీరంగా మొదల కుండా మహారాజుగారి భుజంమిాద తలపెట్టుకొని పడు కున్నాడు చిర వియోగానంతరం తొలికలయిక సమయంలో అతని పసిహృదయంలో ఒకవిధమైన అస్పష్టమగు సిగ్గు, అభి మానము ఉత్పన్నమయ్యాయి. అతడు మహారాజుగారిని కౌగలించుకొని ముఖం దాచుకున్నాడు.

"అన్నీ జరిగాయి, నక్షత్రరాయలు మాత్రం 'అన్నా' అని పిలవలేదు'' అన్నారు మహారాజుగారు.

షుజా ఉద్రేకపడుతూ ఇలా అన్నాడు—"మహా రాజా, అన్యులు అందరూ సోదరుని వలె సునాయాసంగా

వ్యవహరిస్తారు. కానీ స్వంతసోదరుడు మాత్రమే అలా చేయ లేడు."

షుజా హృదయంలో ఉన్న ఆ శూలము ఇంకా తొలగి పోలేదు.

# 45

ఫకీరు వెంట ఉన్న ముగ్గురు బాలురు, అతనికూడా రాత్రిలే మారువేషాలలో ఉన్నారు షుజా మక్కాకు వెళ్ళాలనే ఉద్దేశ్యంతో చట్టగామపురుడ రేవుకు వెళ్ళాడు. కానీ వర్షంకురుస్తూ ఉన్నందువల్ల అక్కడ అతనికి బయలుదేరే ఓడలేవీ లభించ లేదు చివరికి నిరాశచెంది తిరిగి వచ్చేసమయంలోనే గోవింద మాణిక్యుని దుర్గములోవారిని కలుసుకున్నాడు కొంతకాలం దుర్గములోనే ఉన్నతరువాత చక్రవర్తి సైనికులు తనకోసం ఇక్కడకూడా వెతుకుతున్నాయనే వార్త షుజాకు తెలిసింది గోవిందమాణిక్యుడు వాహనములు, అనేకమంది సేవకులను ఇచ్చి షుజాను తమ మిత్రుడు అరాకాన్ మహారాజువద్దకు పంపివేశారు.

ఈ లోపల మహారాజుగారు, రఘుపతి, బిల్వణుడు ముగ్గురూ కలిసి గ్రామానికి ప్రాణంపోసి నూతన్నోత్సాన్ని కల్గించారు. మహారాజుగారిదుర్గము గ్రామానికంతటికీ ప్రాణ సమానమయింది.

ఈ విధంగా ఆరుసంవత్సరాలు గడిచేసరికి ఛత్రమాణిక్యుడు చనిపోయాడు.

తిరిగి గోవిందమాణిక్య ప్రభువును త్రిపురకు పిలుచుకొని వెళ్ళుటకు అక్కడినుండి మహారాజుగారివద్దకు ఒక దూత వచ్చాడు

"నేను తిరిగి అక్కడికి రాను" అని మహారాజుగారు జవాబు చెప్పారు

బిల్వాణుడు వారి మాటకు అడ్డొస్తూ "మహారాజా, అలా వీల్లేదు. ధర్మము స్వయంగా మీ వద్దకువచ్చి పిలిచినప్పుడు దానిని తిరస్కరించుటకు వీల్లేదు" అని అన్నాడు.

మహారాజుగారు తమ శిష్యులవైపు చూచి "ఇంతకాలం నుంచి నేను ఆశించినది అసంపూర్తిగా నిలిచిపోతుంది. ఇంతకాలం నేను చేసిన కృషి అసంపూర్తిగా మిగిలిపోతుంది" అని అన్నారు

"మీ పనిని ఇక్కడ ఉండి నేను పూర్తి చేస్తాను" అని చెప్పాడు బిల్వాణుడు.

"మీరు ఇక్కడ ఉంటే, నేను అక్కడ చేసే పనులన్నీ అసంపూర్తిగా ఉండిపోతాయి" అన్నారు మహారాజాగారు

"లేదు మహారాజా! ఇప్పుడిక మీకు నా అవసరం లేదు. ఇప్పుడు మీరు సంపూర్ణ ఆత్మవిశ్వాసంతో ఉండగలరు. అవకాశం లభించినప్పుడు మధ్యమధ్య మిమ్మల్ని కలుసుకొనుటకు వస్తూ వుంటాను" అని అన్నాడు బిల్వాణుడు.

మహారాజుగారు ధ్రువుణ్ణి వెంటతీసుకొని తమ రాజ్యంలోకి ప్రవేశించారు. ధ్రువుడు ఇప్పుడు మరీ చిన్నవాడు కాదు. బిల్వాణుని దయవల్ల సంస్కృతం నేర్చుకొని శాస్త్రాలను అధ్యయనం చేస్తున్నాడు. రఘుపతి తిరిగి రాజపురోహిత పద

విని స్వీకరించాడు ఈసారి అతడు ఆలయంలోనికి వచ్చినప్పుడు చనిపోయిన జయసింహుడు జీవించి ఉన్నట్లే భావించాడు.

ఆటు విశ్వాస ఘాతకుడగు అరాకాన్ మహారాజు షుజాను హత్యగావించి అతని చిన్న కుమార్తెను వివాహ మాడాడు.

అరాకాన్ రాజు షుజాను హత్యగావించాడని విని గోవిందమాణిక్యునికి చాలా దుఃఖం కలిగింది. షుజా పేరును చిరస్మరణీయం చేయుటకుగాను వారు ఆ ఖడ్గమునకు బదులుగా ఎంతో వ్యయప్రయాసలకోర్చి కుమిల్లా నగరంలో ఒక గొప్పమసీదును కట్టించారు అది నేటికీ షుజా మసీదు అనే పేరుతో పిలవబడుతూ ఉంది.

గోవిందమాణిక్యుని ప్రయత్నంవల్ల మిహిరజాతి విముక్తి చెందింది. వారు అత్యంత సంతోషంతో అనేక భూములను బ్రాహ్మణులకు దానపత్రములు వ్రాసి ఇచ్చారు. గోవిందమాణిక్య మహారాజు కుమిల్లాకు దక్షిణాన ఉన్న బతిసా గ్రామంలో ఒక పెద్ద చెరువును త్రవ్వించారు. వారు అనేక మంచి పనులు ప్రారంభించారు. కానీ పూర్తిచేయలేక పోయారు. ఆ దుఃఖంతోనే వారు క్రీ॥ శ॥ 1669 వ సంవత్సరంలో తమ మానవ లీలను చాలించారు.

❧❧

